# భారతి

మాసపత్రిక



శివలెంక శంభుప్రసాద్

సంపాదకుడు

(1938-1972)



ఫిబ్రవరి 1979

సంపుటము : 56 సంచిక : 2



విడిపత్రిక వెల రూపాయిన్నర

# పరిశ్రమల రంగంలో ముందడుగు

దేశం నడిబొడ్డున వున్న ఆంధ్రప్రదేశ్ రాష్ట్రానికి ప్రకృతి అపారమైన సహజ వనరులను ప్రసాదించింది. ప్రాచీన సంస్కృతీ వైభవం, నవీన నాగరికతా కలబోసిన రంగవల్లి మన రాజధాని. నేడు ఆంధ్రప్రదేశ్ బంగారు భవిష్యత్తుకు బాటలు వేసుకుంటూంది.

రు. 478 కోట్ల పెట్టుబడితో నిర్మించిన 260 భారీ, మధ్యతరహా పరిశ్రమలు రాష్ట్రానికి కొత్త రూపు యిచ్చాయి. రాష్ట్రంలోని మారుమూల ప్రాంతాల్లో సంస్థాగత ఆర్థిక సహాయం గత నాలుగేళ్లగా నాలుగింతలయింది.

రు 232 కోట్ల పెట్టుబడితో కాకినాడలో నిర్మితమయ్యే ఎరువుల కర్మాగారానికి జూలై 7వ తేదీన భారత రాష్ట్రపతి శంకుస్థాపన చేశారు. ఈ కర్మాగారం 1981 నాటికి ఉత్పత్తి ప్రారంభిస్తుంది.

మన రాష్ట్రంలో పారిశ్రామికాభివృద్ధి సంస్థ, రాష్ట్ర ఆర్థిక సహాయక సంస్థ, పారిశ్రామిక ప్రాతిపదిక సౌకర్యాల కల్పనా సంస్థ వంటివెన్నో రాష్ట్రంలో అన్ని ప్రాంతాలా పారిశ్రామికాభివృద్ధికి దోహదం చేస్తున్నాయి. ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర పారిశ్రామికంగా ముందడుగు వేస్తుంది.

*సమాచార, పౌరసంబంధశాఖ, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం హైదరాబాదు*

32/78-79



# విషయానుక్రమణిక

## ఫిబ్రవరి 1979

# బింబం - ప్రతిబింబం

## శ్రీ వసంతరావు వేంకటరావు

బింబం లేకపోయినా,
దర్పణమో, పరావర్తక తలమో,
కటకమో లేకపోయినా,
ప్రతిబింబం లేదు.
బింబ ప్రతిబింబాల లక్షణాలు
ఎప్పుడూ సర్వ సమానాలు కావు
సమతల, పుటాకార, కుంభాకార,
పరవలయిక దర్పణాలూ,
పరావర్తక తలాలూ, కటకాలూ
రకరకాల వెన్నెన్నో ఉన్నాయి.
ప్రతిబింబ లక్షణాలను నిర్ణయించేవి
దర్పణ స్వభావం, దర్పణ దూరం.
ఒకే దర్పణంలో ప్రతిబింబం
వాస్తవం కావచ్చు, మిధ్యకావచ్చు,
కొన్ని దర్పణా లెప్పుడూ
మిధ్యా ప్రతిబింబాలనే ఏర్పరుస్తాయి.
బింబలక్షణాలన్నీ ప్రతిబింబంలో
లేకపోవడమేకాక,
లేనివి ఆపాదితం కావచ్చు.
కుడి ఎడమలు మాత్రమే
కొన్నిటిలో తారుమారుకాగా,
కొన్నిటిలో ప్రతిబింబాలు దీర్ఘమై,
కొన్నిటిలో హ్రస్వం కావచ్చు,
బింబంలో లేని వక్రతా, వర్ణమూ
ప్రతిబింబంలో ప్రత్యక్షం కావచ్చు.
ఎంత పరిమళరోజా పుష్ప ప్రతిబింబమైనా
పరిమళాన్ని ప్రతిఫలించలేదు కదా ?
ఎంత దక్షతగల కటకమైనా
వ్యక్తి పూసుకొన్న సెంటును
ఫోటోలో గుబాళించలేదుకదా ?
అవి దర్పణ కటకాల
పరిమితత్వం మాత్రమే !
మిధ్యా వాస్తవాల మధ్య,
దీర్ఘహ్రస్వాలమధ్య,
ఋజువక్రతలమధ్య
దర్పణ లక్షణాలనుబట్టి
ప్రతిబింబాలు ఊగులాడుతాయి.
పరావర్తన నియమాలు
క్షుణ్ణంగా తెలిసినవారు
ప్రతిబింబలక్షణాల రహస్యం
గ్రహించి, మోసపోక
ఈ అభిలక్షణాలనే బింబానికి
ఆరోపించక, బింబస్థితివి
యధార్థంగా నిర్ణయిస్తారు.

* * *

భగవంతుడు బింబమైతే,
ప్రకృతి దర్పణంలో ప్రతిఫలించే
ప్రతిబింబం జీవుడు.
చంచల ప్రకృతి బహువిధ
దర్పణాలుగా, పరావర్తకాలుగా,
కటకాలుగా ప్రవర్తించి ఏర్పరిచే
ప్రతిబింబాలలో
బింబ నిజలక్షణాల నన్వేషించే
జీవుడు ప్రకృతి నియమాలను క్షుణ్ణంగా
అర్థం చేసుకో కలిగితే
ప్రతిబింబ లక్షణాలకు మోసపోక
తన నిజస్వరూపాన్ని
దర్శించగలడు.
ప్రకృతి దర్పణాన్ని
తొలిగించ కలిగిననాడు
ప్రతిబింబం బింబంతో లీనమై
బింబ ప్రతి బింబాల
లక్షణా లేకమవుతాయి !
అందుకే, శంకర భగవత్పాదులన్నారు :
"శ్లోకార్థేన ప్రవక్ష్యామి
యదుక్తం గ్రంథకోటిభిః
బ్రహ్మసత్యం, జగన్మిధ్యా,
జీవో బ్రహ్మైవ నా పరః॥"

డా. జి. వి. రత్నం

# హంసవింశతి - వీధిబళ్ళ తీరుతెన్నులు

హంస వింశతి ప్రబంధయుగం అంతరించిన తర్వాత, 17వ శతాబ్దంలో వ్రాయబడ్డ ప్రబంధం. దీనిని రచించిన కవి అయ్యలరాజు నారాయణామాత్యుడు. ఇది ఆనాటి ఆంధ్రుల సాంఘిక చరిత్రకు ఖనివంటిది. నాడు తెలుగుదేశంలో ప్రచురంగా ఉండే కులాలు—కులవృత్తులు, నాటి ప్రజలుపయోగించే ఆభరణాలు, ధరించే దుస్తులు, భుజించే ఆహారపదార్థాలు, భజించే దేవుళ్ళు, వింతలు వినోదాలు, ఆచార వ్యవహారాలు మొదలైన సాంఘిక విశేషాల నెన్నిటినో ఈ ప్రబంధంలో కవి విపులంగా వర్ణించాడు. అంతేగాక ఆనాడు పల్లెటూళ్ళలో వీధిబళ్ళు నడిచే తీరు, ప్రాథమిక విద్యా విధానం, పాఠ్య ప్రణాళిక, ఆకతాయి విద్యార్థుల ఆగడాలు, అయ్యవార్లు వారికి విధించే శిక్షలు మొదలైన విషయాలతో నాటి వీధి బళ్ళు మన కళ్ళకు కట్టేలా వర్ణించాడు కవి.

'హంసవింశతి'లో హంస హేమావతికి చెప్పిన ఇరవై రాత్రుల కథలు గలవు. కావుననే దీనికీ పేరు వచ్చింది. ఇందు 11వ రాత్రి పండితుడు, అతని ఇద్దరి భార్యల కథ చెప్పబడింది. దీనిలో సకల విద్యా పారంగతుడైన ఆ పండితుడు నేర్చిన విద్యలు, చదివిన గ్రంథాలు మొదలైన విద్యా విషయాలను పట్టికగా ఇచ్చాడు కవి. ఈ కథలోనె ఒక బ్రాహ్మణ విద్యార్థి విద్యాభ్యాసంగాన్ని గూర్చి చెప్పుచూ కవి నాటి వీధిబళ్ళ తీరుతెన్నులను చక్కగా వర్ణించి యున్నాడు.

నారాయణామాత్యుని కాలంలో పల్లెటూళ్ళయందు ఏ వేప చెట్టు క్రిందనో, చింతచెట్టు క్రిందనో వీధిబడి జరుగుచుండేది. ''అయ్యవారు నిద్రింపగా జూచి చేరి యచట చింతవేల్ కొమ్మ వంచుక సిగను గట్టి'' (3–144) అని నాటి వీధిబడి విద్యార్థి చెప్పడాన్నిబట్టి చూస్తే పల్లెటూళ్ళలో వీధిబళ్ళు చెట్లక్రిందనే నడుస్తుండేవని తెలుస్తుంది. ఈ పద్ధతి దాదాపు 50, 60 ఏళ్ళ క్రితం వరకు అమలులో నున్నట్లు తోస్తుంది. ఈనాటికి పల్లెటూళ్ళలోని వృద్ధుల నెవరినైనా అడిగితే ''మా వేందిలే వానాకాలం చదువులు'' అంటారు. అంటే మొన్నమొన్నటి వరకు వీధిబళ్ళు చెట్లక్రిందనే జరుగుతుండేవి కావున వానబడితే వాళ్ళకు ఆట విడుపు అన్నమాట.

నాటి వీధి బళ్ళలో చదువులు చెప్పువారిని అయ్యవార్లు అనుచుండిరి. తల్లిదండ్రులు తమ కుమారులను అక్షరాస్యులగా చేయుటకై బడికి తోడ్కొని పోయి అయ్యవారికి అప్పన చేయుచుండిరి.

''......తండ్రి వన్ గని చదివించు బుద్ధి నయ
గారికి నప్పన సేయ, నక్షరాస్యునిగ నొనర్పుమంచు
బడికొయ్యన దోడ్కొనిపోయి'' (3–140)

వీధి బళ్ళలో ప్రాథమిక విద్యా విధానమందు పాఠ్య ప్రణాళిక ఈ విధంగా ఉండేది. అయ్యవారు మొదట విద్యార్థులచేత ఓనమాలు నేలపై వ్రాసి దిద్దించేవాడు. తరువాత గుణింతముకూడా నేలపైననే వ్రాసి దిద్దించేవాడు. అక్షరమాలలోని వర్ణములు గుణింతాలు విద్యార్థికి వచ్చిన పిమ్మట, చిన్న చిన్న పద్యాలు వారిచే చెప్పించుచుండిరి. తర్వాత పలక వ్రాయించేవారు. పలక వ్రాయడమనగా అయ్యవారు కొన్ని పదములను చెప్పుచుండగా వర్ణక్రమము (Spelling) తప్పకుండా విద్యార్థులు పలకపై వ్రాయడం అన్నమాట. హంసవింశతి కాలంనాటికి సీమవాళ్ళు దిగుమతి అయి ఉన్నప్పటికి సీమపలకలు, బలపాలు దిగుమతి అయినట్లు లేదు. అందుకే కాబోలు ''పలకా బలపాలంటే—పెద్ద కఱ్ఱపలక, మెత్తని కోవు బలపము మాత్రమే'' అని సురవరం ప్రతాపరెడ్డిగారు చెప్పారు.[1] ఈ విషయాలనే కవి ఈ క్రింది పద్యంలో వివరంగా వర్ణించియున్నాడు :

సీ॥ నన్నయ్యవార లోనమాలు దిద్దుకొ
మ్మనినచో గడుపు నొప్పనుచు నేడ్చి.
దండమ్మనను గుణింతమ్ము పెట్టరమ్మన్న
నంగుళి వ్రణమాయెననుచు జణిగి.
శిష్యులచే కాలు సేతులు గట్టించి
తెచ్చి పద్యము జెప్ప తెమలకుండి,
పలక వ్రాయమటంచు బడికెత్తుకొనిపోవ
బలపంబు లేదని పలుకకుండి. (3–141)

నాటి వీధిబడి పాఠ్య ప్రణాళికలో గుణింతముయొక్క ఆవశ్యకతను తెలిపేందుకే కాబోలు కవి అకారాది గుణింతముతో స్త్రీ వర్ణన గావించియున్నాడు.

సీ॥ దీర్ఘమై విలసిల్లు దేట వాల్గనుదోయి
గుడుసౌచు నాభియు గుల్కుచుండ
గొమ్ములగతి హెచ్చు గొమిరె చేతుల రీతు
లొత్వంబు చలదాన నొప్పు జఘన
మొత్వంబు భాతిని నమరు గర్ణద్వయం
బేత్వమై జడపొంక మెసగుచుండు
నైత్వంబు విధమున నలయూరు లలరారు
దలకట్టునలె మించు దలుకు నొసలు

తే॥ సున్న నడుము విసర్గలు సమ్మలారు
పొసగు వలపల గిలక యద్భుతము లనగ
నలరు గుణింతంబు వైఖరిఁ జెలగు నంగ
సౌష్ఠవముతోడ నున్నది సకియ యనుచు (5–169)

ఓనమాలు, గుణింతము నేలపై దిద్దించడమే గాక అయ్య వారు చెప్పుచుండగా విద్యార్థులు పలుకు చుండుటయు నాటి విద్యా విధానంలో ఒక పద్ధతిగా నుండెను.

''గద్దించి వడి దిట్టి దిద్దమంచును వ్రేలు
వెట్టింప నపటనే బెట్టకుందు
పలుమారు ''శ్రీ'' యని పల్కు మంచును గొట్టి
చెప్పిన శిలవృత్తి తప్పకుందు'' (3–142)

ఈ విధంగా విద్యార్థులకు ఓనమాలు, గుణింతము, పద్యాలుచెప్పడం, పలక వ్రాయడం, ఒంట్లు, ఎక్కాలు చేప్పడం మొదలైనవి వచ్చిన పిమ్మట బాలరామాయణాది చిన్న చిన్న పద్య కావ్యాలను పరిచయము చేయుచుండిరి. ఆకతాయి విద్యార్థులు ఈ పుస్తకాలను దాచి అల్లరి చేయుచుండిరి. (3–142)

ఇలా పద్య కావ్యాలను పరిచయంచేసి, ఆటుపిమ్మట భారత, భాగవత, రామాయణాది గ్రంథాలను చదివించేవారు. ఈ విషయాలు ఈ క్రింది పద్యంలో చక్కగా వివరించబడ్డాయి:

''నన్ను చదించెబాబు సీననాడు తమాసగ భాగతంబు రా
మాన్నము, భారతంబును తమ్మాము కిందిని ముందె
వచ్చెనే[2]

పై పద్యంలో చెప్పిన ''కిందిని ముందె వచ్చె'' అంటే పైన చెప్పిన పాఠ్య ప్రణాళికలోని ''ఓనమాలు, గుణింతము, పలక వ్రాయడం, పద్యాలు చెప్పించడం, బాల రామాయణాది కావ్యాలను చదివించడం'' మొదలైన వన్నియు ముందుగానె వచ్చాయని భావం. ఆ తర్వాతనే ఆ విద్యార్థి భాగవతము, భారతము, రామాయణాది గ్రంథాలు చదివాడట.

ఆనాటి వీధిబళ్ళు నిర్దిష్టమైన సమయము ననుసరించి నడిచినట్లు కనుపించవు. విద్యార్థులు బడికి రావడం చీకటితోనే ప్రారంభమయ్యేది. మొన్నమొన్నటివరకు పల్లెటూళ్ళలోని ప్రాథమిక పాఠశాలల్లో ఆచరణలోనున్న ''శ్రీ–చుక్క'' పద్ధతి హంసవింశతికి ముందునుండే అమలులో నున్నట్లు కనుపించుచున్నది. బడికి మొట్టమొదట వచ్చిన విద్యార్థి చేతిపై బెత్తముతో ''శ్రీ'' అని వ్రాసేవారు. ఆ తర్వాత వచ్చిన విద్యార్థి చేతిపై బెత్తము తాకించి ''చుక్క'' పెట్టి పంపేవారు. అటుపిమ్మట వచ్చిన వానికి–అంటే మూడవ విద్యార్థికి–ఒక దెబ్బ, నాల్గవ వానికి రెండు దెబ్బలు. ఈ విధంగా బడిలోని విద్యార్థులకు దెబ్బలు పడేవి. ఈ ''శ్రీ–చుక్క'' పద్ధతినే చేమకూర వేంకటకవి తన 'విజయవిలాసం'లో ''చెలియ నఖాంకురాళినెల చేడియపైకము తాను చుక్కమన్.'' నక్షత్రాలు ఆమె గోళ్ళ తళుకు ముందు రెండవ స్థానమును బొందినవే అని చమత్కరించాడు.[3]

ఇలా బడిత పూజతో ప్రారంభమైన ఆనాటి వీధి బళ్ళలో విద్యార్థులకు విధించే శిక్షలు చాల భయంకరంగా ఉండేవి. అయ్యవార్లు చెప్పినట్లు చెప్పకపోయినా, చదువకపోయినా, వ్రాయకపోయినా విద్యార్థులు ఘోరమైన శిక్షలకు గురి అయ్యేవారు. నాటి వీధిబళ్ళలో విద్యార్థు లనుభవించే వివిధములైన శిక్షలను నారాయణామాత్యు డీక్రింది పద్యంలో వర్ణించియున్నాడు:

తే॥ అఱకచేనుండ బుగ్గలు నులిమి, తిట్టి
తొడలు వడిబెట్టి కోదండ మడరగట్టి
రెట్ట లెగబట్టఁ బట్టించు రేపుమాపుఁ
గొట్టు బెట్టుగ సజ్జన కోల విరుగ (3–141)

ఇవిగాక బింగీలు కూడా పెట్టించేవారు. (3–144) తొడలు వడిబెట్టుటనే తొడబెల్లం, తొడపాశం అని కూడా అంటారు. కోదండ మడరగట్టుట అంటే–పిల్లవాని వీపు నేలకానునట్లు పడవేసి, ఒక మోకాలు వంచి పైకెత్తి, దాని చుట్టు వచ్చేటట్లు చేతులను చేర్చికట్టి, వానిని పైకి తీసికొనేందుకు వీలులేకుండా చేతులుమీదుగా మోకాలు సందులోనుంచి ఒక పొడుగాటి కర్రను దూర్చేవారు. ఇలా చేస్తే కోదండ మాకారంలో ఉంటుంది కాబోలు దీనికా పేరు వచ్చింది. ఇలా కట్టబడిన విద్యార్థి నేలమీదనే పడి ఉంటాడు. అంతటితో ఆగక కొంతమంది కోదండ మడరగట్టిన విద్యార్థిని ఎండలో కూడా పడవేసేవారు. ఎండ ఎక్కుతుంటే, వీపు మాడుతుంటే పాపమా విద్యార్థి గిలగిలా తన్నుకులాడేవాడు.

''రెట్టలెగబెట్ట పట్టించుట'' అంటే విద్యార్థి తన రెండు చేతులు పైకి లేపి ఏ చెట్టు కొమ్మనో, దూలాన్నో పట్టుకొని భూమికి మూడడుగుల ఎత్తున వ్రేలాడుతుంటాడు. సరిగ్గా అతని క్రిందనే ముళ్ళకంపకూడా పెడతారు. కాబట్టి ఆ విద్యార్థి అదే విధంగా వ్రేలాడుతుండవలసిందే. ఒకవేళ చేతుల్లో సత్తువ కృంగి పట్టువిడితే ముళ్ళకంపలో పడతాడన్నమాట. ఇంతచేసింది చాలక సజ్జనకోలలు విరిగేటట్లు చావబాదే వాళ్ళట. ఇలాంటివే ఇంకా అనేకం ఆనాటి విద్యార్థు లనుభవించే శిక్షలు. ఇవి చట్టవిరోధులకు విధించే శిక్షలకుమల్లే క్రూరంగా కన్పిస్తాయి.

ఆనాటి విద్యావిధానమే విద్యార్థుల పసిహృదయాల్లో కొంత భయం గూడు కట్టుకొనేటట్లు చేసేదిలా ఉంది. బడికి పోగానే ఆ చిన్నారి విద్యార్థులు నేలమీద ఓనమాలు, గుణింతాలు వ్రేళ్ళు వ్రణాలయ్యేదాకా దిద్దాలి. పోని కర్ర పలకలు, కోపు బలపాలు అప్పటికే వాడుకలో ఉన్నాయి, వాటిపై దిద్దించవచ్చును గదా అంటే అలా కాదు. నేలమీదనే వ్రేళ్ళు పుండ్లయ్యేదాకా దిద్దితేనే గాని అవి వచ్చినట్టు గాదేమో! దీనితో బడికి పోవాలంటేనే ఆ పసి హృదయాల్లో ఒకవిధమైన భయం గూడుకట్టుకొనేది. దీనికితోడు పైన వివరించిన శిక్షలుండనే ఉన్నాయి.

ఇటువంటి చదువులబడి ఆనాటి విద్యార్థులకు ఒక మహారణ్యంలాగాను, అయ్యవార్లు ఎలులు, పులులులాగా కన్పించేవారు కాబోలు. కొంతమంది విద్యార్థులు బడి అంటేనే భయపడేవారు.

భయపడి బడికి సరిగా పోక, పోయినప్పుడా శిక్షలనుభవించలేక చెడిపోయి ఆకతాయిలుగా తయారయ్యే విద్యార్థులు కొంతమందైతే, ఆ భయానికి మరికాస్త భక్తిని జోడించి బుద్ధిగా చదువుకొనేవారు మరికొంతమంది. బడికి పొమ్మంటేనే భయపడే విద్యార్థులను తల్లిదండ్రులు లేదోవిధంగా నచ్చచెప్పి తినుభండారాలు పెట్టి బడికి పంపినా అచ్చట విధించే శిక్షల ననుభవించలేక ఏవిధంగా బయట పడదామా అనుకొనేవాళ్ళు. మనసుంటే మార్గమే ఉండదా! ఒకటికని అడిగి బయటపడితే అంతే మరలా ఆ రోజంతా బడికే రాడా విద్యార్థి

''ఒకటికి సెలవీయ నురికి చీకటిదాక
పసుల కాపరుల వెంబడి దిరుగుచు'' (3–141)

అయితే తల్లిదండ్రులూరకుండరుగదా! తమ కుమారుడు చదివి అభివృద్ధిలోనికి రావాలని ఏ తల్లిదండ్రుల కుండదు. అందుకని నయానో, భయానో తమ పిల్లలను బడికి పంపేందుకు ప్రయత్నించేవారు. కాని ఆ విద్యార్థి—''జనని అడుగుకొని చదువుకో బొమ్మన్న వినక వెక్కి వెక్కి'' (3-141) యేడ్చేవాడు. ఆ విద్యార్థికి తెలుసు నిన్న ఒకటికని పోయి బడికి రానందుకు ఎటువంటి శిక్ష లనుభవించవలసి వస్తుందో. అందుకే ఆ వెక్కివెక్కియేడ్పు.

ఇలాంటి శిక్షలు విధించడం విద్యార్థుల్లో క్రమశిక్షణ పెంచేందుకే అనుకున్నా, అవి సరియైన పద్ధతులు కావేమో నని పిస్తుంది. ఎందుకంటె ఆ చిన్నారి బాలకుల్లో ఒకవేళ బడికి సరిగా రాకపోవడం, ఆలస్యంగా బడికి రావడం మొదలైన లోపాలుంటే, మంచిమాటల్తో నైతారంగా వాళ్ళ తప్పులు వాళ్ళకు తెలిసివచ్చేలా చెప్పితే వాళ్ళలో మార్పు గల్గి క్రమశిక్షణ పెరిగే అవకాశం ఉంది గాని, అట్లుగాక ఆ చిన్ని చిన్ని దొసగులకు పైన వివరించినటు వంటి పెద్ద పెద్ద శిక్షల విధిస్తే బడి అన్నా, అయ్యావార్లన్నా ఆ పసికూనలు భయపడిపోతారేగాని క్రమశిక్షణ పెరిగే అవకాశం తక్కువే ఉంటుంది.

ఈ విధమైన శిక్షలనుభవించి అనుభవించి భయంపోయి గడితేరిన విద్యార్థులు తుదకు ఆకతాయిలుగా తయారయ్యేవాళ్ళు. వీళ్ళు నాటి వీధి బళ్ళలో చేసే ఆగడాలు కూడా ఎక్కువగానే ఉండేవి, ఆకతాయిగా మారిన ఒక బ్రాహ్మణ విద్యార్థి చేసే ఆగడాలను కవి ఈ విధంగా వర్ణించాడు:

తే॥ సారె పద్యపు పలకపై చమురుపూతు
వెప్పుడు పెద్ద పలక పొక్కెత్త జేతు
బాలరామాయణము పుస్తకాలు దాతు
వెదకి సజ్జన కోలలు విరిచివైతు (3–142)

అంతమాత్రమేగాదు—

కం॥ చరికుండ పగుల గొట్టుదుఁ
బరువడి సూత్రంబు ద్రెంచిపారగ వైతున్
మరి మరి బలపము లిచ్చినఁ
బొరిదినమును బగులగొట్టి పోయెనటందున్
(3–143)

అయ్యావార్లు మధ్యాహ్నము భోం చేసి బడి జరుగుతుండే చెట్టు క్రింద గుర్రుపెట్టి నిద్రపోతుండేవారు కాబోలు అది గమనించిన ఈ ఆకతాయి విద్యార్థి:-

''నన్ను బింగీలు పెట్టించునాడె యయ్య
వారు నిద్రింపగా జూచి చేరి యచట
చింత్రవేల్ కొమ్మవంచుక సిగము గట్టి
విడిచి యురికితి అయగారు మిడికి కూయ''
(3–144)

ఈ పద్యాన్నిబట్టి చూస్తే ఆ విద్యార్థి తాననుభవించే శిక్షలకు ప్రతిక్రియగానె అయ్యావారి నా విధంగా చేసినట్లు తెలుస్తున్నది. అంటే నాటి వీధి బళ్ళలో విధించే శిక్షలు వారిలో క్రమశిక్షణ పెంచేందుకు మారుగా ప్రతీకార వాంఛనే ప్రేరేపిస్తున్నదన్నమాట. అయితే నాటి విద్యార్థులందరూ ఇదేవిధంగా తయారయ్యేవాళ్ళా అంటే అందరూ కాకపోవచ్చును గాని, కొందరైనా తయారయ్యే వాళ్ళనడానికి పై విద్యార్థియే నిదర్శనము. ఇలా అయ్యేందుకు కానాటి విద్యావిధానం, ఆ శిక్షలు కొంతవరకైనా దోహదం చేసే వనడంలో సందేహంలేదు.

ఇలాంటి వాతావరణంలో అధ్యాపకులకు విద్యార్థులకు మధ్య ఉండవలసిన ప్రేమ, వాత్సల్యం, సదవగాహన, సామరస్యం మొదలైన సుగుణాన్నీ కొరవడుతాయి. ఇలా జరగడం విద్యావ్యాప్తికే గొడ్డలిపెట్టువంటిది. కాబట్టే ఆనాడు ప్రజల్లో విద్యావ్యాప్తి జరగవలసినంతగా జరగకుండా పోయింది. అలా అయ్యేందుకు గల సాంఘిక ఆర్థిక రాజకీయాది అనేక కారణాల్లో ఇదీ ఒకటి.

ఈ కథలో ఒక బ్రాహ్మణ విద్యార్థి నాటి చదువులందు ఆస్థలేక, శిక్షలనుభవించి అనుభవించి ఆకతాయిగా మారి తుదకు ఇల్లు విడిచి కూడా పారిపోయిన ఉదంతాన్ని కవి కళ్ళకు కట్టేలా వర్ణించియున్నాడు. ఆనాడు బ్రాహ్మణుల్లోనే ఈవిధంగా ఉంటే ఇంక బ్రాహ్మణేతరుల్లో విద్యా వ్యాసంగం ఏ విధంగా ఉండేదో మన మూహించుకోవచ్చు. అంతేకాదు, ముక్కుపచ్చలారని ఆ పసి కూనలకు ఇలాంటి శిక్షలు విధిస్తే వారికి విద్యయందు శ్రద్ధ తగ్గి శిక్షలతో విసిగి నేసారి చివరకు ఇల్లు వదలి పారిపోయే ప్రమాదం కూడా గలదని నారాయణామాత్యుడు ఈ కథలో సూచించియున్నాడు.

## అధోజ్ఞాపికలు

1 ఆ. సాం చ. పుట. 406.

2 ఈ పద్యం 'చంద్రశేఖర శతకం'లోనిది. వ్రాసిన కవి ఎవరో తెలియదు. ఇది నెల్లూరి గ్రామ్యభాషలో వ్రాయబడింది అని సురవరంగారు వ్రాసియున్నారు. (ఆం. సాం. చ. పుట 382)

3 ఆ. సాం. చ. పుట 372

# కాలప్రవాహం

బి. వి.

జరిగిన కాలాన్నంతట్నీ చాపలాగ
  చుట్టి చుట్టి
ముందు తెచ్చి పరిస్తే ఏముంది ?
ఎందుకు లేదు
అనంత కాలమా నీ వగతజ్ఞాపకాలు
ప్రకృతితో మానవుడు జరిపిన
రాజీలేని పోరాటం
చరిత్రలో 'కాలం ఆగిపోయిన'
కాలం లేదు ఎక్కడా.
కాలం మొదటి పేజీల్లో
గణతంత్ర వ్యవస్థకు చెందిన
సామూహిక యుద్ధాల ఎరుపు
ఒక యుగంలోంచి మరో యుగంలోనికి—
ఒక వ్యవస్థలోంచి మరో వ్యవస్థలోనికి—
కాలం పరుగు.
బానిస యుగపు సంకెళ్ళు తెంచిన
కాలం
ఫ్యూడల్ వ్యవస్థ వ్రేళ్ళను నరికేసింది.
కాలం ప్రవాహంలో ఇవన్నీ
రాళ్ళగుట్టలూ, ఇసుక మేటలూ.
వెల్లువ పొంగిరాగానే
గుట్టలూ లేవు, మేటలూలేవు —
మళ్ళీ ఇంకోర్యూపంలో ఎక్కడో
ఆగేవరకూ.
కొన్ని ఇసుక మేటలూ, రాళ్ళగుట్టలూ
కాలప్రవాహపు వెల్లువను తట్టుకోలేక
సాగర గర్భంలో కల్సిపోయినవి —
మళ్ళీ కన్పించకుండా.
ప్రవాహం సాఫీగా వుంది.
అయినా ఇంకా అక్కడక్కడా
ప్రవాహ వేగాన్ని ఆపాలని ప్రయత్నిస్తూ
వున్నాయి కొన్ని —
కాలాన్ని చుట్టి ముందుపరిస్తే
ఏముంది అనకు
ఎంతోవుంది.
ప్రేమలూ—విరహాలూ, నవ్వులూ—కన్నీళ్ళూ,
వెన్నెళ్ళూ - చీకట్లూ,
యుద్ధాలూ—విప్లవాలూ
కళలూ—సంస్కృతులూ
వర్షాలూ ఉప్పెనలూ
అన్నీ కాలాన్ని ప్రతిబింబిస్తూ
ఆరిపోని నక్షత్రాలై వెలుగుతున్నవి.
కాలం సాగుతూనే వుంటుంది.
దాని ఇన్ఫినిటివ్ స్థానంవరకూ.



# క్రొత్త పాట

## శ్రీ ధూర్జటి వేంకటబాలాజి.

సుదుట –

సింధూర తిలకాన్ని ధరించిన నిశా కాంతలా
హరికెన్ లాంతరు వెలుగులో
జీవితాన్ని క్రొత్త కోణంలో నుంచి చూస్తూ
పదుగురు మెచ్చే రీతిలో –
అవగాహన చేసుకొంటూ –
గత వైభవాన్ని –
క్రొత్త గళాన్ని విప్పే కోకిలకు –
క్రొత్త రాగాన్ని పలికించే వైణికునకు
క్రొత్త గాన మాధుర్యాన్ని చవిచూపే గాయకునకు

ఈ పాటను –
నేను –
ఒకానొక అధునాతన యువకవిని –
నా శక్తి మేరా –
రచిస్తున్నాను –
విరచిస్తున్నాను.

ఈ పాట –
అన్ని పాటల లాంటిది కాదు –
పదుగురు మెచ్చిన పాత పాట కాదు
రేడియోలలో –
కళాశాలలలో – పాఠశాలలలో
నలుగురి నోళ్లలో నలిగిపోయిన
గ్రామఫోను రికార్డులా అరిగిపోయిన
అందరూ గుర్తించిన పాత పాట కాదు.

ఈ పాట –
ఒక ఔన్నత్యాన్ని –
ఒక వ్యక్తిత్వాన్ని –
ఒక సమయస్ఫూర్తిని
మరొక –
ఔదార్యపు మేలి ముసుగుమ ధరించి
కంఠంలో అమృతాన్ని
మాటలలో మానవత్వాన్ని
చూపులలో ముగ్ధత్వాన్ని
విరి చూపులలో –
భావాలలో –
కరుణ రసాన్ని నింపుకొని
మీ ముందు –
సాక్షాత్కరించే ఒక అమృత కలశం –
అంతేకాదు –

ఈ పాట –
ప్రేయసీ ప్రియుల విరహ గీతానికి పల్లవిలా
రజత గిరిని కొలువు చేసిన
శివ పార్వతుల నృత్య విన్యాసాల కొక తాళంలా
పుంభావ సంగీత సరస్వతుల –
విప్పారిన మనో నేత్రాలకొక లయలా
భావకవి అక్షరోపాసన కొక అనుభూతిలా
భాసిస్తుంది –
సంకేతంగా నిలబడుతుంది.

ఈ పాట –
ఒక యుగానికి సంకేతం
ఒక తరానికి ప్రతిరూపం
సర్వ మానవాళికి శుభప్రదం.
గ్రీష్మ తాపానికి –
లలాటం మీద కనిపించే స్వేదంలా
కాగిన క్షీరంమీద కనిపించే మీగడలా
సాహిత్యంలో అంతర్భాగమైన శిల్పంలా
శిల్పంలో యిమిడిపోయిన శిల్పి ప్రతిభలా
మనుషులలో ఒదిగిపోయి –
మాటలలో కరిగిపోయి –
చేతనా చేతనావస్థలో నిబిడీ కృతమై
అంతర్ధానమైంది –

విశ్వంలో –
కానీ –
ఈ పాటను వ్రాయడానికి
శక్తి కావాలి –
రక్తి కావాలి –
రెండింటిని మేళవించే సమయస్ఫూర్తి కావాలి –
అయినా –
శక్తినంతా కూడుతీసుకొని
ప్రారంభించా –
ఈ క్రొత్త పాటను వ్రాయడానికి
కానీ –
చిత్రం –
కలం ఆగిపోయింది
కలంలో మషీపంకం –
బహుశా ! గ్రీష్మతాపానికి ఎండి పోయుందేమో !
క్రిందికి విదిలించి –
ఒక్కసారి తెల్లకాగితం మీద వ్రాశా !
ఏమని – ? !
ఇంతకీ –
నేను వ్రాస్తున్న ఆ క్రొత్త పాట పేరు 'కవిత్వం' – అనీ
ఆశ్చర్యం –
కలంతో –' మెదడూ ఆగిపోయింది.
అప్పుడనిపించింది –
వర్డ్స్‌వర్త్ అన్న –
"Poetry is the spontaneous over flow of powerful feelings recollected in tranquility.'
మాటలు నిజమని

---

# విరహ వేదన

## శరత్ సంధ్య

తుహిన తలాన్ని కప్పే చీకటి తెర
మౌన వేదన–విరహ రోదన.
హృదయాన్ని శిలచేసుకొని
సహించనా ఈ గుండె కోతను.
నిరాశా నిస్పృహలతో–నిట్టూర్పులు
విడిచే వేదిక నా మది–ఏద్యదా
–స్మృతి సమీరం మేనుని తాకగా–
ప్రణయ కథను విన్పించే కనులు కన్పించ
లేదని.
వలపు వన్నెలను చల్లగా చిలికే
చిరునవ్వు సొగసులు చూపించలేదని.
ప్రేమ రాహిత్య నయన దృశ్యమిది
తెగిన దండలోని పూలు
ఏర్చనా– కూర్చనా ?–
నా నరాల్తోపి ? ఎక్కడ ? ?

విరియదా వెన్నెల–కురియవా
పార్థ దర్శక ముత్యాలు.
కలయువా సాంద్ర హృదయాలు.

విరహ రజనీన విషాద నిషాద
నిపాత తుషార కణాలు
కన్నీరు కార్చెనా ?
ఆర్ద్రముగా నా నయనాలు
రే రాణి రెప్పలు ముద్దాడ–
కోరికల కెరటాలు చెదిరినవి
ముసిరినవి తిమిరచ్ఛటలు–
మెరిసినవి విరహార్ద్ర తమ నిశిన మిణుగురులు
ఆత్మ చైతన్యం చల్లారునేమో
కాని–నా ఊహా చితి చల్లారదు.

శ్రీ కె. రామమోహనరావు

# విష్ణుకుండినుల పుట్టుపూర్వోత్తరాలు

శాతవాహనుల పరిపాలన అంతరించిన తరువాత ఆంధ్ర దేశాన్ని పరిపాలించిన రాజవంశములలో విష్ణుకుండినులు చెప్పుకోదగిన వారు. వీరి పుట్టు పూర్వోత్తరాలను గురించి అనేక పరిశోధనా వ్యాసాలు వచ్చాయి. రకరకాల వాదోపవాదాలు, చర్చలు జరిగినవి. సిద్ధాంత గ్రంథాలు వెలువడినాయి. అయినా ఈ రాజవంశాన్ని గురించిన కొన్ని విషయాలు యింకా వివాదాస్పదంగానూ, అజ్ఞాతం గానూ ఉండిపోయాయి.

వీరిని "విష్ణుకుండినులు" అనాలా లేక "విష్ణుకుండిలు" అనాలా, వీరు ఆంధ్రదేశంలో జన్మించినవారా లేక ఇతర ప్రాంతాల నుంచి వచ్చి యిక్కడ స్థిరపడి రాజరికాన్ని చేపట్టి, ఆంధ్రాధిపత్తు లయినారా, మొదట ఏ ప్రాంతంలో తమ రాజ్యాన్ని స్థాపించారు, యిత్యాది విషయాలు చరిత్రకారులలో ఏకాభిప్రాయం కుదరనివి.

## విష్ణుకుండినులే

ఈ రాజ వంశానికి సంబంధించిన తామ్ర పట్టికలలో వీరి పేరు రకరకాలుగా వాడబడింది.

### గోవిందవర్మ తుమ్మలగూడెం తామ్ర శాసనం మొదటి గుది[1]

<u>మొదటి రేకు రెండవ ప్రక్క మూడవ లైను.</u>

**విష్ణుకుణ్డీనామ్**

<u>మూడవ రేకు — రెండవ ప్రక్క — రెండు మూడు లైన్లు.</u>

**విష్ణుకుణ్డీకుల — వంశ్యే**

<u>నాలుగవ రేకు మొదటి ప్రక్క — మూడవ లైను.</u>

**శ్రీ విష్ణుకుణ్డీనాం**

### రెండవ విక్రమేంద్ర భట్టారక వర్మ తుమ్మలగూడెం రెండవ గుది[2]

<u>మొదటి రేకు రెండవ ప్రక్క మూడవ లైను.</u>

**విష్ణుకుణ్డీనాం**

<u>రెండవ రేకు రెండవ ప్రక్క ఏడవ లైను.</u>

**విష్ణు కుణ్డీకుల**

### రెండవ విక్రమేంద్రవర్మ చిక్కుళ్ళ తామ్ర శాసనము[3]

<u>మొదటి రేకు రెండవ లైను.</u>

**విష్ణుకుణ్డీనామ్**

### తుంధగ్రామ శాసనము[4]

<u>మొదటి రేకు రెండవ ప్రక్క మొదటి లైను</u>

**విష్ణుకుణ్డీనామ్**

<u>రెండవ రేకు రెండవ ప్రక్క మొదటి, రెండవ లైను.</u>

**ప్రియసూనోర్విష్ణుకుణ్డివా**
**కాటక వంశ ద్వయాలం కృత జన్మనాః**

<u>మూడవ రేకు మొదట ప్రక్క మొదటి లైను.</u>

**ప్రియ సూనోర్విష్ణుకుణ్డీ**
**కుల తిలకస్య**

<u>నాలుగవ రేకు మొదటి ప్రక్క మొదటి లైను.</u>

**శ్రీ విష్ణు కుణ్ద్యాన్వయ**

### ఇంద్రవర్మ రామతీర్థ తామ్రశాసనము[5]

<u>మొదటి రేకు రెండవ ప్రక్క మూడవ లైను.</u>

**శ్రీ విష్ణుకుణ్డీ పార్థివో.**

## రెండవ మాధవవర్మ ఈపూరు తామ్ర శాసనము[6]

రెండవ రేకు మొదటి ప్రక్క మూడవ లైను.

విష్ణు [ కుండినాం ]

మూడవ రేకు మొదటి ప్రక్క మొదటి లైను.

విష్ణుకు [ణ్డ్యాధిరాజ ]

## గోవిందవర్మ కుమారుడు మాధవవర్మ ఈపూరు తామ్ర శాసనము[7]

మొదటి రేకు రెండవ ప్రక్క మొదటి లైను.

విష్ణుకుణ్డినామ

## మాధవవర్మ పొలమూరు శాసనము[8]

మొదటి రేకు రెండవ ప్రక్క మొదటి లైను.

విష్ణుకు [ ణ్డి నో ః ]

## మాధవవర్మ వేల్పూరు శిలాశాసనము[9]

మొదటి ప్రక్క మొదటి రెండవ లైను.

వి ష్ణు కు ణ్డి

[గో] త్రో త్ప భ వ స్య

ఈ విధంగా వీరి వంశ నామము వీరి శాసనాలలో పదునారు పర్యాయములు కన్పిస్తుంది. వీరి వంశనామము ''విష్ణుకుండి''యే గాని యింతవరకు చారిత్రక పరిశోధకులు భావించినట్లు ''విష్ణు కుండినులు'' కాదని డాక్టరు శంకర నారాయణన్ గారు[10] సమర్థింప జూచినారు. ఈ వంశము వారి పేరు వీరి శాసనము లన్నింటిలోను ''విష్ణుకుణ్డీనామ్'' అని 'ఇ' కారాంత శబ్దముగానే పేర్కొనబడి నదని, కాని శాసన పరిష్కర్తలు ''కుణ్డినామ్'' అని 'న' కారాంత ముగా దిద్దివేసినారని, ఆ కారణంచేత 'విష్ణుకుణ్డి' అనుటయే యుక్తమని ఆయన అభిప్రాయము. పల్లవానామ్, వాకాటకానామ్, అనగా పల్లవులు, వాకాటకులు అయినట్లుగానే 'విష్ణుకుణ్డీనామ్' అనగా 'విష్ణుకుండి' లని అర్థము. రఘు, గుప్త, వాకాటక, పల్లవ వంశజులు, రఘువంశజులు, గుప్తవంశజులు, వాకాటకులు, పల్లవు లుగా వ్యవహరింపబడుట వ్యాకరణ సమ్మతమేనని శంకరనారాయణన్ గారి వాదము.[11]

నిజానికి ''విష్ణుకుణ్డిన్'' అనునది ద్రుతాంతమైన శబ్దముగానే గ్రహించాలి. ''న కారంబు ద్రుతంబు'', ద్రుతమనగా అక్కఱలేనిచో కరగిపోవునది, అని నిర్వచనము (బాలవ్యాకరణము సంజ్ఞా 11). భాషాశాస్త్రము (Philology) Phonetic laws (ధ్వని సూత్రములు) ప్రకారం పరిశీలిస్తే ఒక విషయం స్పష్ట మవుతుంది. కొన్ని కొన్ని శబ్దములు ఉచ్చారణ వేగములో జారి పోవటం జరుగుతుంది. ఉదాహరణకు "man-like" అను రెండు పదములను కలిపి ఉచ్ఛరించునప్పుడు ఉచ్చారణవేగములో "ke" అను శబ్దము జారిపోయి "manly"[12] అను ఏక పదముగా మిగిలి నది. ఆ విధంగానే "can-not" అనునది 'can't' అయినది. రెండవ పదముకంటె మొదటి పదము మీద ఎక్కువ ఊత పడుట చేత యిట్టి మార్పు జరుగుచున్నది. ఇటువంటి మార్పులు వ్యవ హారిక భాషలలోనే ఎక్కువగా కనపడుతున్నాయి.

శాసనములలో వాడబడిన 'విష్ణుకుణ్డి' వంటి శబ్దముల స్వరూపము తులనాత్మక, చారిత్రక పద్ధతుల (Comparative and Historical methods) ద్వారా మాత్రమే నిర్ణయించ గలము. ఈ రాజవంశీయులు పాలించిన దేశము తెలుగుదేశము. ప్రజల భాష తెలుగు, శాతవాహనుల కాలమునాటికే తెలుగు జన వ్యవహారంలో ఉండేదని చెప్పటానికి ఆధారాలున్నాయి. తెలుగు భాష ద్రవిడ భాషా కుటుంబానికి చెందినదని అందరూ అంగీకరించినదే. అట్టి జన వ్యవహారంలో ఉండిన భాషయొక్క ప్రభావం తెలిసో, తెలీకుండానో శాసన భాషలో చోటుచేసుకుంటాయి. ఆ విధంగానే 'న' కారాంతమయిన ''విష్ణుకుణ్డిన్'' శబ్దము శాసనములలో 'న''కారము లేకుండ ''విష్ణుకుణ్డీనామ్, విష్ణుకుణ్డికుల, విష్ణు కుణ్డి - కుల, విష్ణుకుణ్డినామ్, విష్ణుకుణ్డి - వాకాటక వంశ, విష్ణుకుణ్డి గోత్రోత్పభవస్య'' అని వ్రాయడం జరిగి ఉండవచ్చు. అదీగాక ''విష్ణుకుణ్డి'' అని ఏకవచనంలో వాడబడినట్లు కనపడు తున్నది. అయినప్పుడు దాని బహువచన రూపము ''విష్ణుకుండిలు'' అనాలి. కాని అట్లా అనడంలో ఉచ్చారణా సౌలభ్యం కొరవడు తున్నది. చివరి 'ట' వర్ణము ''ఉ'' కారాంతము, దానిముందున్న 'డి''ఇ' కారాంతము కనుక చివరనున్న 'ఉ'కారముయొక్క ప్రభావం చేత ముందున్న 'ఇ' కారాంత వర్ణముకూడ ''ఉ'' కారాంతంగా మారుతుంది. అప్పుడు ''విష్ణుకుండులు'' అనాలి. అట్లా అనటం ఎవరూ ఆమోదించరు. కనుక ''విష్ణుకుండి'' పదమునకు 'లు' వర్ణమునకు మధ్య Glidingletter ''ను'' తప్పనిసరిగా చేరాలి. ఆ విధంగా తెలుగులో ''విష్ణుకుండినులు'' అయితే ఆంగ్లంలో విష్ణు కుండిన్స్ (Vishnukundins) అవుతుంది.

డాక్టరు వి. వి. మిరాషీగారు[13] యిటీవల తమ పరిశోధనా వ్యాసంలో ''విష్ణుకుండిన్'' అనటమే సబబని అభిప్రాయం వెలి బుచ్చారు వారి వాదం ఈ విధంగా ఉంది: ''ఇప్పటివరకూ శంకర నారాయణన్‌గారితో సహా పరిశోధకులందరూ ఈ రాజవంశాన్ని ''విష్ణుకుండిన్'' అనే వ్యవహరిస్తున్నారు. కాని యిప్పుడు ''విష్ణుకుండి''యే సరయిన రూపమని, శంకరనారాయణన్

గారన్నారు. ఈ రాజవంశంవారి పేరు రెండు విధాలుగాను వ్యవహరింపబడుతున్నది ఉదాహరణకు—చిక్కుళ్ళ శాసనములో "విష్ణుకుణ్డిన్‌మా" అని ఉండగా, ఇతర శాసనములలో "విష్ణుకుణ్డీనామ" అని ఉన్నది. కీల్హారన్ అభిప్రాయం ప్రకారం "విష్ణుకుండిన్" అనునది "విష్ణుకుండ" అను శబ్దమునుండి ఏర్పడియుండినచో "విష్ణుకుండిన్" అనుటయే సమర్థనీయము..."

డాక్టరు హల్ట్జ్, మూవెల్, డూబ్రియెల్, కె. వి. లక్ష్మణరావు, సర్కార్, గోపాలాచారి, వెంకటరమణయ్య మొదలగు చరిత్రకారులు, పరిశోధకులు "విష్ణుకుండిన్స్" (విష్ణుకుండినులు) అని అనడంలో తప్పుచేయలేదనే విషయం స్పష్టము.

## వీరు ఎక్కడివారు ?

ఇక వీరు ఎక్కడివారు అనే విషయాన్ని పరిశీలిద్దాం. రెండవ మాధవవర్మ వేల్పూరు శిలాశాసనములో[14] అతని తండ్రి మొదటి గోవిందవర్మ "విష్ణుకుణ్డి గోత్రోత్ప్రభవస్య" అని పేర్కొనబడినాడు. రెండవ విక్రమేంద్రవర్మ తుండిశాసనములో[15] అతని తాత అయిన మొదటి విక్రమేంద్ర "విష్ణుకుండి వాకాటక వంశద్వయాలంకృత..."గాను "శ్రీ విష్ణుకుణ్డ్యాన్వయ మకుట చూడామణిః"గాను వర్ణింపబడినాడు. పై ఆధారాలవల్ల నేలటూరి వెంకటరమణయ్యగారి[16] వంటి పరిశోధకులు "విష్ణుకుణ్డిన్"అను పేరు వీరి గోత్రానికి, వంశానికి (వంశము, కులము, అన్వయము) సంబంధించినదని భావించారు.

కొందరి అభిప్రాయంలో విష్ణుకుండినులు ఎక్కడినుంచో ఆంధ్రదేశానికి వచ్చి స్థిరపడి కాలక్రమాన పరిపాలకులయినవారు. మరికొందరు, వీరు తెలుగు గడ్డమీదపుట్టి, స్వశక్తిమీద అధికారంలోకి వచ్చినవారని భావించారు.

మొదటి వాదాన్ని ప్రపంచించిన వారిలో ఫ్రెంచి పండితుడు డూబ్రియెల్[17] ముఖ్యుడు. వాకాటక వంశానికి, విష్ణుకుండినులకు గల బంధుత్వము, శ్రీశైలస్థల మహత్యములో పేర్కొనబడిన ఒకానొక గాథ యిందుకు ఆధారంగా తీసుకున్నాడు: గుప్తరాజయిన చంద్రగుప్తుని కొమార్తె చంద్రావతి శ్రీశైల మల్లిఖార్జున స్వామి యెడల భక్తి ప్రపత్తులతో ప్రతిదినము ఒక మల్లెలమాల సమర్పిస్తూ ఉండేదనీ, ఈ చంద్రావతియే విష్ణుకుండిన రాజయిన మొదటి మాధవవర్మ భార్య అని డూబ్రియెల్ ఉద్దేశం. ఈ వాదాన్ని నేలటూరి వెంకటరమణయ్య గారు కల్పనా కథలను చరిత్రాంశముగా మార్చ సాహసించుటగా భావించి త్రోసిపుచ్చారు. ఆయన ఉద్దేశంలో విష్ణుకుండినులు కృష్ణాలోయ దిగువ ప్రాంతానికి చెందినవారు.[18]

విష్ణుకుండినుల శాసనాలలో కనుపించు "శ్రీ పర్వతస్వామి పాదానుధ్యాత" అను మాటలను బట్టి, వీరు వినుకొండ ప్రాంతము వారని భావరాజు వెంకటకృష్ణారావుగారు[9] అభిప్రాయపడినారు. "విష్ణుకుండిన్" అనునది వినుకొండకు సంస్కృతీ కరణమని భావరాజువారి భావన. వినుకొండ విష్ణుకుండినుల రాజధాని కావచ్చునని కీల్హారన్[20] అన్నారు శ్రీ పర్వతీయులు అంటే విష్ణుకుండినులనీ, శ్రీపర్వత మనగా శ్రీశైలమనీ ఆయన గుర్తించారు.

శంకర నారాయణన్‌గారి[21] వాదన ప్రకారం విష్ణుకుండినులు శ్రీశైల ప్రాంతానికి చెందినవారు. వీరికి, చుటువంశీయులకు చాల సన్నిహిత సంబంధమున్నది, తుమ్మలగూడెం రెండవ గుది[2] లో పేర్కొనబడిన దానిని బట్టి విష్ణుకుండినులు శ్రీ పర్వతీయులు — అనగా శ్రీ పర్వతమునకు చెందిన గొప్ప రాజులని అర్థము. ఈ శ్రీపర్వతమే విష్ణుకుండినులు తమ యిష్టదైవంగా ఆరాధించిన శ్రీశైలము. కీల్హారన్ శ్రీపర్వతాన్ని యిప్పటి శ్రీశైలంగా సరిగానే గుర్తించారు. ఇక రెండవ విషయం. విష్ణుకుండినులను వారితో తలపడి పోరిన మౌఖరి రాజు ఒక శాసనములో "ఆంధ్రాధిపతి" అని ఉదహరించాడు, కనుక, శ్రీ పర్వతీయులు, "ఆంధ్రాధిపతి" అను ప్రయోగాలను బట్టి విష్ణుకుండినులను శాతవాహనులకు తరువాతి వారని పురాణములలో చెప్పబడిన శ్రీ పర్వతీయాంధ్రులుగా భావింపవచ్చును. ఈ శ్రీ పర్వతీయాంధ్రులు, చుటుశాతకర్ణులూ ఒకరేనని చెప్పటానికి కూడ బలమైన కారణాలున్నవి. అందుచేత విష్ణుకుండినులు చుటుశాతకర్ణులతో చాలా దగ్గరి సంబంధం కలిగి ఉన్నారని, వారి నివాస స్థలము శ్రీశైలమేనని చెప్పవచ్చును. ఈ సందర్భంలో ఇంకోవిషయం కూడ గమనించాలి. సముద్రగుప్తుని అలహాబాదు శాసనంలో తెయిదేశాన్ని పాలిస్తున్న పిఠాపురం మహేంద్రగిరి, శాలంకాయన హస్తివర్మ ఆంధ్రాధిపతులుగా కాక, పైష్టపురక, వైంగేయక అనే పేర్కొనబడినారు. కాని విష్ణుకుండినులు మాత్రం మౌఖరి ఈశానవర్మచేత ఆంధ్రాధిపతిగా చెప్పబడినారు ఈ విషయం కూడ విష్ణుకుండినులకు పురాణాలలోని శ్రీపర్వతీయాంధ్రులకు గల సంబంధాన్ని తెలియజేస్తుంది ... బహుశ, విష్ణుకుండినులు, బనావని, మాలపల్లి శాసనములలో ఉదహరింపబడిన విన్హుకడ (విష్ణుకుండ); అభీర శాసనములలో కనపడుచున్న "విష్ణురుద్ర" ఒకే కుదురుకు చెందిన వారయి ఉండవచ్చును"

శంకర నారాయణన్‌గారు తమ సిద్ధాంత గ్రంథములోని రెండవ అధ్యాయం ప్రారంభంలోనే విష్ణుకుండినుల వంశోత్పత్తి మిష్టరీతో కూడి ఉన్నదని వ్రాశారు. అటువంటప్పుడు దానిని మరింత మిష్టరీ చేయబూనడం భావ్యం కాదు.

శ్రీపర్వతీయ, ఆంధ్రాధిపతి అను విశేషణములను పరిశీలిద్దాం. "శ్రీ పర్వతస్వామి పాదానుధ్యాత" అను సమాసములోని "శ్రీపర్వతస్వామి" శ్రీశైలమల్లికార్జునస్వామి అనుట సందేహాస్పదమని, అట్లా అనటానికి తగిన ఆధారాలేమీలేవని, క్రీ. శ. 3–4 శతాబ్దులనాటి ఇక్ష్వాకుల శాసనములలో నాగార్జునకొండయే శ్రీపర్వతమని పేర్కొనబడిందని, ఆ పరిసర ప్రాంతాలలో కార్తికేయస్వామి దేవాలయాలు అనేకం పురావస్తుశాఖ వారి త్రవ్వకాలలో వెలుగులోకి వచ్చాయని, అందుచేత విష్ణుకుండినుల ఇలవేల్పుగా చెప్పబడిన శ్రీపర్వతస్వామి విజయపురి (నాగార్జున

కొండ) లోని కార్తికేయస్వామియే కావచ్చునని వెంకటరమణయ్య గార్[23] అభిప్రాయం. ఇక్ష్వాకుల శాసనాలలో నాగార్జునకొండ శ్రీపర్వతంగా పేర్కొనబడడం, ఇక్ష్వాకులు శ్రీపర్వతీయులుగా వ్యవహరింపబడడం, విష్ణుకుండిన మొదటి గోవిందవర్మ బౌద్ధ మతావలంబికావడం, ఆయన భార్య పరమభట్టారికా మహాదేవి ఇంద్రపురం వద్ద మహావిహారం ఒకటి నిర్మించడం చేత శ్రీపర్వత స్వామి అంటే బుద్ధ భగవానుడేనని కొందరి అభిప్రాయం కావచ్చు.

శ్రీపర్వతస్వామి, బుద్ధభగవానుడు ఒకరు కారని, రెండవ మాధవవర్మ నుండి కూడ విష్ణుకుండినులు శైవులై "పరమ మహేశ్వరులు"గా ప్రసిద్ధి కెక్కినవారని శ్రీ వి. వి. కృష్ణశాస్త్రి గారు[24] పై వాదాన్ని ఖండించారు. కనుక శ్రీ పర్వతస్వామి, శ్రీశైల మల్లికార్జునస్వామి ఒకరు కాజాలరు. శ్రీ పర్వతము అంటే పవిత్రమయిన కొండ అని కదా. విష్ణుకుండినుల రాజ్యంలో తమ యిష్టదైవమయిన 'శ్రీ పర్వతస్వామి' నెలకొని ఉన్న ఒకానొక పర్వతాన్ని శ్రీపర్వతంగా వ్యవహరించి ఉండవచ్చు. మరి విష్ణుకుండినులు ఆరాధించిన శ్రీపర్వతం ఏది? అను ప్రశ్నకు సమాధానం కొంతవరకు "విష్ణుకుండినులరాజధాని"[25] అనే వ్యాసంలో ప్రస్తావించడం జరిగింది.

ఇక మౌఖరి ఈశానవర్మ ఉదహరించిన "ఆంధ్రాధిపతి" సంగతి విచారిద్దాం. గుప్తరాజులకు సామంతుడైన మౌఖరీ రాజు ఈశానవర్మకు విష్ణుకుండిన ఇంద్రభట్టారకవర్మతో యుద్ధం జరిగింది. మౌఖరీ రాజులలో మహారాజాధిరాజ బిరుదు కలిగిన మొట్టమొదటివాడు ఈశానవర్మ. ఈతని కాలానికి చెందిన హరహ శాసనములో[26] విక్రమ సం॥ 611 (554 A.D.) ఆంధ్రాధిపతిపై విజయం సాధించినట్లున్నది.

"జిత్వ్ ఆంధ్రాధిపతిమ్ సహస్ర గణిత త్రేధా
క్షరద్ వరాణామ్"

ఇక్కడ "ఆంధ్రాధిపతి" అనునది తత్పురుష. ఆంధ్రదేశానికి అధిపతి అని అర్థము. ఈ శాసనం సముద్రగుప్తుని అలహాబాదు శాసనమునకు రమారమి రెండువందల సంవత్సరాలతరువాతిది. ఇంద్రభట్టారకవర్మ తన కుమార్తె ఇంద్రభట్టారికమహాదేవిని, ఈశానవర్మ కుమారుడు శర్వవర్మకిచ్చి వివాహం చేసి సంధిచేసుకున్నాడు.[27] ఇంద్రభట్టారక వర్మ దాదాపు 27 సంవత్సరాలు రాజ్యం చేశాడు. గొప్ప చక్రవర్తిగా, శక్తిమంతుడయిన యుద్ధవీరుడుగా కీర్తింపబడినాడు. లెక్కలేనన్ని చతుర్దంత సమరములలో విజేత అని, ఈతని పాదాక్రాంతులయిన రాజుల కిరీటముల యందలి మణుల కాంతులచే అతని పాదములు ప్రకాశించుచుండినవని, ప్రస్తుతింపబడినాడు. "సత్యాశ్రయ" బిరుదాంకితుడు. ఆ కారణంచేత విక్రమేంద్ర భట్టారకవర్మను, అతనితో వియ్యమందిన ఈశానవర్మ ఆంధ్రాధిపతిగా పేర్కొనడంలో ఆశ్చర్యం ఏమీలేదు. అలహాబాదు శాసనము వేయించిన సముద్రగుప్తుడు "సమ్రాట్టు." తన దక్షిణదేశ దిగ్విజయయాత్రలో పిష్టపురం ఏలికైన మహేంద్రగిరిని, వేంగీ పరిపాలకుడయిన శాలంకాయన హస్తివర్మను అవలీలగా ఓడించి ఉంటాడు. హస్తివర్మకు మహారాజ బిరుదం ఉన్నప్పటికీ అతని రాజ్యం తూర్పుకోస్తా తీరంలో కృష్ణా, గోదావరీ నదుల నడుమకే పరిమితమయింది. సముద్రగుప్తుడు ఆర్యావర్తంలోని రాజులందరినీ జయించినట్లు చెప్పటంలో "పట్టు—విడుపు" పద్ధతి నవలంభించి ఉండవచ్చు. అతడు అనేకమంది దక్షిణాది రాజులతో తలపడ్డాడు. అంతమందిలో మహేంద్రగిరి, హస్తివర్మకూడ ఉండటం సంభవించింది. అందుచేతనే యితర రాజులతోపాటు వీరిద్దరినీ కూడ పైష్టపురక, వేంగేయక అని ఉదహరించటం జరిగింది.

కనుక పై రెండు ఆధారాలవల్ల విష్ణుకుండినులకు శ్రీపర్వతీయాంధ్రులనబడే (శంకరనారాయణన్‌గారి దృష్టిలో) చుతుశాతకర్ణులకు సంబంధం కలదని చెప్పటం ఆమోదయోగ్యం కాదు.

విష్ణుకుండినుల పుట్టుకను గురించి తెలిపే ఆధారాలు, శాతవాహనుల పతనానంతరం మధ్య దక్కను ప్రాంతాన్ని పరిపాలించిన వాకాటక వంశ చరిత్రను జాగ్రత్తగా పరిశీలిస్తే కనపడతాయి.

(1) వాకాటకవంశ మూలపురుషుడైన మొదటి వింధ్యా శక్తి విష్ణువృద్ధ గోత్రజుడైన బ్రాహ్మణుడు. ఇది విష్ణుకుండిన గోత్రానికి దగ్గరగా ఉన్నది.

(2) 'త్రివరనగర భవన పరమయువతీ జన విహారణరత'గా పేర్కొనబడిన నాల్గవ మాధవవర్మ, నర్మదానదీ తీరాన ఉన్న "తేవారు" గా గుర్తింపబడిన త్రివర నగరము రాజధానిగా పరిపాలించాడని విమర్శకుల అభిప్రాయం.[28]

(3) వాకాటక రాజులందరూ వైదిక మతావలంబులై బ్రాహ్మణ్యాన్ని అనుసరించినప్పటికీ వారి రాజ్యంలో బౌద్ధవిహారాలు, స్తూపాలు, చైత్యాలు మొదలయిన వెన్నో నిర్మించారు. మొదటి రుద్రసేన శైవాన్ని స్వీకరించాడు. అతని తరువాతి వారిలో ఒక్క రెండవ రుద్రసేనుడు తప్పితే అందరూ శివారాధకులే.

మొదటి గోవిందవర్మ, విక్రమేంద్రభట్టారక (1) మినహా విష్ణుకుండినులందరూ శైవులే. గోవిందవర్మ, అతని పట్టపు రాణి పరమ భట్టారికా మహాదేవి, విక్రమేంద్రభట్టారక (1), బుద్ధుని ఆరాధించారు. స్తూపాలను, విహారాలను కట్టించారు. ఆ తరువాతి వారందరూ వైదిక ధర్మాన్ని పాటించినవారే, శ్రీపర్వతస్వామి వారి యిష్టదైవం. వారు పరమ మాహేశ్వరులు.

(4) వాకాటకుల కాలంలో అనేక గ్రంథాలు సంస్కృత భాషలో రచింపబడినాయి. పురాణాలు పునర్నింపబడినాయి. యాజ్ఞవల్క్య, నారద, కాత్యాయన, స్మృతులు రచింపబడినయి. వ్యాసభాష్యము, సాంఖ్యకారిక, లంకావతార సూత్రములు వెలువడినవి. భాస, శూద్రక, విశాఖదత్త, కాళిదాస మొదలయిన కవి పండితులు వాకాటక కాలంలోని వారు. ప్రవరసేన (11)

ప్రాకృతంలో సేతుబంధ అనే గ్రంథాన్ని వ్రాయగా కాళిదాసు కొన్ని మార్పులు చేశాడు.

విష్ణుకుండినులు కూడ చెప్పుకో తగిన పాండిత్య ప్రకర్షలు కలవారే. జనాశ్రయ బిరుదు గలిగిన నాల్గవ మాధవవర్మ "జనాశ్రయ ఛందోవిచ్ఛిత్తి" అనే సంస్కృత ఛందో గ్రంధాన్ని రచించాడు. విష్ణుకుండినుల శాసనాలన్నీ సంస్కృత భాషలోనే ఉన్నాయి. సంస్కృతము రాజభాష కాగా తెలుగు వ్యవహారిక భాష అయి ఉండవచ్చును.

5. అజంతా, ఎల్లోరా గుహాలయాలలో చాల వరకు వాకాటకుల కాలంలోనే తొలచబడినవి. దేవాలయాల నిర్మాణం అప్పుడప్పుడే ఆరంభ దశలో ఉన్న రోజులవి. వాకాటకుల కళా కౌశలాన్ని విష్ణుకుండినులు పుణికి పుచ్చుకొన్నట్టు కనపడుతున్నది. డూబ్రియెల్ పండితుడు ఉండవల్లి, మొగ్గలాజపురం గుహాలయాలు విష్ణుకుండినుల నిర్మాణమేనని అన్నాడు.[29]

6. నాగపూరుకు 13 కిలో మీటర్ల దూరంలో రావ్ టెక్ వద్ద గల రామగిరి స్వామి వాకాటకుల కులదైవము వారి కాలము నాటి దేవాలయములలో ఎక్కువగా రామలింగేశ్వర స్వామికి అంకిత మయినట్టివే.

హైదరాబాదుకు 35 కిలోమీటర్ల దూరం గల కీసర గుట్టపై వెలసియున్న రామలింగేశ్వర స్వామియే విష్ణుకుండినుల ఆరాధ్య దైవము కావచ్చునని శ్రీ పి. వి. కృష్ణశాస్త్రిగారి[30] అభిప్రాయము.

7. వాకాటకులు నిష్ఠాగరిష్టులయిన ఛాందస బ్రాహ్మణులయినను క్షాత్ర ధర్మాన్ని అవలంబించారు. విష్ణుకుండినులుకూడ బ్రహ్మ క్షత్రియులుగానే ప్రసిద్ధి కెక్కారు.

"బ్రహ్మక్షత్ర తేజోభృతాం విష్ణు విక్రమ నయ సమ్పదాం విష్ణుకుణ్డీనాం..." అని తుమ్మలగూడెం శాసనం రెండవ గుదిలో సగర్వంగా చెప్పుకున్నారు.

అనగా మొదట బ్రాహ్మణులుగా నుండి తరువాత క్షాత్ర ధర్మాన్ని అవలంభించినవారు

8. శాలంకాయన, బృహత్పలాయన, ఆనంద గోత్రులవలె గాక విష్ణుకుండినులు దిగువ దక్కను ప్రాంతాన కృష్ణానదికి ఉత్తరాన అంటే యిప్పటి తెలంగాణా ప్రాంతంలో రాజ్యపాలన ప్రారంభించి ఉండవచ్చును. కాలక్రమాన ఆంధ్రదేశం నాలుగు చెరగులా తమ అధికారాన్ని విస్తృతం చేసుకున్నారు. క్రీస్తు శకం 300 ప్రాంతంలో సామ్రాట్ బిరుదు వహించిన వాకాటక రాజు ప్రవరసేన (1) తన రాజ్యాన్ని హైదరాబాదు రాష్ట్రంలోని ఉత్తర జిల్లాల వరకు విస్తరింపచేశారు.[31] వాకాటకులు కృష్ణను దాటి వెళ్ళారనటానికి నిదర్శనాలు ఏమిలేవు. పల్లవులచేత జయింపబడేటంతవరకు కృష్ణాలోయ ప్రాంతం ఇక్ష్వాకుల అధీనంలోనే ఉన్నది. అందుచేత ఏ ఒక్క రాజవంశం యొక్క అధీనంలోను లేని తెలంగాణా ప్రాంతంలో విష్ణుకుండినులు తమ రాజ్యాధికారాన్ని నెలకొల్పుకొని ఉండవచ్చును. దీనికి అంతో యింతో వాకాటకుల సహకారం ఉండే ఉంటుంది.

9. విష్ణుకుండినుల అదృష్టము ఉత్తర భారతంలోని రాజవంశాలతో ముడిపడి ఉన్నది. వాకాటకులు, మౌఖరులు, కళింగులు మొదలయిన వారితోనే వీరికి ఎక్కువగా సంబంధం గాని, వైరంగాని అనగా కయ్యంగాని, వియ్యంగాని కనపడుతుంది.[32]

ఇటువంటి పోలికలు ఈ రెండు రాజ వంశాల మధ్య ఎన్నైనా చూపవచ్చు.

పైన చూపిన అంశముల వలన విష్ణుకుండినులకు, వాకాటకులకు — మొదటి మాధవవర్మ వాకాటక యువరాణిని వివాహం చేసుకోవటానికి పూర్వం నుంచే సంబంధ బాంధవ్యాలు కలిగి ఉండే వారని, అన్ని విధాల వాకాటకుల ఆచార వ్యవహారములను విష్ణుకుండినులు అనుసరించారని చెప్పవచ్చు.

ఆ విధంగా వారు మధ్య భారతంలోని ఏ ప్రాంతం నుండో వచ్చి తెలుగు దేశంలో స్థిరపడి ఆంధ్రాధిపతు లయినారనటం సమంజసం.

## అధో జ్ఞాపికలు


1 & 2 'భారతి' 42వ సంపుటము, జూన్, జులై 1965 సంచికలు-పుటలు 14–28, 2–14.

3 ఎపిగ్రఫియా ఇండికా 4వ సంపుటము పుటలు 193–98.

4 A P. G. M. S. 8.

5 ఎపిగ్రఫియా ఇండికా 12వ సంపుటము, పుటలు 133–36.

6 ఎపిగ్రఫియా ఇండికా 17వ సంపుటము, పుటలు 334–37.

7 ఎపిగ్రఫియా ఇండికా 17వ సంపుటము, పుటలు 337–39.

8 'భారతి' VII. నెం. 8, VIII. పుటలు 302–315

9 ఎపిగ్రఫియా ఇండికా 37వ సంపుటి, పుటలు 128–29.

10 ఎపిగ్రఫియా ఆంధ్రికా, 2వ సంపుటి, పుట 4.

11 The Vishnukundins and Their Times Page 1.

12 కోరాడ రామకృష్ణయ్యగారి "సంధి" పుటలు 90–91.

13 ఎపిగ్రఫియా ఆంధ్రికా 5వ సంపుటి (అచ్చులో నున్నది).

14 ఎపిగ్రఫియా ఇండికా 37వ సంపుటి, పుటలు 128–129.

15 " " 36వ సంపుటి, పుట 10.

16 నేలటూరి వెంకట రమణయ్యగారి The Vishnukundins, Page 25.

17 Ancient History of the Deccan, Pages 90–91.

18 The Vishnukundins Pages 28–29.

19 Early Dynasties of Andhra Desa Pages 422 – 427.

20 ఎపి[గఫియా ఇండికా 4వ సంపుటి పుట 175.

21 The Vishnukundins and Their Times, Page 19

22 Ibid. chapter II.

23 The Vishnukundins, Page 28.

24. Keesaragutta – The Vishnukundin's Capital (article under print).

25 'భారతి' జూన్ 77 పుటలు 29–33.

26 ఎపి[గఫియా ఇండికా 14వ సంపుటి పుట 110.

27 History and culture of Indian People Vol III. Page 678.

28 The Vishnukundins Page 22.

29 A. P. G. M. S. No. 10 pages 18 – 32.

30 Keesaragutta – The Vishnukundin's Capital (under print) 'భారతి' జూన్ 1977 సంచిక కూడ చూడుడు.

31 Early History of Deccan, Page 159.

32 Early History of the Andhra Country, page 205.


# దరిద్రపు మొహం!

మూలం :
## శ్రీ ల్యూసీ స్మిత్

స్వేచ్ఛానువాదం :
## శ్రీ ములుమూడి ప్రసాదరావు

దరి[దపు మొహాన్ని నీ కెవరూ వర్ణించి చెప్పలేరు
ఆకారం, లోతు, వెడల్పు, అసలే చెప్పలేరు
నీవు ఆవిడతో కాపురం చేస్తే తప్ప,
ఆవిడ చెక్కిళ్ళ పై భాగాన వుండే
అందాల కనుబొమలను స్పృశిస్తే తప్ప,
అందమైన నీ భార్య ముఖంలో
పేదరికపు ఛాయలు చూస్తే తప్ప,
పొడుచుకు వచ్చిన ఎముకలకు
అతుక్కు పోయిన ఆమె శరీరాన్ని తాకితే తప్ప,
వట్టిపోయిన ఎదచూస్తే తప్ప,
వదవదలాడే పండబారిన చేతిలో
ఖాళీ బియ్యపుకుండ చూస్తే తప్ప!
అప్పుడు –
ఓ రోజు కిటికీలోంచి చూస్తే కన్పిస్తుంది.
పేదరికం నీ పెరటిలోనే
పొలికింతలు పెడుతూ వుంటుంది.
పేదరికం—రాత్రిళ్ళలో పాలుకోసం
ఆవురావురు మంటూ వుంటుంది
పావులీటరు ఖరీదెంతో తెలియక.
గడ్డం చేసుకుంటూ అద్దంలో చూసుకున్నప్పుడు,
నీ కనిపిస్తుంది
ఇంకెప్పుడూ పేదరికం నిన్ను వదిలిపోదని
అది నీ 'భుజాలపైన' వున్నందుకు కాదు
ఆ ముఖం నీదే ఐనందుకు!
రాత్రి పడుకున్నాక నీ భార్య చెప్పేకథ
సగంలో ఆగినప్పుడు తెలుస్తుంది నీకు
జీవిత గతిలోనే పొరబాటుందని.
ఇంకెప్పుడూ అడగవు ఆ రి –
నీ భార్యను 'కథ' చెప్పమని,
ఐనా అనుకుంటూనే వుంటావు
భార్యా బిడ్డలతో సుఖంగా గడపాలని

[ఇది ల్యూసీ స్మిత్ [వాసిన "ఫేస్ ఆఫ్ పావర్టీ" కవితకి స్వేచ్ఛాను వాదం. "ది పొయెట్రీ ఆఫ్ ది నీగ్రో (1746–1970) అనే పుస్తకం నుంచి [గహించినది.]

# పురుషోత్తముడు

## శ్రీ ఇంద్రగంటి భానుమూర్తి

ఈ అనంతశూన్యాకాశాన
ఏ అదృశ్య శక్తి హస్త చాలనంతో
ఈ పచ్చని పృథ్వీవలయం ఏర్పడిందో తెలియదు —
ఏ ఉదయపు ఇంపైన గులాబీ వేళలో
ఈ ఇలా వలయంమీద అద్భుత మానవ ప్రాణి
తొలిగా ఫక్కున నవ్విందో తెలియదు —
కాని
ఆకుపచ్చగా ఆవులిస్తూ, జ్వలిస్తూ
వ్యాపించే ఘోరారణ్యంలాగ ఇతడు
వానరంగా, రాక్షసంగా, మానుషంగా, అమానుషంగా
అవని అంతటా ఆవరించడం తెలుసు !
అద్భుతాలు చెయ్యడం తెలుసు !
వాలిగా, వానరుడుగా, రావణుడుగా, రాక్షసుడుగా
కాముకుడుగా, దశరథుడుగా, నిద్రాళువుగా,
కుంభకర్ణుడుగా,
దగాకోరుగా, దయా దరిద్రుడుగా, ఆత్మవంచకుడుగా
అవకరంగా అడ్డ దిడ్డంగా పెరగడం తెలుసు !
మహీదేవి అందానికే మచ్చకావడం తెలుసు !
ఈ భూమిమీద ఇతడు
ఒక అసమగ, అసంపూర్ణ, సర్వ సంకుల అవగీతం !
ఇందులోంచి మొలిచిందే వాల్మీకి నవగీతం ! నవనీతం !
ఏక స్వర సంగీతం ! రామ జీవితం
వానర ప్రకృతినీ, దానవంపు వికృతినీ, మానుష ప్రవృత్తినీ,
పగుల్చుకొని, పెకల్చుకొని, చీల్చుకొని
వికసించిన హాత చైతన్య వికాసం ! ఇతడు —
ఇతడు రాముడు, ఇతడు పురుషోత్తముడు.
ఇతడు నాకు ప్రియుడు !
అవునితడు
ఒక సీత ప్రాణ స్నేహమ్ముతో వెలిగిపోయిన
ఒక నీలి వే వెలుగు !

అవునితడు
పారిజాతపు చెట్టు మొదట హనుమన్న గుండె అంచుల
మిగిలిపోయిన ఒక నీలి వే వెలుగు !
అవునితడు
ఒక కన్నతండ్రి కన్నుల జీవకళయై పోయిన
ఒక నీలి వే వెలుగు!
అవునితడు
రావణ రాక్షసత్వమ్ము కాల్చివైచిన మంట నీలి వే వెలుగు !
అవునితడు
లోకలోకాని కంత కొక చల్లని వెన్నెల నీడ
నిచ్చిపోయిన ఒక నీలి వే వెలుగు !
పోతన్నకే కాదు, త్యాగయ్యకే కాదు, గోపన్నకే కాదు,
ప్రతీ తెనుగన్నకూ
ఆనాటికే కాదు, ఈనాటికే కాదు, నానాటికీ
అవునితడు ఒక నీలి వే వెలుగు !
మా జామి కొమ్మమీద చిలకకీ,
మా మదురు గోడమీద ఉడతకీ,
ఇతడి పేరుతోనే విడదీయరాని ముడి, ప్రేముడి !

*   *

అవునయ్యా,
నా తప్పటడుగుల నుంచీ సవరించి నన్ను పెంచిన
అయ్యవు, రామయ్యవు !
నా కన్నీళ్ళు తుడిచి నన్ను ముద్దులాడిన
అమ్మవు, రామమ్మవు !
నాతో చదువుకొని ఆడి పాడుకొన్న
నా నేస్తానివి, రామానివి, నా సమస్తానివీ !
అవునయ్యా,
నే నెంతకీ చేరుకోలేకపోతూన్న నా లక్ష్యానివి నువ్వు !
నే నెప్పటికైనా చేరుకోవలసిన నా గమ్యానివి నువ్వు !

# కాంతి కత్తులు

## శ్రీ దాట్ల నారాయణ మూర్తి రాజు

రాత్రి పదునైన కత్తిలా
తళ తళ లాడుతోంది
బ్రతుకు మీద పడ్డ దారిద్ర్యంలా
నిశిమేను చీకటి పెద్దరోగపు మచ్చలతో
జుగుప్సగా వుంది
ఏ సృష్టికారుడో విడుస్తున్న ఉచ్ఛ్వాస, నిశ్వాసాల
పొగలు
భూవలయం చుట్టూ గిర గిరా
తిరుగుతున్నాయి
ప్రకృతి పడతి చేలాంచలాల నించి
జారిపడ్డ మానవత్వం
నడికోడ్డు మీద పందు ముసలి
కళ్ళ నీయాన్‌లైట్ల వెలుతుర్లో
పకడ్బందీగా విలయలాస్యం చేస్తోంది!

స్వార్థం చెరుకు గానుగు మధ్య
రాక్షస చెరకు బలైపోతూ
మానవత్వం తియ్యటి కన్నీటి బొట్లని రాలుస్తోంది

లక్షలాది అనాథ జీవుల ఆక్రందనల
రుద్రగానాలు
సమాజ స్మశాన సౌధంలో ప్రతిధ్వనించి
మనిషి నరాల తీగలపై పయనించి
ఆకటి గదిలో చీకటి పొలికేకలు వేస్తున్నాయి
ఇది జీవన శ్రుతికి ఫలశ్రుతి!
బ్రతుకు ఫ్యానుగాలికి చెల్లాచెదురై ఎగిరే
చచ్చు కాగితాలలో చైతన్యతీరం ఎప్పుడు?
ఊబి బ్రతుకులోంచి ఉత్తేజం ఊపిరిగా
సామాన్య మానవుడు చీకట్ల సంకెళ్ళు
తెంచే దెప్పుడు?
కాంతి కత్తుల జలపాతంలో
జలకాలాడే దెప్పుడు?

---

# రేపు

## శ్రీ పాలపర్తి శ్యామలానంద ప్రసాద్

ప్రభూ
నిన్నటి నీ అడుగులలో
నేను
రేపటి దారి వెతికే వేళలో
ఒక ప్రళయ ఝుంఝ
నా కళ్ళలో దుమ్ముకొట్టి పారిపోయింది
ఇక నేను
నిన్ను చేరలేను
నాకు రేపు లేదు —

## శ్రీ పడలి మందేశ్వరరావు

# క్లాసిక్ - రొమాంటిక్

పాశ్చాత్య సాహిత్య విమర్శలో తరచుగా 'క్లాసిక్, రొమాంటిక్' పదాలు వినబడుతూ ఉంటాయి. క్రితం శతాబ్దాంతాన ఈ రెండు పదాల నిర్వచనంకోసం ప్రయత్నం బాగా జరిగింది. తదాది వీనిని గురించిన పరిశీలన జరుగుతూనే ఉంది.

సాహిత్య స్రవంతిలో క్లాసిసిజమ్, రొమాంటిసిజమ్ అన్నవి కేవలం రెండు ప్రధానమైన వెల్లువలు మాత్రమే. ఇవి తిరిగి తిరిగి ఒకానొక లయలో ప్రత్యక్షమవుతాయి. అంటే కొంత కాలం క్లాసిసిజమ్ సాహిత్యాన్ని ఏలుతే, మరి కొంతకాలం దాని వెనుకనే రొమాంటిక్ పొంగు వస్తుంది· దాని ఉద్ధృతం తగ్గగానే నీరు కలకదేరినట్టు క్లాసిసిజమ్ మళ్లీ పొడసూపుతుంది. తిరిగి రొమాంటిసిజమ్ సాహిత్యంలో నూతన రూపంలో అవతరిస్తుంది. అంటే క్లాసిసిజమ్, రొమాంటిసిజమ్ రెండూ కూడా ఒక లయతో సాహిత్యంలో ప్రత్యక్షమవుతాయన్న మాట.

పాశ్చాత్యుల దృక్పథంలో ఈ ఛాయలు ఒక్క కవితలోనే కాక, వచనంలోనూ, కథలోనూ, విమర్శలోనూ కూడా పొడసూప వచ్చును. సాహిత్య విమర్శకు ఆద్యుడైన ప్లేటో రొమాంటిక్ విమర్శకా వ్యవస్థకు మూలపురుషుడనీ, తర్వాతి ఆతని శిష్యుడు అరిస్టాటిల్ క్లాసికల్ విమర్శకు పునాదులు వేసినవాడనీ అనుకో వచ్చును. పాశ్చాత్య సాహిత్య విమర్శ అంతా ఈ క్లాసికల్, రొమాంటిక్ దృక్పథాలతో సమన్వయింపవచ్చు. అయితే, ఒకానొక యుగంలో క్లాసికల్ దృక్పథం, మరొక యుగంలో రొమాంటిక్ దృక్పథం ప్రాముఖ్యాన్ని వహిస్తాయి.

క్లాసిసిజమ్ అన్నది ఒకానొక సాహిత్య ప్రక్రియ కాదు· అదొక దృక్పథాన్ని సూచిస్తుంది, ఒక మార్గాన్ని పట్టి యిస్తుంది. ఒకనొక మనస్తత్వాన్ని తెలియచేస్తుంది. అలాగే రొమాంటిసిజమ్ కూడా. ఆంగ్ల సాహిత్యంలోనూ, ఫ్రెంచి సాహిత్యంలోనూ, క్లాసికల్—నియో క్లాసికల్—సాహిత్యానికి చిహ్నంగా నిలబడినవారు పోప్, బోలో మున్నగువారు. ఇందులో ఆంగ్ల సాహిత్యంలో నియో-క్లాసిసిజమ్‌కు ఆచార్యపీఠము అలగ్జాండర్ పోప్ ది. కాని ఈయన కవితను గూర్చిన అపోహలు చాలా ఉన్నాయి. ఈయన పద్యాలు అందంగా కవాతుచేసే సైనిక దళాన్ని పోలి ఉంటాయి. పద్యాన్ని తళతళా మెరిసేటట్టు మెరుగుపెట్టడంలో సిద్ధహస్తుడు. వస్తు నిర్వహణలో మంచి నాగరికుడు. ఏవం విధ లక్షణాలన్నీ కవిత యొక్క బాహ్య స్వరూపానికి మెరుగులేకాని, అంతస్సులో ఏ మాత్రమూ చైతన్యస్ఫూర్తి ఉండదన్న అనుమానం సాహిత్య ప్రియులందరికీ కల్గింది. అందుచేతనే మాథ్యూ ఆర్నాల్డ్ దృష్టిలో డ్రైడన్, పోప్‌లు సాహిత్యంలో గద్యవిద్యకు ఆద్యులని అంటాడు. రానురాను వీరు కవులేనా అన్న అనుమానం తర్వాతివారికి కల్గిందని టి. ఎస్. ఇలియట్ అంటాడు. దానివల్ల క్లాసిసిజమ్ అన్న పదానికే ఒకానొక అప్రతిష్ట కాకపోయినా, కవిత్వపు పాలు తక్కువ గల రచన అన్న అపోహలో కొందరు పడిపోయారు. రొమాంటిసిజమ్ అంటే కవిత్వపు లోతులను శోధించడం అనీ, క్లాసిసిజమ్ అంటే బాహ్యస్వరూపపు మెరుగులతో తృప్తిపడడం అనీ అపోహ ఏర్పడింది.

పదునెనిదవ శతాబ్దం చివరకు వచ్చేసరికి యూరప్ అంతా రినేజాన్సు ప్రభావానికి లోనయింది. అప్పటివరకూ మధ్యయుగం చీకటియుగం అనుకోవచ్చు. దేవునికీ, మనిషికీ మధ్య అనుసంధాన కర్తగా ఉన్న చర్చి, అడ్డుగోడగా తయారయింది. అధ్యాత్మిక విషయాలలో చర్చి నియంతృత్వ ధోరణి నవలంభించింది. రాజకీయాలలో రాచరికం, ఫ్యూడలిజం స్థిరపడింది. శాస్త్రీయ విజ్ఞానం అప్పుడప్పుడే కొంగ్రొత్త ప్రశ్నలు వేయడం ప్రారంభించగా, అవి అసంగతమైన ప్రశ్నలనీ, ప్రమాదకరమైనవనీ, చర్చి అట్టి ఆలోచనా విధానాన్నే బహిష్కరించ ప్రయత్నించింది. సాహిత్యంలో ఏ ఒక్కడంటేకో తక్క— అరిస్టాటిల్ చెప్పిందే వేదం. హోరేస్ (Horace) చెప్పినదానికి అడుగు వేయ వీలులేదు. ఆతని సూచనలే కట్టుబాట్లు. ఆ సూచనల ననుసరించి సాగిన ఊహాలలోనుంచి మరికొన్ని కట్టుబాట్లు సాహిత్యంలోకి ప్రవేశించాయి.

కాగా, అప్పటి పరిస్థితిలో ఆధ్యాత్మికపరంగా దైవంతో సంవాద మేర్పరచుకోవడానికేకాక, లౌకికంగా కూడా రాజకీయంగా కాని, వైజ్ఞానికంగా కాని, సాహిత్యపరంగా కాని వ్యక్తిగత స్వేచ్ఛ లేదు.

క్రమంగా యూరప్ మతంలో స్వాతంత్ర్యాన్ని సాధించి ప్రొటస్టాంటిజమ్‌ను స్థాపించింది; రాజకీయంగా రాజుల ప్రవర్తనను ప్రశ్నించింది; మత ప్రమేయం లేని శాస్త్రీయ విజ్ఞానం రూపొంద నారంభించింది, ముద్రణాలయం విజ్ఞానాన్ని వెదజల్ల నారంభించింది. అరిస్టాటిల్‌కు గౌరవం తక్కువ అవలేదు కాని, ఆతడు ఏ ఏ కావ్యాలను చదవడం వల్ల సాహిత్యమిన్విధంగా ఉంటుందని అన్నాడో, ఆ కావ్యాలను ప్రజలు చదువనారంభించారు, ఉత్తేజితులయారు. మతంలో దైవానికీ, వ్యక్తికీ మధ్యగల చర్చి అనే అడ్డుగోడను పగిలగొట్టినట్టే సాహిత్యంలో కూడా గ్రీక్ సాహిత్యానికీ, శ్రోతకూ మధ్యగల సాహిత్య

సిద్ధాంతాల గోడలను నాటి సాహితీవేత్తలు పగలగొట్ట నారంభించారు. హోమర్ మున్నగు రచయితలను చదివి, ప్రభావితులై రచనలు చేయ నారంభించారు. రచయితలకు కొత్త ఊపిరి పీల్చుకొన్నట్టయింది. ఇంగ్లాండులోని వాతావరణం అంతా వినూత్న భావ వీచికలతో ఒక నూత్న ఉత్సాహాన్ని పొందింది. అరిస్టాటిలు నలా ఉండనీయండి. ఆయన్నేమీ అనలేదు. సాహిత్య సిద్ధాంతాల జోలికి పోలేదు. వాట్ల ధోరణికి అడ్డు రామన్నారు. మా రచనలు మావే నన్నారు ఎలిజబత్ యుగంనాటి యువకకవులు. విశ్వవిద్యాలయాల్లో చదువుకున్న వీళ్ళ మనస్థితే ఇలా ఉంటే, విశ్వవిద్యాలయ ప్రాంగణం ఎరుగని షేక్స్పియరు రచనలను గురించి చెప్పనే అక్కరలేదు. అత డెవ్వరితోనూ తగాదా పడలేదు, వాదనకు దిగలేదు. అతని ప్రతిభ అసామాన్యమైనది; చూపు ప్రకృతినీ, మానవుని గుండెలనూ, శోధించేది; భావనాశక్తి గరుడుని రెక్కలవంటిది. అతడు అలంకార గ్రంథాలను చూచి నాటకాలు వ్రాయలేదు. అతని నాటకాలనుచూసి అలంకార శాస్త్రం తయారవ వలసిన అవసరం ఏర్పడింది. షేక్స్పియరు మంచి రొమాంటిసిస్టు. ఆ యుగంలోని వాళ్లందరూ గళమెత్తి స్వేచ్ఛాగానం చేసేవాళ్లే !

అయితే ఆ యుగంలోనే బెన్‌జాన్సన్ అనేకవి ఒక హెచ్చరిక చేశాడు. స్వేచ్ఛ అవసరమే కావచ్చు. విశృంఖలత్వం పనికిరాదన్నాడు. ఈతడు మంచికవి; నాటకకర్త. అంతకన్న మంచి విమర్శకుడు. కవులను నాణెంచేసి తీర్పుచెప్పే విద్య అందరిదీకాదు, కవులదే — అందులోనూ ఉత్తమోత్తమ కవులదే నంటాడు. శబ్దార్థాలు రెండూ శరీరాత్మలను పోలిఉంటాయంటాడు. కావ్యాత్మను సాక్షాత్కరింపచేసుకొన్నవాడు బెన్‌జాన్సన్. అయినా తనచుట్టూ చెలరేగిన అరాచకత్వం అతన్ని కలత పరచింది. ప్రతిభ అవసరమే కాని, వ్యుత్పత్తికూడా అవసరమేనంటాడు జాన్సన్. అభ్యాసం విలువను తక్కువగా అంచనా వేయకూడదంటాడు. కవిత్వమన్నది ఆవేశంలో వెలువడే వాక్కు కాదు. అది ఒక సాధన. ఇతర కవులెలా వ్రాస్తారో చూడాలి. వాళ్ల రచనలను అనుశీలన చెయ్యాలి. తత్ఫలితంగా అరిస్టాటిల్‌వంటి తాత్త్వికుడు కావ్య లక్షణాలను కూరుస్తాడు. తల్లక్షణాలు కవులను తప్పులనుండి రక్షిస్తాయి.

తనచుట్టూ విశృంఖల విహారం చేస్తూన్న కవితావ్యాసంగాని కొక హద్దును ఏర్పరచాలని బెన్‌జాన్సన్ ప్రయత్నిస్తూండగా, ఫ్రాన్సులో పండితులు గ్రీకు కావ్యలక్షణాలను జాగ్రత్తగా అనుశీలన చేసి, కావ్య జగత్తుకు ఉండవలసిన లక్షణాలను పేర్కొన్నారు. ఇట్టి కావ్యలక్షణాలను కవులకు సేకరించి పెట్టినవారిలో బోలో అగ్రేసరుడు. ఈతడు వ్రాసినదంతా కవి శరణ్యంలా కనబడే కవి కంఠపాశం. కావ్యానికి భాష్యకారుడు కాడీతడు. కావ్య నిర్మాణానికి సూత్రకారుడు, నిర్మాతను శాసించేవాడు. ఇంగ్లాండులోని అలగ్జాండర్ పోప్‌కు ఈతడంటే ఎంతో గౌరవం. ఈతని అడుగు జాడల్లోనే కావ్యానుశాసనం చేసాడు. కావ్యనిర్మాణ దక్షతకు యత్నం అవసరం.

"True ease in writing comes from art, not chance, As those move easiest who have learned to dance."

అతడు కవులకు నిస్సంకోచంగా సలహాలను అందచేస్తాడు.

"Avoid extremes, and shun the fault of such, Who still are pleased too little or too much."

అయితే ఫ్రెంచిలో కవులకు అందిన సలహాలు ఇంతకన్న విడ్డూరంగా ఉంటాయి. సూత్రగుళికలను సేవిస్తే, పద్య గుళికల నావిర్భవింపచేయవచ్చును, కావ్య సందోహాలను కూర్చవచ్చును. ఈ సూత్రాలన్నీ ఎక్కడనుంచి అంటే పురాతన గ్రీకు కావ్యాలను మథించగా తేలినవి. అంతకన్న బాగా మనం ఎలాగూ వ్రాయలేము. అందుచేత ఆ కావ్యాలను పరిశీలించగా లభించిన సూత్రాలను వల్లించగా, ఆచరించగా, తత్ కావ్యాలను అనుకరించగా, కొంతలో కొంత మంచి కావ్యాలను వ్రాసే అవకాశంఉంటుంది. ఇదీ వీరి పంథా! వీరిని నవీన క్లాసిసిస్టులు అంటారు.

పదునెన్మిదవ ఉత్తరార్ధంలోకి వచ్చేసరికి నియో—క్లాసిసిజమును తుడిచిపెట్టే అపూర్వమైన పొంగు ఒకటి వచ్చింది. సాహిత్యంలో వచ్చిన ఈ పొంగుకు తిరిగి ఫ్రాన్సే కారణం. ఫ్రెంచి విప్లవం యూరపునంతా కూకటి వేళ్ళతో కదిలించి వేసింది. విప్లవంతోనే రొమాంటిసిజమ్ పుట్టింది. దానికి రూసోను ప్రవక్తగా భావించవచ్చును. అయితే రూసో ప్రచారం చేసింది నూతన కవిత్వ సిద్ధాంతాలు కావు. రాజకీయ సిద్ధాంతాలు. అతడు స్వేచ్ఛా ప్రియుడు. మానవుడు జన్మచేత స్వేచ్ఛగా పుట్టాడు; కాని సాంఘిక వ్యవస్థ అతనిని అన్నివిధాల బందీని చేస్తుంది. అతడు ''ఎమిలీ''లో పిల్లలకు స్వాతంత్ర్య ప్రదానం చేసాడు. విద్య అంతా సహజంగా, ప్రకృతి సిద్ధంగా జరగాలి అంటాడు. ''సోషల్ జస్టిస్''లో మానవు లందరూ సమాన మంటాడు. స్వాతంత్ర్యం, సమభావం, సమైక్యత : ఈ భావాలను వెదజల్లాడు.

రూసో భావాలలోనే కాకుండా భాషలో కూడా ఒక పదును ఉంది ; ఒక ఆవేశం ఉంటుంది ; ఒక నవ్యత ఉంది. అది రొమాంటిక్ భాష. విప్లవానికి నాంది పలికిన అతని భావాలన్నీ దేశ దేశాలనూ కదిలించి వేసాయి. ఇంగ్లాండులో వర్డ్స్ వర్తు, కోల్‌రిడ్జి, మున్నగు వారందరినీ విప్లవం ఉత్తేజితులను చేసింది. ''ఆ మహోదయ వేళ సజీవులై ఉండడం ఆనందానికి అవధిని అందుకోవడమే ; ఇక యవ్వనంలో ఉండడ మంటే అది స్వర్గమే!'' నంటాడు వర్డ్స్ వర్తు. ఫ్రాన్సులో జరిగిన హత్యా కాండ, రక్త పాతం, అతనికి తర్వాత నిరాశను కలిగించింది. కోల్‌రిడ్జికి ఉత్సాహం తగ్గింది. అయినా వీరిరువురూ, తర్వాత షెల్లీ, విప్లవం వల్ల ప్రభావితులైన వారే. షెల్లీకి ఫ్రెంచి విప్లవం కేవలం ఒక సంఘటన కాదు ; మానవ జాతి పురోగమించడానికి తెరచుకొన్న స్వర్గ ద్వారం. స్వాతంత్ర్యం, సమభావం, సోదరత్వం - అన్న నినాదాన్ని గుండెలకు

హత్తుకున్నాడు, ప్రాణ ప్రదంగా చూసుకొన్నాడు. దానిని తన కవితలో ప్రతిపాదించాడు, గళమెత్తి పాడాడు.

అయితే అంతకు పూర్వమే ఇంగ్లాండులో రొమాంటిక్ కవితా ఛాయలు గోచరించక పోలేదు. రాబర్ట్ బర్న్స్ ఫ్రెంచి విప్లవం చేత ప్రభావితుడు కాలేదు. కాని ఆతని పాటలన్నీ రొమాంటిక్ కవితకు లక్ష్యాలుగా ఉంటాయి. దానికి కారణం అతడు స్వేచ్ఛాప్రియుడు. జానపదులలో పుట్టి పెరిగాడు. వారి భాషను అవగతం చేసుకున్నాడు. అతడు మట్టి మనిషి. అతని భాష కమ్మని మట్టి వాసన వేస్తుంది. అతని వాక్కు గుండెను దూసుకొని వస్తుంది, గుండెల్ని కరిగిస్తుంది. స్కాట్ లాగే గతాన్ని ప్రేమిస్తాడు అతడు వాడిన కవితా రూపాలు (form) పాతవే, ప్రజల మన్ననలను పొందినవే. అవి ఈతని కవితలో కొత్త జీవాన్ని పుంజుకున్నాయి.

బర్న్స్ జీవితంలో ఎంత స్వేచ్ఛాప్రియుడో, విలియం బ్లేక్ కూడా అంతే. అయితే ఈతని స్వేచ్ఛా ప్రియత్వం ఆధ్యాత్మికమైన లోచూపుకు కారణమైంది. ఈతడూ బర్న్స్ లాగే ప్రకృతి వల్ల ప్రభావితుడయాడు. కాని ఇవన్నీ ఈతని నొక ఆధ్యాత్మిక, అధిభౌతిక లోకం లోకి తీసికొని పోతాయి. ఈతని ప్రేమ తత్త్వం కొన్ని విధాల షెల్లీని జ్ఞప్తికి తెస్తుంది. ప్రేమ వల్ల మానవుడు మంచిని మన్నిస్తాడని బ్లేక్ భావన.

వర్డ్స్‌వర్తుతో సిసలైన రొమాంటిక్ యుగం ఆరంభమవుతుంది. ఈతడు, కోలెరిడ్జి కలిసి 1798 లో లిరికల్ బాలాడ్స్‌ను ప్రకటించారు. ఇది ఆంగ్ల సాహిత్య చరిత్రలో ఒక మైలురాయి. తర్వాత దానికి వ్రాసిన ఉపోద్ఘాతంలో వర్డ్స్‌వర్తు కొన్ని సాహిత్య సిద్ధాంతాలను ప్రతిపాదించాడు. కవితకు వస్తువు సామాన్య మానవుని సుఖదుఃఖాలే అవాలంటాడీతడు జానపదులు వాడే భాషను — నిత్య జీవితంలో వినబడే భాషను—ఎన్నుకుంటానంటాడు. ఈ సిద్ధాంతాన్ని ఈతడు సరిగా పాటించలేకపోయినా, సామాన్య మానవుని సుఖదుఃఖాలను మాత్రం వస్తువుగా ఎన్నుకున్నాడు. కొండకోనలలోని సౌందర్యానికి ముగ్ధుడవడమే కాదు, దానిని స్పిరిట్యువల్ టర్మ్స్‌లో వ్యాఖ్యానిస్తాడు. ప్రకృతి వర్డ్స్‌వర్తుకు ఆరాధ్యదేవత. మానవుడు సంపదకు ప్రాపంచిక సుఖాలకులోనై ప్రకృతికి దూరమైపోతున్నాడు; ప్రకృతికి ఎంత దూరమైతే అంత పతనమవుతాడు. ప్రకృతి పవిత్ర స్పర్శను అనుభవించని మానవుని జీవితం పేదవడిన జీవితం, మోడువడిన జీవితం.

కోలెరిడ్జి అఖండమైన మేధావి; అద్భుతమైన భావన ఆతని సొమ్ము. సూటిగా వస్తువుయొక్క అంతస్సులోకి చొచ్చుకొనిపోవడం, అందులోని మిస్టరీ ని వెలార్చి, దానికొక రూపకల్పన చేయడంలో అపూర్వ ప్రజ్ఞావంతుడు. స్వాప్నిక జగత్తును సృష్టించడంలోనూ, మానవ హృదయాన్ని వడివేసే సన్నివేశాలను చిత్రించడంలోనూ, అద్భుత ప్రతిభాశాలి కోలెరిడ్జి. ప్రకృతిలో అద్భుత దర్శనాన్ని వర్డ్స్‌వర్తు చూపగా, ఇతడతీంద్రియ దర్శనాన్ని వెలారుస్తాడు.

ఆ తర్వాత వచ్చిన బైరన్, షెల్లీ, కీట్సు కవులు ఫ్రెంచి విప్లవానికి సాక్షులు కాకపోయినా, ఆ విప్లవం ప్రభావానికి—మంచికో, చెడ్డకో- లోనైనవారే. వీరందరూ లోకానికీ సంఘానికీ దూరమైనవారే. బైరన్ అభిమానించింది క్లాసికల్ సాహిత్యాన్ని ఆతనికి అభిమాన కవి పోప్. కాని ఆతని ఆవేశం అదుపులో ఉండదు. సౌందర్యం ఆతని ఊహలకు రెక్కల్ని తొడుగుతుంది. పుట్టుకచేత కాకపోయినా, పగను సాధించాలన్న ఈసు వల్ల, ఈతడు ప్రజాస్వామ్యవాది. మానవ చర్యలను చిత్రించడానికి ప్రకృతిని ఆతడు మంచి అవనికలా ఉపయోగించుకుంటాడు ఆతని తీవ్రమైన భావనాశక్తి, వ్యక్తిత్వము, స్వాతంత్ర్య పిపాస, అతనికి యూరపులో మంచి ఖ్యాతిని తెచ్చిపెట్టాయి.

షెల్లీది అతి సున్నితమైన స్వభావం. అన్యాయాన్ని సహించలేడు. చిన్నతనంలోనే తిరుగుబాటు మనస్తత్త్వానికి లోనయాడు. గతంతో అతనికి ప్రమేయం లేదు. లోకాన్ని మరమ్మతు చేయడం, భువిమీద స్వర్గాన్ని నిర్మించడం, ఇదే ఆతని ధ్యేయం. స్వాతంత్ర్యం ఆతని ఊపిరి. ఫ్రెంచి విప్లవం అతని దృష్టిలో చరిత్రలోని ఒక ఘట్టం కాదు; మానవుణ్ణి ఉత్తేజితుణ్ణి చేసే ఒక నూతన శకానికి నాంది. వెలుపలి శక్తులేవీ మానవుని స్వాతంత్ర్యాన్ని తాకకూడదంటాడు షెల్లీ. ప్రేమే మానవుని శాసించాలి, ప్రేమే మానవుని లోని సౌందర్యాన్ని ఉద్బుద్ధం చేస్తుందంటాడు.

షెల్లీ రొమాంటిక్ కవులందరిలోనూ భావ గీతాలు వ్రాయడంలో మహాశిల్పి. ఆంగ్ల సాహిత్యంలోని మాధుర్యాన్నంతనీ ఈ గీతికలలోకి పిండినట్లుంటుంది. షెల్లీ కేవలం కవే కాదు; ఆతడొక ప్రభంజనం వంటివాడు. శరదృతువులో రెల్లుపూలమీద ప్రసరించే వెన్నెలవంటివాడు; చిరుగాలితో శృతి గొలిపే సజ్జితమైన వీణ వంటివాడు.

షెల్లీకి చూపు భవిష్యత్తుమీదనైతే కీట్సు గతంలో జీవించేవాడు. రొమాంటిక్ కవులందరిలోకి లోకంలోకి అందరికన్న ఆలస్యంగా అడుగుపెట్టి, అందరికన్న ముందు నిష్క్రమించాడు. సౌందర్యంకోసమే బ్రతికాడు. చుట్టూ ఉన్న లోకం మోటుగా, విరసంగా ఉండడంతో, గతంలోని గ్రీకు సంస్కృతిలోని సౌందర్యానికి ముగ్ధుడయాడు. ప్రకృతిపట్ల ఆతనికిగల ప్రేమ అవ్యాజమైనది. సుందరవస్తు వెన్నటికి ఆనందదాయకమైనదే. ఈతని కవిత్వంలో ఇంద్రియజ్ఞానంవల్ల కల్గే సౌందర్యానుభవం విశేషంగా చోటుచేసుకుంది. క్లాసికల్ కవితకు గురుపీఠం గ్రీసుదవుతే,ఈతడు గ్రీసుల్లో గ్రీకు. శైలిలో రొమాంటిక్ కవులలో రొమాంటిక్ !

## 2

ఈ పర్యాలోచన వల్ల రొమాంటిసిజమ్ లక్షణాలు కొన్నింటిని మనం గ్రహించవచ్చును. ఆ కవులందరికీ ప్రకృతిఅంటే ఎక్కువ మక్కువ, స్వాతంత్ర్యప్రియులు. ప్రేమను, ప్రకృతిని తాత్త్విక దృక్పథంలో చూస్తారు. అద్భుతదర్శనానికి లోనవుతారు.

మరికొంత లోతుగా పరిశీలనచేస్తే రొమాంటిక్ — నియో క్లాసికల్ కవితలు రెండూకూడా ప్రాచీన గ్రీకు లాటిన్ సంప్రదాయాల ప్రభావంనుంచే ఆవిర్భవించినట్లు కనబడుతుంది. తొలి ఎలిజబెత్ యుగంలో గ్రీకు, లాటిన్ సాహిత్యాన్ని చదివే కొత్తరకాల నాటకాలు వ్రాయనారంభించారు. ఆ ప్రాచీన కవుల కావ్యాలవల్ల ఉత్తేజితులై, ఆవేశంతో వ్రాసిన ఎలిజబెతిన్ నాటకాలు రొమాంటిక్ సాహిత్యం. కాని ఆవేశాన్ని అదుపులో ఉంచాలన్న ఆనాటి బెన్‌జాన్సన్ హెచ్చరికతో సాహిత్యంలో కొత్త మలుపు ప్రారంభమైంది.

తర్వాత ఫ్రెంచి విమర్శకులు తిరిగి ప్రాచీన గ్రీక్, లాటిన్ సాహిత్యాలనే ఆధారంగా చేసికొని లోగడ అరిస్టాటిల్ చేసిన సాహిత్య సిద్ధాంతాలనే పునరుద్ధరించారు. సాహిత్యంయొక్క స్వరూపాన్ని, శైలినిగూర్చి విపులంగా చర్చించి కొన్ని సూత్రాలను విధించారు. అంటే ఏ గ్రీక్, లాటిన్ సాహిత్యమైతే ఎలిజబెత్ యుగంలో రొమాంటిక్ సాహిత్యసృష్టికి కారణమైందో, ఆ సాహిత్యమే తిరిగి నియో—క్లాసిక్ సాహిత్యసృష్టికి కూడా కారణమైంది.

తర్వాతి శతాబ్దంలో వచ్చిన జర్మన్ విమర్శకుడు వింకిల్‌మన్ తిరిగి గ్రీక్ సాహిత్యాన్నీ, కళనూ ఆధారంగా చేసుకొని క్లాసికల్ శరీరానికి ఆత్మను శోధించడం ప్రారంభించాడు. కీట్సు వంటి కవికి గ్రీకు కవిత, కళ, ఆరాధ్యములయాయి. అంటే నియో క్లాసిసిజమ్‌కు తిరుగుబాటుగా రొమాంటిక్ కవిత ఆవిర్భవించడానికి కూడా తిరిగి గ్రీక్ సాహిత్యమే, గ్రీక్‌కళే కారణమయాయన్నమాట!

కాగా, ఇప్పుడు క్లాసికల్, రొమాంటిక్ పదాల పరిశీలన మరికొంత శ్రద్ధగా చేయడానికి అవకాశం కల్గుతోంది.

క్లాసిక్ అన్న మాటకు తొలి అర్థం ప్రథమ శ్రేణిలోనిదని, హోమర్, వర్జిల్, డాంటే, షేక్స్‌పియర్ మొదటి శ్రేణిలోని కవులు. వాల్మీకి, వ్యాసుడు, కాళిదాసు, భవభూతి ఉత్తమోత్తమ రచయితలు. వారూ వీరూ వ్రాసిన కావ్యాలన్నీ క్లాసిక్ లే! వారి రచనలను ఆధారంగా చేసికొని, సాహిత్య సిద్ధాంతాలనూ, సూత్రాలనూ ఏర్పరచుకొన్న తర్వాత, ఆ సూత్రాల ననుసరించి వ్రాయబడ్డ కావ్యాలు క్లాసిక్‌లు కావు నియో—క్లాసికల్ రచనలు. వీరు సిద్ధాంతాల దృష్ట్యా క్లాసిసిస్టులు, వారి కావ్యాలు నియో-క్లాసిసిజమ్‌కు చెందుతాయి. అందుచేత క్లాసిక్, నియో — క్లాసిక్, క్లాసిసిస్ట్, క్లాసికల్ అన్న శబ్దాలకు వేర్వేరు అర్థాలు ఉండవలసి ఉన్నా, ఆ నియమాన్ని రచనల్లో సరిగ్గా పాటించబడడం లేదు. షేక్స్‌పియరు రచనల్ని క్లాసిక్ అని వ్యవహరించవచ్చును, కాని ఆతని నాటకాలు క్లాసికల్ రూపకాలకు లక్ష్యభూతంగా ఉండవు. పోప్ క్లాసిసిస్టు, నియో — క్లాసికల్ కవితకు మంచి ఉదాహరణ.

ఇంత గజిబిజిగా ఉన్న ఈ శబ్దాల నిలా ఉండనిచ్చి, సాహిత్యంలో వచ్చే లయలను దృష్టిలో పెట్టుకొని, క్లాసిక్ రొమాంటిక్ పద్ధతులకు గల తేడాను పరిశీలిద్దాం ఇప్పుడు ఈ తేడాను 19వ శతాబ్దాన్ని దృష్టిలో పెట్టుకొని నిర్ణయించ నక్కరలేదు. సార్వత్రికంగా, సాహిత్యంలో కనబడే ఒకానొక దృక్పథంగా, ఒక మార్గంగా వీనిని అనుశీలన చేయవచ్చును.

బుష్ వంటి కొందరు విమర్శకులు క్లాసికల్—రొమాంటిక్ సాహిత్యాలకు గల తేడాను విస్పష్టంగా చెప్ప ప్రయత్నించారు. క్లాసికల్ సాహిత్యం వాస్తవానికి సన్నిహితంగా, నాగరిక జీవితానికి సంబంధించినదిగా ఉండగా, రొమాంటిక్ కవిత ఆదర్శం వేపు మొగ్గుతూ, జానపద జీవితాన్ని ఆశ్రయిస్తుంది ఒకదానిలో మేధ, మరొక దానిలో భావనాశక్తి ప్రాధాన్యం వహిస్తాయి. సంప్రదాయాన్ని ప్రతిపాదించే దొకటి కాగా, తిరుగుబాటు మరొక దానికి ఊపిరి. క్లాసిసిజమ్‌కు వస్తువు లోకపు సమస్యలు, అందరినీ కలవర పరచే రాజకీయ, మత, తాత్త్విక విషయాలు; రొమాంటిక్ కవితకు వస్తువు వైయక్తిక సమస్యలు, వ్యక్తిపరమైన ఆలోచనలు, అనుభవాలు, తాత్త్విక చింతనలు. దోషరహితంగా, అలంకారభూయిష్టమైన రచన ఒకటి కాగా, భావ తీవ్రత మరొక దానిని ఆశ్రయిస్తుంది. నియమబద్ధమైన, సంప్రదాయ సిద్ధమైన రచన ఒకటి కాగా, వ్యక్తిత్వాన్ని పోషించే రచన మరొకటి

అయితే ఈ రెండు మార్గాలకు గల తేడా ఇంత విస్పష్టంగా ఉంటుందా? అన్న అనుమానం కల్గడానికి అవకాశం లేకపోలేదు. పురాతన మయినంత మాత్రాన మంచిది కాదు, నూత్నమైనదవడం చేత ఈసడించేదగింది కాదు, అని కాళిదాసు హెచ్చరిక చేశాడు. అయినా నవ్యతను కించపరుస్తూ, పురాతనమైనదాన్ని — తనకు అలవాటు ఉన్నదాన్ని — పొగిడే విమర్శకులే క్లాసిసిజమ్‌కు పట్టం గట్ట ప్రయత్నిస్తారు కాని అట్టివారికి తమంత తాముగ పురాతన కావ్యానికి కాని, నూత్న కావ్యానికి కాని, స్పందించే భావుకత్వం ఉండదంటాడు వాల్టర్ పాటర్.

పాటర్ క్లాసికల్, రొమాంటిక్ లక్షణాలను సునిశితంగా పరిశీలించాడు. కథ ఎరిగినదేనయినా, చెప్పే పద్ధతి రమ్యమైనదవడంచేత, దానినే తిరిగి తిరిగి వినాలన్న అభిలాష కల్గితే, అక్కడ హృద్యమైన క్లాసిక్ ఉన్నదని మనం అనుకోవచ్చు. యుగయుగాల దవ్వు నుండి ప్రశాంతమైన వాతావరణాన్ని మోసుకొని వస్తుంది క్లాసిక్. అది కాలం గడిచినకొద్దీ చివికిపోదు; సహృదయులలో వైవిధ్యం ఉన్నప్పటికీ అరుచికి అవకాశం ఇవ్వదు. ఇదీ పాటర్ దృక్పథం.

అయితే క్లాసికల్, రొమాంటిక్‌కళలను నిర్వచించేటప్పుడు, బాహ్య సౌందర్యానికి క్లాసికల్ కళలో తగిన స్థానం ఉంటుందంటాడు; రొమాంటిక్ కళలో అది లోపించకపోయినా, సౌందర్యాని కొక వింతను చేర్చారు; సౌందర్య పిపాసతో పాటు కుతూహలం (Curiosity) ఉండడమే రొమాంటిక్ కళ లక్షణం అంటాడు పాటర్.

దీనినే మరో దృష్టిలో నుంచి చూడవచ్చు నంటాడింకో విమర్శకుడు. తొలిసారిగా సృష్టింపబడిన మంచి కావ్యం రొమాంటిక్ సృష్టే. ఆనాటి కది నవ్యమైనది; నాటి సౌందర్య సీమల నది విస్తృత పరచేది; ఆ సౌందర్యాని కొక వింతను కూర్చేది. కాని

కావ్యం మాగగా, మాగగా, అదే తర్వాతి యుగాలకు క్లాసిక్ అవుతుంది. వాల్మీకి ఆనాడు రొమాంటిక్ కవే. కాళిదాసుకూడా అట్టివాడే. కాని నేడు వారు క్లాసిక్‌లు అవుతున్నారు. మనకు పెద్దన క్లాసిక్; ఆనాడు ఆయన రొమాంటిక్. ఈ దృక్పథంలో కూడా సత్యం లేకపోలేదు. క్లాసిక్‌లో సర్వే సర్వత్రా అంగీకరించబడే ఒక లక్షణ మేమంటే బాహ్యస్వరూపంలో ఒక క్రమబద్ధమైన విన్యాసం గోచరించడం. మంచి ఊహాశాలి వ్రాసిన సరికొత్త కావ్యంలో వెనుకటి సూత్రాలకు లొంగని అంతర్నియమాలు ఉంటాయి. వానిని వెతకడానికి చాలా కాలం పడుతుంది. ఎప్పుడైతే ఆ నియమాలన్నీ విమర్శకునికి అందుబాటులోకి వచ్చాయో, అప్పుడు దానికే ఒక సంప్రదాయబలం ఏర్పడుతుంది. ఆ కావ్యం క్లాసిక్ అవుతుంది. షేక్స్పియరు రూపకాలు సమకాలీనులకు సంకరజాతిగా ఉన్నట్లు కనబడి, నియమరహితమైన రచనల్లా కనబడి ఉండాలి. కాని ఇప్పుడు ఆ నాటకాలు విశ్లేషణకు లొంగుతున్నాయి. షేక్స్పియరు క్లాసిక్ అయాడు.

అయినా ఇన్ని చెప్పినా క్లాసిక్—రొమాంటిక్ అన్న భేదం సాహిత్యంలో ఉండనే ఉంటుందనిపించడం సత్యం. సంప్రదాయ బలంతో రచింప పూనుకొన్నవాడు క్లాసిక్‌వైపు మొగ్గు చూపుతాడు. అలంకార శాస్త్రమర్యాదలనే కాకుండా, ఆనాటికి సాహిత్యంలో పేరుకొన్న నీమాల నన్నింటినీ త్రోసిపుచ్చే సాహసంలో కొంత రొమాంటిసిజమ్ గోచరించే అవకాశం ఉంది. అయితే ఈ రెండు రకాల సాహిత్యాలను పసిగట్టడం, అంతకన్న వానికి తేడాను నిర్వచించడం చాలా కష్టంతో కూడిన పని.

నా దృష్టిలో రొమాంటిక్ కవితలో ప్రధానంగా గోచరించే లక్షణం అద్భుత దర్శనం. మిగతా విషయాల నలా ఉంచగా, కవి లోకాన్ని చూసేటప్పుడు అతనికి లోకం అద్భుతంగా కనబడితే—అందులోని చట్టాలకన్న, అందులోని విధి నియమాలకన్న, కేవలం హృదయాన్ని ఆకట్టే ఆకర్షణతో కూడిన అద్భుతం కనబడితే, రొమాంటిసిజమ్ ఉందంటాను. పసిపాప బోసినవ్వునుంచి, పండు వెన్నెలవరకూ—అన్నింటా అద్భుత దర్శనం చెయ్యడం రొమాంటిస్టు ప్రత్యేక లక్షణం. రొమాంటిస్టు అద్భుత దర్శనం లోకంలో తొలి మానవుని అద్భుత దర్శనాన్ని పోలి ఉంటుంది. ఇందులో కల్మషంలేదు; హృదయ కవాటాన్ని తెరిచి ప్రతీ అనుభవాన్నీ ఆహ్వానించడం కనబడుతుంది. నూతన అనుభవాలకోసం పరుగులెత్తడం కనబడుతుంది. అద్భుతాన్ని అదుపులో పెట్టుకోవడం ఈతనికి చేతకాని పని. అద్భుతాన్ని ఆహ్వానించడమే ఈతని పని. అద్భుత దర్శనాని కీతడు విస్తుపోతాడు. అందులో తన్మయత్వాన్ని పొందుతాడు.

ఇక క్లాసికల్ కవికీ సౌందర్యం కావాలి. ఈతడూ లోకాన్ని చూసి మురిసిపోతాడు. కాని ఈతడు తన అద్భుతాన్ని అదుపులో పెట్టుకుంటాడు. పెరిగిన మనిషికి సూర్యోదయం నవోదయంకాదు. అయినా అందులోని సౌందర్యాన్ని పసిగట్టగల ''వేవ్ లెంగ్త్'' ఆతనిలో లేకపోలేదు. దానిని వర్ణించడంలో ఒక నిర్మమతతో వర్ణిస్తాడు. ఫొటోగ్రాఫిక్ కెమేరా నయగరా వంటి జలపాతాన్ని అయినా పట్టేయిస్తుంది. కెమేరా చాలా సున్నితమైంది, క్షణంలో బ్రహ్మాండమైన జలపాతాన్ని తన లెన్సుతో పట్టేసింది. అయినా కెమేరా ఏవిధంగానూ చలించిపోదు. ఆ బొమ్మను చూసిన మనలను చలింప చేస్తుంది. క్లాసికల్ కవికి సౌందర్యంపట్ల అంత సునిశితమైన చూపు ఉంటుంది. అంత సునిశితంగా, ''ఆబ్జెక్టివ్''గా పట్టి ఇవ్వడం కనబడుతుంది.

అయితే క్లాసికల్ రచయితలో అసలు అద్భుతానికి లోనయే గుణమే లేదా? అంటే ఉందని అంటాను. రొమాంటిసిస్టు అద్భుత దర్శనం ఆదిమానవుని అద్భుత దర్శనం వంటిది; పసివాని అద్భుత దర్శనం వంటిది అనుకున్నాము. కాని లోకాన్ని బాగా అర్థం చేసుకొన్న తర్వాత, జీవితపు లోతులను తరచాక, జీవితంలోని శిఖరాలను స్పృశించాక, మానవునిలో ఒక తెలివి విరుస్తుంది. ఇది కేవలం మేధకు అతీతమైంది. జీవితాన్ని ఆకళింపులోకి తీసికొని వచ్చేది. ఇలా పెరిగిన కవికి, ఇట్టి తెలివి విరిసిన కవికి, ఈ దర్శనం ఉన్న కవికి—కల్గే అద్భుతంయొక్క అంతస్థే వేరు. లోకం ఇంత అర్థవంతంగా ఉండడాన్ని చూసి ఆశ్చర్యపోతాడు. లోకంలోని వైవిధ్యాలు, విరుద్ధాలు, ఆకర్షణలు, ఘర్షణలు, వేని కని కావ్య వస్తువులు కావచ్చు. కాని క్లాసికల్ కవి వీని నన్నింటినీ తన దర్శనంలో ఇముడ్చుకొని, వాట్లకొక అర్థాన్ని అన్వేషించి, దర్శించి ముగ్ధుడవుతాడు. రొమాంటిక్ కవి హృదయంతోనే ఆలోచిస్తాడు; మధురంగానే పలుకుతాడు. క్లాసికల్ కవి ఆలోచనే హృదయాన్ని కదిపేది అవుతుంది. పలుకులో మెత్తందనమేకాదు కావలసింది, గరువతనం కావాలి. వివశత్వమేకాదు, బలంగా, ధైర్యంగా నిలబడగల శక్తి అవసర మంటాడీతడు. రొమాంటిసిస్టుకు మానవుడే మహోన్నతుడు, అతడే దేవుడు. క్లాసిసిస్టు కూడా మనిషిని బాగా వడకాచి చూసాడు. అతనికి దేవుడు కూడా మానవుడే.

అంటే రొమాంటిక్, క్లాసిక్ కవులలో ఇద్దరిలోనూ అద్భుత దర్శనం ఉండగా, దాని స్థాయిలోనూ, లక్షణంలోనూ తేడా ఉన్నదన్నమాట.

మరో మాట: రొమాంటిసిస్టు ఎలాగైనా స్వేచ్ఛాప్రియుడు. వెనుకటి బంధనాలను ఊడ్చుకుంటాడు. ఇలా శృంఖలాలను త్రెంచుకోవడం ఆతనికి అవసరం. అతని నూతన ఆలోచనలు వెనుకటి మూసలలో ఇమడవు. అంచేత గతంతో ఆతడు తెగత్రెంపులు చేసుకోవాలనుకుంటాడు.

క్లాసిసిస్టు అలా అనడు. పైకి సంప్రదాయ వాదిలా కనబడతాడు. స్వేచ్ఛను కోరుతున్నట్లే కనబడడు. కాని వెనుకటి కవులు చూపిన బాటను సునిశితంగా పరిశీలిస్తాడు. ఆ మార్గాన్నే పయనించినట్టు కనబడతాడు. కాని ఆ మార్గాన్ని విస్తృత పరుస్తాడు. అంతకుపూర్వం ఉన్న ఏ కాలిబాటనో సిమెంటురోడ్డుగా మలుస్తాడు. పుంత పాతదే. కాని ఈతడు వేసిన బాటవల్ల అది రహదారి అయిపోయింది. వెనుకటి ఛందస్సులను అంగీకరించినట్లు కనబడతాడు. కాని అందులో కొత్త లయలను ప్రవేశపెడతాడు. ఛందస్సు

వెనుకటిదేనయినా, ప్రస్తారంచేసి నూత్న వృత్తాలను వాడుతాడు. వెనుకటి అలంకారాలనే వాడినట్టు కనబడతాడు. కాని ఈతని శబ్ద చిత్రాలు క్రొత్తగా ఉంటాయి.

కాని ఇవన్నీ బాహ్య స్వరూపానికి సంబంధించినవి. క్లాసిసిస్టును నిక్కచ్చిగా పట్టి యిచ్చేది ఆతని ఆలోచనా విధానం, శిల్ప దృష్టి, లోచూపు. సంప్రదాయంమీద తిరుగబడినా, అనుసరించినా ఆతని ఆలోచనా విధానం విశ్లేషణను ఆకర్షిస్తుంది; శిల్పదృష్టి అకుంఠితంగా ఉంటుంది; లోచూపు లోకానికి ఉపకరించేదవుతుంది.

పై పర్యాలోచన వల్ల మరొకవిషయం కూడా తేలుతోంది. ఏ కవికైనా నూటికి నూరుపాళ్లు క్లాసిసిస్టుగా కాని, రొమాంటిసిస్టుగా గాని, ఉండడం సాధ్యమేనా, అంటే కాదనిపిస్తుంది. కవులందరూ - నిక్కమైన కవులందరూ —, జీవితంలో ఎప్పుడో అప్పుడు తిరుగుబాటు మనస్తత్వంతో ఉండి ఉంటారు. రొమాంటిక్‌గా ఉంటారు. అక్కడనుంచి పతనమై కొందరు బొత్తిగా అభివృద్ధి నిరోధకులుగా స్థిరపడిపోతారు. కొందరు తాము సాధించిన కొత్త బాణీకి మెరుగులు చెక్కుతూ రొమాంటిక్ కవులుగా స్థిరపడిపోతారు. కాని ప్రతిభావంతుడైన కవి రొమాంటిక్ దృక్పథంనుంచి క్రమక్రమంగా క్లాసికల్ కవిగా రూపొందవచ్చును. మరికొందరు సంప్రదాయంతో ప్రారంభించి, అంతటితోనే చలికిలపడి పోతారు. సంప్రదాయంతో ప్రారంభించి, రొమాంటిక్ కవిగా రూపొందడం, అక్కడనుంచి అద్భుతమైన ప్రతిభావిశేషంచేత క్లాసికల్ కవిగా రూపొందడంకూడా కనిపించవచ్చును. సాధారణంగా ఏ ఒక్క కవినీ నూటికి నూరుపాళ్లు రొమాంటిక్ కవి అనికాని, క్లాసికల్ కవి అని గాని అన వీలులేదు. ప్రతికవిలోనూ రెండు అంశాలూ ఉంటాయి. ఒక్కొక్క కవిలో, ఒక్కొక్క రచనలో ఒక్కొక్కపాలు ఎక్కువ ఉంటుంది.

అయితే ఇక్కడ మరొక్కమాట అనుకోవాలి. రొమాంటిక్ కవితపేరున అర్థంలేని వెర్రికేకలు, చవకబారు ప్రేమగీతాలు, లేని ఆవేశాన్ని కల్పించుకొని వ్రాసే గేయాలు, మనకు ఎదురౌతాయి. క్లాసికల్ కవిత పేరున ఇంతకన్న పెద్ద అపచారమే సాహిత్యానికి జరగవచ్చును. దానికొక సంప్రదాయం, ఒక అధికారం, ఒక పీఠం ఏర్పడడంచేత, పాండిత్యబలంతో, ఏ అలంకార శాస్త్రాన్నో ఆధారంగా చేసికొని రచించే రచన మహాకావ్యంగా కొన్నాళ్లు చెలామణి అయిపోవచ్చు. కాని పరిశీలన చెయ్యగా వీనిలోని సౌరు కోమలులది కాదు, కొయ్యబొమ్మలదే! ముక్కూ, కళ్లూ, అన్నీ ఉంటాయి, కాని ప్రాణం మాత్రం ఉండదు!

## 3

ఈ పరిశీలనవలన క్రమంగా మనం మన సాహిత్యాన్ని సమీపించే అవకాశం కల్గుతోంది. ఈ శతాబ్దంలో మనకొక కాల్పనికోద్యమం వచ్చింది. ఇది సూటిగా ఆంగ్లకవిత్వ ప్రభావంవల్లనే రావడం నిజం. వైతాళికులలో కవులనుగూర్చి చేసిన పరిచయంలో ఎందరు కవులు కీట్సు, షెల్లీ, వర్డ్స్‌వర్తులవల్ల ప్రభావితులయారో వివరింపబడింది. వారికీ, వీరికీగల సామ్యాన్నిగూర్చి సూచింపబడింది. అయితే దీనికొక పూర్వ రంగం ఉంది. దాన్ని సిద్ధపరచినవారు ముగ్గురు. ఆలోచనలో నవ్యతను కోరింది వీరేశలింగంపంతులు. భాషలో నవ్యతకు కారణమైంది గిడుగు పిడుగు. భాషలోనూ, ఆలోచనలోనూ నవ్యతను కావాలన్నవాడు గురజాడ. సాహిత్యపరంగా ఈ ముగ్గురిలోనూ గురజాడ మంచి స్రష్ట. అయితే కాస్త జాగ్రత్తగా పరిశీలిస్తే గురజాడ కవితలో రొమాంటిసిస్టు, నాటకంలో క్లాసిసిస్టులా కనబడతాడు.

గురజాడ ''కన్యక'' మంచి కావ్యం. కథ పాతదే, చెప్పిన తీరు కొత్తది. కథకు ఒక వడి ఉంది; దౌష్ట్యాన్ని ఎదిర్చే పెంకితనం కనబడుతుంది కథను చెప్పడంలో వెనుకటి పద్ధతులన్నీ ఎగిరిపోయాయి. కొత్త లయలలో కొత్తగొంతు వినబడుతుంది; ఒక ధీమా, ఒక గరువతనం కనబడుతుంది. లవణరాజు కలలో స్వాప్నిక వాతావరణం చాలా సున్నితంగా ఒదిగిఉంది. కవిత్వపు నుడికారంలో కొత్తదనం ఉంది. ఇక ''పూర్ణమ్మ కథ'' నిండా చిక్కని కవిత చోటు చేసుకుంది. కథను ఎత్తుకోవడంలోనే ఒక కరుణరసపు పొంగు కనబడుతుంది. పూర్ణమ్మ అతి సున్నిత రేఖలతో తీర్చబడింది. కథావస్తువులో వింత లేదు. జీవితం సామాన్యురాలి జీవితం. కాని అందులోని విషాదాన్ని చూడగల్గడంలో గురజాడలోని రొమాంటిసిస్టు ఉన్నాడు. కథ ఇవ్వగల్గిన సందేశం అప్రస్తుతమైన కాలంలోకూడా ఈ కథ గొప్పదిగానే నిలచిపోతుంది. కథాశరీరాన్ని మలచిన పద్ధతి, కథను చెప్పినతీరు, భాష, ఛందస్సు రొమాంటిక్ పద్ధతికి పరమావధిలా ఉన్నాయి. అందులో నవయుగోదయంలో విరచించబడిన ఈ గేయకథలోని అందం మానవుని తొలి ఉషస్సును చూచిన నాటి ఆనందాన్ని, అద్భుతాన్ని కల్గిస్తుంది సుమారు డబ్బయియేండ్లుగా గేయకవిత సాధకం చేయబడుతూన్నా, ఇంత అందమైన చిన్న కథ గేయంలో ఇంతవరకు రాకపోవడం ఆశ్చర్యకరం!

ఇంతటి రొమాంటిక్ కవీ, తాను వ్రాసిన కన్యాశుల్కంలో కాల్పనికోద్యమానికి ప్రతినిధిగా ఉండే నాటకకర్తగా కనబడడు. గురజాడ కన్యాశుల్కం నిస్సందేహంగా తెలుగులో ఒక క్లాసిక్. దానిలోని లోపాలను అలా ఉంచండి. అంతటి చతురంగా నిర్వహింపబడిన సంభాషణ, అంత సునిశితంగా నుడికారాన్ని పసిగట్టడం ఇంకో చోట కనబడదు. పాత్ర చిత్రణ చాలా శ్రద్ధగా దిద్ది తీర్చబడింది. కొందరి సృష్టిలో పాత్రలు కేవలం types మాత్రంగానే ఉంటాయి, ముఖ్యంగా సంస్కరణ ప్రయోజనాన్ని ఆశించే ప్రహసనాలలోనూ, నాటకాలలోనూ. అందులో మనకు వ్యక్తులు దొరకరు. చింతామణి నాటకంలోని శ్రీహరి లాగ ఒకానొక వ్యవస్థకో, భావానికో, గుణ దోషాలకో వారు చిహ్నంగా ఉంటారు: కన్యాశుల్కంలోని పాత్రలలో కొందరు types అయిన మాట నిజమే. రామప్పంతులు అట్టి ఒక type; అయినా అతడు అద్భుతమైన వ్యక్తి. లుబ్ధావధాన్లు మరొక type; కాని అతడు నూటికి

మూరు పాళ్ళు లుబ్ధత్వానికే చిహ్నంగా మిగిలి పోకుండా, మనిషిగా కూడా మిగిలాడు. అలాగే మిగతా వాళ్ళు; శిరీశం గిడస బారిన దొంగ సంఘ కర్తే కాదు, అంత కంటే ఎంతో ఆకర్షణీయమైన వ్యక్తి. పాత్రల మొత్తం మీద సౌజన్యారావు ఒక్కడే ఒక టైప్ అనుకోవాలి. అతనిలో కూడా వ్యక్తిత్వాన్ని బొత్తిగా చూపకపోలేదు గురజాడ. ఇక మధురవాణి వేశ్య. ఆమెను చిత్రించడంలో గురజాడ చూపిన సానుభూతి అనన్య సామాన్యమైనది. ఆ పాత్రలోని ఆకర్షణను కాలం తుడిచివేయ లేదు. సాహిత్యంలో కొత్త పాత్రలెన్ని ఆవిర్భవించినా, ఆమె స్థానం చెక్కు చెదరదు. ఈ ఒక్క పాత్ర సృష్టిలో గురజాడలో కొంత రొమాంటిసిస్టు వుండవచ్చు. ఏమంటే సాధారణ వ్యక్తిని అసాధారణ వ్యక్తిగా తీర్చడంలో రొమాంటిసిజమ్ పొడచూపుతుంది కాని మిగత రూపక నిర్వహణ అంతా భారీ ఎత్తున క్లాసికల్ పద్ధతిలోనే నడిచింది.

అంటే అర్థం వెనుకటి అలంకార శాస్త్రాలలో సూచింపబడిన పద్ధతుల నాశ్రయించి నాటక రచనా జరిగిందని అర్థం కాదు. నాటకానికొక పథకం ఉంది. నాటక కర్త యొక్క హృదయం కన్న మేధకు ఇందులో ఎక్కువ పని గలిగింది. కవి ఆవేశపరుడై నాటకాన్ని నిర్వహించలేదు. అతని ఆవేశం అతని అదుపులో ఉంది. కవికి ఉన్న అద్భుత దర్శనం ఎంతో విజ్ఞత వల్ల కల్గింది; తెలివి వెలార్చేది. కన్యాశుల్కంలో నిస్సందేహంగా క్లాసికల్ లక్షణాలు కనబడతాయి.

యుగపురుషుడుగా భావించబడుతూన్న గురజాడలో క్లాసిక్, రొమాంటిక్ లక్షణాలు రెండూ కూడా గోదావరీ, శబరులలా కలిసి ఉండడం ఆధునిక సాహిత్యంలో ఒక విచిత్రమైన సన్నివేశం. ఇది ఒక మంచి వారసత్వాన్ని ఇవ్వడానికి, సంప్రదాయాన్ని సృష్టించడానికి కారణం కావచ్చు.

రెండు ప్రపంచ యుద్ధాల మధ్య కాలంలో వచ్చిన రచయితలూ, కవులూ, అందరూ, అంతో ఇంతో పాశ్చాత్య రొమాంటిక్ సాహిత్యం వల్ల ప్రభావితులైన వారే. అందులో కొందరికి ప్రభావం వంగ సాహిత్యం ద్వారా లభించింది. మరి కొందరిని ఆ వాతావరణమే రొమాంటిసిస్టులుగా మలచింది. దేశంలోని స్వాతంత్ర్యోద్యమం ఈ రొమాంటిక్ వాతావరణానికి దోహదకారి అయింది. వెనుకకు తిరిగి చూసుకోగా, గతంలోని వైభవం కవికి తటిల్లతలా మెరిసింది. ప్రతి కవి ''జారిన దేశ గౌర''వాన్ని చక్క దిద్ద సంకల్పించిన వాడే. రాయప్రోలు నుంచి, రామిరెడ్డి వరకూ ప్రకృతిని క్రొత్త దృష్టితో చూసిన వారే. ఈ యుగంలోనే స్త్రీ క్రొత్త మూర్తిమత్వాన్ని సంతరించుకుంది. తల్లావఝల కథా కథన పద్ధతి రొమాంటిక్ పద్ధతే. జాషువా ''పిరదౌసి'' కేవలం పాత పద్ధతిలో చెప్పిన కథ కాదు. అందులోని ఆవేశానికి లోటు లున్నాయి. కవి కొండల, బాపిరాజు బొత్తిగా గడుసుదనాన్ని ఎరగని (సొఫిస్టికేషన్ లేని) రొమాంటిసిస్టులు. పిల్లల పాటలను వ్రాయడంలో, పిల్లల సాహిత్యాన్ని సృష్టించడంలో చింతా దీక్షితులు, అఖండ ప్రతిభాశాలి.

ఎంకి పాటలు వ్రాసిన కవి నిస్సందేహంగా మంచి రొమాంటిసిస్టు. అందులోని భాష జానపదుల భాష, నుడికారం జానపదులది. కాని శబ్ద చిత్రాలు కొత్తవి. ఒకానొక అమాయికత్వంలో నుంచి తెలివిని ప్రదర్శించడంలో నండూరి సుబ్బారావు ఘటికుడనిపించు కున్నాడు. ''ఎనక జల్మంలోన ——'' అనే పాటను చూడండి. అలాగే ''ఇంతే నటే సంద్రమెంతో అనుకొంటి — — — —'' అన్న దానిలో అమాయికత్వంలో మంచి లోతులను త్రవ్వుతాడు.

కాని కృష్ణశాస్త్రిగారు భావకవిత్వానికి తెనుగులో పెట్టింది పేరు. నిజానికి రాయప్రోలు, రామిరెడ్డి మున్నగు వారిలో భాషలో కొత్తదనం తక్కువ, నుడికారం పాతదే. విషయంలో క్రొత్తదనం తీసుకొని రావడానికి ప్రయత్నించారు. కాని కృష్ణశాస్త్రి అలాకాదు. అసలు కవిత్వపు భాషనే మార్చి వేసారు. కవిత్వపు నుడికారాన్నే క్రొత్త మార్గాలకు పట్టించారు. వెనుక ఈ ప్రయత్నం కొంత గురజాడ చేసిన మాట నిజమే. కాని దాన్ని ఒక విద్యగా సాధించిన వాడు కృష్ణశాస్త్రి.

కవిత్వంలోని తన తనాన్ని—ఆత్మాశ్రయమైన కావ్యాన్ని—ప్రవేశపెట్టడంలో కూడా కృష్ణశాస్త్రి మొదటి వాడు కాదు. తిరిగి గురజాడ ఈ మార్గానికి ప్రవర్తకుడు, ''లంగరెత్తుము'' వంటి వానిలో. కాని అది చాల లేదు. చలం అన్నట్లు తన బాధనంతనూ దేశం బాధగా చేసిన గొప్ప కవి కృష్ణశాస్త్రి. మిగతా వాళ్ళలో అక్కడక్కడ సందేహిస్తూ, నక్కుతూ, నక్కుతూ వచ్చిన తన తనాన్ని కృష్ణశాస్త్రి తన కవిత్వంలో నిలువు టెత్తు పెరిగేటట్టు చేసాడు.

ఆత్మాశ్రయమైన కావ్యంలో స్వేచ్ఛకోసం అర్రులు చాచడం ఒకటీ, ప్రేయసిని సృష్టించుకోవడం మరొకటీ, కృష్ణశాస్త్రిగారిలోని ప్రత్యేకతలు. ఇది క్రమక్రమంగా భక్తుడు పరమేశ్వరునికి ఆత్మనివేదనం చేసికొనడంగా తర్వాత, తర్వాత సబ్‌లిమేట్ అయింది. అంచేత మనకు రొమాంటిక్ కవి ఎవరంటే కృష్ణశాస్త్రి అన్నది స్థిరపడి పోయిందన్నదాంట్లో సందేహం లేదు.

విశ్వనాథ గొప్ప వ్యక్తిత్వమున్న కవి. ఈయన ప్రారంభం రొమాంటిసిస్టుగానే. కిన్నెరసాని పాటలలో మంచి రొమాంటిసిస్టు కనబడుతాడు. ఆత్మాశ్రయమైన కవిత్వమూ వ్రాసాడు. అనార్కలీ నాటకంలో రొమాంటిక్ అంశం కనబడుతుంది. కాని విశ్వనాథ నైజంలో ఒక అసంతృప్తి ఉంది. ఆకాశాన్ని అందుకోవాలన్న ఆకాంక్ష కనబడుతుంది. తనకున్న ప్రపంచంతో తొందరగా సమాధాన పడలేదు. తనకు వచ్చిన సాహిత్యపు వారసత్వం చాలుననుకోలేదు. ఆయన ఆశ పెద్దది; సాధన గొప్పది. మనకు రొమాంటిసిస్టులలో నుంచి క్లాసికల్ కవిగా పెరిగిన వాడీయన ఒక్కడే. చిత్రమేమంటే ఈయన కనబడ్డం అందరికీ సంప్రదాయ వాదిలా; కాని వెనుకటి వృత్తాలను వాడడంతో తృప్తిపడలేదు. కొత్తవాటిని సృష్టించుకున్నాడు. గురజాడ వంటి వారు వెనుకటి గేయాన్ని మలచి ముత్యాలసరంగా మలిస్తే, ఈయన ప్రస్తారం చేసి క్రొత్త వృత్తాలనే సృష్టించుకొన్నాడు. ఈయన వాడిన శబ్దాల అవధి

గాలా నిడివైంది. నిఘంటువులలోనున్న మారుమూల పదాలనుంచి వ్యవహారంలో వినబడే "పోరడు" (—బాలుడు) వరకూగల శబ్దాల న్నింటినీ వాడడానికి జంకడు. శబ్ద చిత్రాలను సృష్టించడంలో మహా సాహసి. పాత కావ్యంలోనే క్రొత్త అర్థాలను పలికించడానికి ఏమాత్రం సందేహించడు. అలంకారశాస్త్రంపట్ల ఎంతో అభిమా నాన్ని కనబరుస్తాడు. కాని కావ్య సౌందర్యావిష్కరణకు ఆ పడికట్టు రాళ్ళను వాడడు. వెనుకటి కవులపట్ల చూపే అభిమానపు తంతుకు స్వస్తి చెప్పి, వాళ్ళను అర్థంచేసుకొందుకు ఒకమార్గాన్ని చూపాడు. ఎవ్వరేమి వ్రాసినా, కోరగానే దానికొక పీఠికను వ్రాసి ఇచ్చినా, ఈయన ప్రమాణాలకు, విశ్లేషణకు మహాకవులు కాని నిలబడలేరు. తాను వ్రాసిన దానిలోనూ అట్టి ప్రమాణాలే ఉండాలన్న దీక్ష ఈయనిది. అందుచేతనే తాను సంప్రదాయ వాదినని చెప్పుకోవ డానికి బిడియపడలేదు, జంకలేదు. ఏమంటే ఆయనశబ్దప్రయోగం, శబ్దచిత్రాలు, అలంకార నిర్వహణ, శిల్పదృష్టి అన్నీ విశాలమైనవి. కవిత్వపు పరిధిని విస్తృతి పరచిన కవి విశ్వనాథ. సందేహం లేదు; ఈయన ఒక్కడే మనకు మంచి క్లాసిక్!

ఇక శ్రీశ్రీ ఎక్కడ ఉన్నాడు అంటే—కాస్త తీరికగా ఆలో చించాలి. శ్రీశ్రీ సంప్రదాయంలోనుంచి తొందర తొందరగా రొమాంటిసిస్టుగా మారాడు. కాని దానినుండి తిరుగుబాటు చేసాడు. కృష్ణశాస్త్రికి స్వేచ్ఛ ఊపిరి అయితే, ఈయనకు తిరుగు బాటు ప్రాణం. కృష్ణశాస్త్రి వెనుకటి వాళ్లతో రాజీపడి ముందుకు పోతాడు. శ్రీ శ్రీ మూలధనం అంతా వెనుకటి కవులే అంత సంప్రదాయబలం ఉంది కనుక వాళ్ల నందరినీ తిరస్కరించ గల తాహతూ ఉంది; తిరస్కరించి కొత్త సంప్రదాయాన్ని సృష్టించగలనన్న నమ్మకం, ఆత్మవిశ్వాసం ఉన్నాయాయనకు. కవిత్వం వెనుకటి శిల్పపు చెరసాలల్లో బందీగా ఉండడాని కేమాత్రం అంగీకరించడు. ఆ శిల్పపు సంకెళ్ళను బ్రద్దలు కొట్టినంతకాలం బ్రద్దలుకొట్టాడు; కవిత్వానికి కొత్త లయలను, రూపురేకల్ని దిద్ద డానికి మంచి పునాదులు వేసాడు. భారతదేశం మొత్తంమీద 1930 తర్వాత రొమాంటిసిజమ్‌మీద వచ్చిన తిరుగుబాటులో శ్రీ శ్రీది— దేశం గుర్తించలేదేమో కాని!—గొప్ప పాత్ర. కవిత్వాన్ని ప్రజాపరం చేయడం అన్నది ఒక విధంగా క్లాసికల్ లక్షణం. దీనికి శ్రీ శ్రీ మంచి ఉదాహరణ.

అయితే శ్రీ శ్రీ ఏమయినట్టు?

ఏమో! కానీ, కొన్నాళ్ల తర్వాత గత ఏభై ఏళ్ల సాహిత్య చరిత్రనూ పర్యాలోచన చేస్తే ముగ్గురు మూర్తులు మిగులుతారు. వారు: విశ్వనాథ, కృష్ణశాస్త్రి, శ్రీశ్రీ: ముగ్గురూ మూడు మార్గాలకు ప్రవర్తకులు. మిగతా వారందరూ వీరికి సరసన ఇటూ, అటూ నిలబడ దగ్గవారే!

ఇంతకీ చెప్పవచ్చేది: శ్రీశ్రీ కృష్ణశాస్త్రికి దగ్గరగా, విశ్వనాథవైపు జరుగుతూన్నట్టు కనబడతాడు.

మరొక్కమాట: మన రొమాంటిక్‌యుగం ముగిసింది. క్లాసికల్ యుగంలోకి అడుగుపెట్టాం.

# ఆ కా శా లు

## శ్రీ మిరియాల రామకృష్ణ

జలధరాలలోని మెరుపు
నా ప్రేయసి ప్రేమలేఖ!
ఎవరా ప్రేయసి? అంటే
ఆమె కొరకె అన్వేషణ!

వియత్ సీమలోని తార
నా మమతా పర్ణశాల!
నిర్మించిందెపుడంటే
దానికొరకె పరిశోధన!

శకుంతాల కేరవాలు
నా కౌతుక సంగీతం!
సాక్ష్యం ఏముందంటే
మౌన మొకటె నా జవాబు!

నిశీథినీ తుషారాలు
నా అనుకంపారేఖలు!
ఎవరికొరకు అవి? అంటే
నిర్దేశం దుస్సాధం!

డా॥ యన్. శివరామమూర్తి

# తిరువనంతపురంలో తెలుగు

**1961** జనాభా లెక్కల ప్రకారం కేరళ రాష్ట్ర ముఖ్య పట్టణమైన తిరువనంతపురంలో 2438 మంది తెలుగు వాళ్ళున్నట్లు అంచనా. వీళ్ళలో రెండుముఖ్యమైన జాతులున్నాయి. 1. తెలుగు చెట్టియార్లు 2. తెలుగు రెడ్డియార్లు. ఈ రెండు తెగల వారికి వర్తక వాణిజ్యాలే జీవనాధారం. వీళ్ళలో తెలుగు రెడ్డియార్లు ధనవంతులు· తిరువనంతపురంలో మంచి శాఖాహార భోజన హోటళ్ళు, పెద్ద పెద్ద బట్టల దుకాణాలు, బంగారం దుకాణాలు తెలుగు రెడ్డియార్లే నడుపుతున్నారు. రమారమి 90 సంవత్సరాల నుంచి మలయాళ సాహిత్యాన్ని అచ్చొత్తించి వెలుగులోకి తెచ్చిన మొట్టమొదటి ప్రెస్సు తెలుగు రెడ్డియార్లదే. ఇప్పటికీ కేరళ రాష్ట్రంలో రెడ్డియార్ ప్రెస్సులు (3) పెద్ద ప్రెస్సులుగా పరిగణింపబడతాయి. 'కుంకుమం' అనే ప్రఖ్యాతమైన వార పత్రిక తెలుగు రెడ్డియారే నడుపుతున్నారు. చెట్టియార్లనే మరో తెలుగు జాతి కూడా ఉంది యిక్కడ. వీళ్ళవి రమారమి 400 కుటుంబాలు. తిరువనంతపురానికి తూర్పుగా కరమన అనే ప్రాంతంలో ఒక వీధి అంతా తెలుగు చెట్టియార్లే. వీళ్ళు కట్టించిన దేవాలయం ఈ వీధిలో ఉంది. ఇది రెండు వందల సంవత్సరాల కిందట కట్టించినదని చెప్పుకుంటారు. వీళ్ళు యిక్కడికి ఎప్పుడు వచ్చారో సరిగ్గా తెలీదు. వాళ్ళలో ఎక్కువ మంది కూరగాయలు, పళ్ళు, బియ్యం మొదలయినవి అమ్ముకొని బతుకుతారు. మట్టితో బొమ్మలుచేసి రంగులువేసి అమ్మడం వీరి ప్రత్యేకత. ఈ రెండు తెగలకు (రెడ్డియార్ — చెట్టియార్) చివర 'యార్' అన్నది తమిళనాడు ద్వారా అక్కడికి వెళ్ళిన తర్వాత వచ్చినదే అనుకుంటాను. ఆర్—అనేది గౌరవ వాచకం.

రెడ్డియార్లు మాట్లాడే తెలుక్కంటే చెట్టియార్లు మాట్లాడే తెలుగులో పురాతనమైన తెలుక్కి సంబంధించిన కొన్ని లక్షణాలున్నాయి. ఈ వ్యాసంలో యీ భాషలోని లక్షణాల్ని స్థూలంగా పరిశీలిద్దాం. ఇంటిలో పెద్దవాళ్ళకు మాత్రమే తెలుగు తెలుసు. 20 సంవత్సరాలలోపు వారికి ఏవో పొడి పొడి మాటలు తప్ప తెలుగురాదు. ఇంటిలో పెద్దవాళ్ళు వాళ్ళలో వాళ్ళు తెలుగులో మాట్లాడుకుంటారు. బయట కూడ తెలుగు చెట్టియార్లు వాళ్ళలో వాళ్ళు (పెద్దవాళ్ళు) తెలుగు మాట్లాడుకుంటారు.

## 2. ఈ భాషలో ఈ క్రింద నిచ్చిన వర్ణాలున్నాయి

అచ్చులు :

| | |
|---|---|
| ఇ | ఉ |
| ఎ | ఒ |
| అ | |

* వీటి అన్నిట్లో దీర్ఘం కూడా వర్ణమే.

హల్లులు :

| | | | | |
|---|---|---|---|---|
| ప | త | ఏ | చ | క |
| బ | ద | డ | జ | గ |
| మ | న | ణ | | |
| | స | | | |
| | య | | | |
| వ | | | | |
| | ర | | | |
| | ల | ళ | | |

వీటిని వర్ణాలుగా నిరూపించడానికి కొన్ని ఉదాహరణలు. కొన్ని మాటలు సుబోధకంగా ఉండడానికి నేటి తెలుగులో సమానమైన పదాలు బ్రాకెట్లలో యివ్వబడ్డాయి.

అచ్చులు : తిన్నె (వరండా) తెన్నె (కొబ్బరికాయ) తన్నె (వంటినారి) తొన్నె (తొండ) తున్నె (కుట్టడం) ఈట్టి (ఈటె) ఏట్టి (ఏమిటి) ఆట్టి (ఆడు) ఓట్టి (ఒకటి) ఊట్టి (చెవిపోటు)

హల్లులు · పంది, బంది (బంతి — వరస) తుడు, దుడి (వంకు) చవరి (కొబ్బరి పీచు) జవరి (నములు) కాలి (ఖాళీ) గాలి, అది, అడి (కొట్టడం, దెబ్బ) అమ్మ, అన్న, తల, తళ (గాజు) ఎవ్వ (అమ్మ) ఎయ్య (నాన్న) పుత్తు (కాలిబాధ) పుట్టు (ఒకరకమైన వంటకం.)

మీదివాట్లో 'అడి, తళ, పుట్టు' మొదలైనవి మలయాళం మాటలు.

2.1. వీరి భాషలో సంస్కృతం మాటలు చాల తక్కువ. అందువల్ల మహాప్రాణాలు వీరి భాషలోలేవు. ఆధునిక తెలుగుతో పోల్చుకుంటే అచ్చులలో జరిగే లోయరింగ్ గుణం యీ మాండలికంలో కనిపించదు. ఇక్కడ ఆధునిక తెలుగులో జరిగే అచ్చుల లోయరింగ్ గురించి కొంచెం చెప్పుకోవడం అవసరం.

ఎ. నిన్ను న్ + ఇ + న్ + న్ + ఉ

బి. నిన్న న్ + ఇ + న్ + న్ + అ

1 2 3 4 5

మీది పదాల్లో రెండింటిలోను అయిదేసి ధ్వనులున్నాయి. ఇందులో 2, 5 ధ్వనులు అచ్చులు. మిగతావి హల్లులు. పదం మొదట్లో ఉన్న అచ్చుకి సమస్వరత (vowel harmony) వల్ల 'ఎ'లో నున్న 'ఇ'కి, 'బి'లో నున్న 'ఇ'కి వ్యత్యాసం ఉంది. ఈ వ్యత్యాసం యీ పదాలు పదాలుగా ఉన్నప్పుడు చిక్కులేదు. కాని సంధి మార్పులవల్ల పదం చివరలోని అచ్చులోపిస్తే ఈ రెండవ అచ్చులోని వ్యత్యాసం పదంలోని అర్థాన్ని మార్చి చూపిస్తుంది. ఉదాహరణకి.

సి. నిన్నమ్మ పిల్చింది న్ + ఇ + న్ + న్ + అ + మ్ + మ్ + అ

డి. నిన్న మ్మ పిల్చింది న్ + ఇ + న్ + న్ + అ + మ్ + మ్ + అ

1 2 3 4 5 6 7 8

మీది ఉదాహరణంలో 5వ స్థలంలో మనం యిప్పుడు అ మాత్రమే గుర్తించగలం. కాని ఎ. బి. లలో యిచ్చిన ఉదాహరణలో 5వ స్థలంలో 'ఉ, అ' అనే రెండు అచ్చులున్నాయి. కాని యీ రెండు అచ్చులు సంధివశాత్తు లోపించడంవల్ల, 2వ స్థలం లోని ఇ ఇలలో ఉన్న చిన్న మార్పు పదాల్లోని అర్థం మార్పుకు కారణం అవుతుంది. ఇటువంటి మార్పు నేటి తెలుగులో ఉన్న అన్ని అచ్చులలోను జరుగుతుంది దానివల్ల భాషలో కొన్ని చిక్కులు కూడ ఏర్పడ్డాయి.

ఒక్క ముద్దియ్యమ్మా అన్నదానికి రెండర్థాలు చెప్పుకో వచ్చు. అలాగే మెట్లమీదున్నాడు, పిల్లనుకున్నాను మొదలైనవాటికి రెండర్థాలు చెప్పుకోవచ్చును.

2. 2. ఇంతకీ చెప్పదగిందేమిటంటే చారిత్రాత్మకంగా నేటి శిష్టవ్యావహారిక తెలుగులో జరుగుతున్న యీ మార్పు వీరి భాషలో జరగలేదు స, శ, ష అనే మూడు వర్ణాలకు బదులు వారి భాషలో స మాత్రమే మిగిలిపోయింది. దంత్య, తాలవ్య చ జ ల మధ్య వ్యత్యాసం సవర్ణత మాత్రమే. కాని యీ మాండలి కంలో పదాదిన శిష్టవ్యావహారికంలోలాగ చ–చ గానే నిల్చి ఉంది. ఆంధ్ర రాష్ట్రంలో మాట్లాడే నిమ్నజాతుల తెలుగులో పదాది చ కారం స కారంగా మారింది తిరువనంతపురం మాండలికంలో పదాది చకారానికి కొన్ని ఉదాహరణలు.

చేయి, చెంబు (రాగి అనే అర్థంలో), చెప్పు, చెదురు, చెడి (చెట్టు), చూయి (చూచు), చుత్తు (చుట్టు), చీమ, చిలుక్క (సీతాకోక చిలుక) చిన్న, చారు, చాప, చూలు, చచ్చి (చచ్చాడు).

2. 3. ప్రాచీన తెలుగులోలాగ కొన్ని పదాల చివరి సిల బుల్ ముందు అనునాసికం యీ మాండలికంలో ఉండడం గమ నార్హం. కొన్ని ఉదాహరణలు: వాండు, పీండు, మగండు, మార్యండు, తమ్ముండు, తేనీంగె, అచ్చెడికాండు, కావలికాండు, తుడిచ్చాండు, చెవిడాండు, ఆండుబుడ్డ (ఆడబిడ్డ), ఆండత్తె (ఆడమనిషి) ఏనుంగ, పీనుంగ, ఏనిక్కాండు, మగవాండు, వాంగ, వేండు, అంబు, నరెంబు, నోంబు దాంగు, కాంగు, మూండు, అందు, ఇంచు మొదలైనవి.

2. 4. నేటి తెలుగులో నిమ్నజాతుల భాషలో 'ణ, ళ'లు న, ల లగా ఉచ్చరిస్తారు. అంటే వీరి భాషలో ణ, ళలు వర్ణాలు కావు. కాని పద మధ్యలో ద్విత్వ ళ్ళ, ణ్ణలు కొంచం మూర్ధన్య లక్షణాన్ని కలిగి ఉన్నాయి. కాని చెట్టియార్ల మాండలికంలో ణ, ళ ధ్వనులు ణ, ళలగానే ఉన్నాయి.

## 3. పదాలు:

ఈ మాండలికంలోని పదాల్ని రెండు విధాలగా విభజించ వచ్చును. 1. విభక్తి ప్రత్యయాలు, క్రియాప్రత్యయాలు తీసు కోడానికి అర్హతకలవి. 2. విభక్తి ప్రత్యయాలు, క్రియా ప్రత్య యాలు తీసుకోడానికి అర్హతలేనివి. విభక్తి ప్రత్యయాల్ని తీసుకునే పదాల్ని రెండు రకాలుగా చెప్పుకోవచ్చును.

1. నామవాచకాలు: నామవాచకాలు బహువచన ప్రత్యయం, విభక్తి ప్రత్యయాల్ని తీసుకొనే అర్హత కలవి. 2. క్రియలు, క్రియాప్రత్యయాలు తీసుకొనే అర్హత కలవి. సర్వనామాలు, సంఖ్యా వాచకాలుకూడ నామవాచకాలే.

### 3. 1. నామవాచకాలు:

బహువచన ప్రత్యయానికి నాలుగు రూపాలున్నాయి.

1. 'ఇ'తో అంతమయ్యే మాటలతో 'లి' 2. కొండుతో అంతమైన మాటలతో 'గళు' 3. ణ్ను, ట్టుతో అంతమైన మాటలతో ళు 4. మిగతాచోట్ల లు వ్యాప్తి పొంది ఉన్నాయి. లి, ళు పర్యాయ రూపాల ముందు ఆ యీ నామవాచకాల చివరి అక్షరం లోపిస్తుంది.

పిల్లి–పిల్లిలి, కిళి–కిళిలి (చిలక), పాల్కాండు (పాలవాడు) –పాల్కాంగళు, కణ్ణు–కణ్ణు, మొట్టు–మొట్లు, వీడె–వీడెలు ఉత్తమ పురుష సర్వ నామాంతము ము, ప్రథమ ద్వితీయ పురుష సర్వనామాంతము రు బహువచన ప్రత్యయంగా పరిగణించవచ్చును. కాని ఇది ఎక్కువ మాటలకు చేరేటటువంటిది గాలేదు. గళు–అన్న ప్రత్యయం ద్విభాషీయత వల్లవచ్చి ఉండవచ్చును. నపుంసకలింగం తెలిపే మాటల్లో బహువచన ప్రత్యయం వికల్పంగా వస్తుంది.

రెండు పేనావు (రెండు పెన్నులు)

మూండు పుస్తకం (మూడు పుస్తకాలు)

పేనావు లోని చివరి వు ఏకవచనంలో కూడా ఉంటుంది. ఇంగ్లీషుమాట్లైన పెన్ను అనే పదానికి పేనావు అని మలయాళంలో వాడుక.

## 3. 2. విభక్తి ప్రత్యయాలు :

నామవాచకాలు నాలుగు విభక్తిప్రత్యయాల్ని కలిగిఉంటాయి. ద్వితీయ, చతుర్థి, పంచమి, సప్తమి: ఇవి వరసగా ఆంగ్లంలో ఎక్యూజెటివ్, డేటివ్, జెనిటివ్, లొకేటివ్ (Accusative, Dative, Genitive, Locative) అని పిలుస్తారు.

మనం సంస్కృతంలో నుంచి ప్రథమ, ద్వితీయ, తృతీయ అనే పరి భాషను వాడుకోవడంవల్ల తెలుగులో 7+1 (8) విభక్తులు ఉన్నాయనే అనుకొంటున్నాము. కాని విభక్తి విభక్తి ప్రత్యయాలని చెప్పకోదగ్గవి నాలుగు ఉన్నాయి. మనం మాట్లాడే ఇప్పటి తెలుగులో కూడా యింతే.

తిరువనంతపురం మాండలికంలో ద్వితీయ విభక్తికి మూడు పర్యాయ రూపాలున్నాయి. 1. త్త – అనేది మనుష్య వాచకాలు కాకుండ మిగతా అన్ని నామ వాచకాలతోను 2. ఎ అనేది – ండు అంత మందు ఉండే మనుష్య నామ వాచకాలతోను 3. న అనేది మిగతా మనుష్య వాచకాలతోను వ్యాప్తిపొంది ఉన్నాయి. డుమంతాల చివరి ండు లోపిస్తుంది.

తల – తలత్త (తలను)
వాండు – వానె (వాణ్ణి)
పాల్కాండు – పాల్కానె (పాలవాణ్ణ)
గోపి – గోపిన (గోపీని)

ఈ మాండలికంలో ద్వితీయా విభక్తి వ్యాప్తి అర్థాన్నిబట్టి ఉంది. ఇటువంటి వ్యాప్తి తెలుగులో కాని యితర ద్రావిడభాషల్లో కాని గుర్తించబడలేదు. నేటి తెలుగులో ప్రాణి వాచకాలతో తప్ప మిగతా నామవాచకాల్లో ద్వితీయావిభక్తి వికల్పం.

చతుర్థి : విభక్తికి రెండు పర్యాయరూపాలున్నాయి.

1. క్కి అనేది, ఇ తో అంతమయ్యే నామవాచకాలతోను,
2. – క్కు అనేది మిగతా చోట్ల వ్యాప్తిపొంది ఉన్నాయి.

ఉదా. పిల్లిక్కి (పిల్లికి)
పడముక్కు (పటానికి).

మలయాళంలో పటం అను మాటకి సినిమా అనే అర్థం కూడా ఉంది.

షష్ఠి :– షష్ఠికి ఒకే పర్యాయ రూపం ఉంది. ఇ–అనే యీ ప్రత్యయం రు తో అంతమయి మనుష్య వాచకాల్ని తెలిపే నామ వాచకాలకు చేరుతుంది. మిగతా అన్నిచోట్ల ప్రత్యేకించి ప్రత్యయం ఏమీ లేదు.

వారు – వారి

సప్తమి :– సప్తమికి రెండు పర్యాయ రూపాలున్నాయి.

1. – అ అనేది ండు తో అంతమయ్యే మనుష్య నామవాచకాలతోను 2. న అనేది మిగతాచోట్ల వ్యాప్తి పొంది ఉన్నాయి. నేటి తెలుగులో తేదీన, రోజున, అడుగున మొదలైనవాట్లో మనకి న ప్రత్యయం కనబడుతుంది. అలాగే నాయకత్వాన, అధ్యక్షతన మొదలైన ము తో అంతమైన పదాల్లో సప్తమీ ప్రత్యయంగా ఉంది.

పాల్కాన, తాడిన, గాలిన, పుస్తకమున మొదలైనవి.

అనుబంధమైన (Past–Position) లోన అనేది లోపల అనే అర్థంలో ఈ మాండలికంలో ఉపయోగంలో ఉంది.

ఇటిక్కిలోన

జిల్లావుక్కులోన

తృతీయ మొదలైన మరికొన్ని విభక్తులు - చేతన, పొట్టి, ఉండి అనే మొదలైన అనుబంధాల్ని నామవాచకాలకు చేర్చడంవల్ల ఆ యా అర్థాలు ఉత్పత్తి అవుతాయి.

గాలిచేతన (గాలిచేత)

పేనాపొట్టి (పెన్నుతో)

మానుఉండి (మాను నుండి)

మద్రాసు ఉండి (మద్రాసు నుండి)

నుండి అనే అనుబంధంలో మొదటి న కారం లోపించింది. నేటి తెలుగులో కూడ మీదచెప్పిన ఈ నాలుగు విభక్తులుమాత్రమే ఉన్నాయి. మిగతా విభక్తులుచేత, తోడ, నుండి, నుంచి మొదలైన అనుబంధాల వల్ల మాత్రమే సూచింపబడతాయి.

## 3. 3. సర్వనామాలు:

నేటి తెలుగులో గౌరవాన్ని సూచించడానికి ఉపయోగించే వారు, అతను, ఆయన మొదలైన సర్వనామాలు యీమాండలికంలో లేకపోవడం విశేషం. అంటే ఆయన, వారు, గారు మొదలైన పదాలు సామాజిక వ్యవస్థ ననుసరించి యీమధ్య అభివృద్ధి అయినవే అని చెప్పకోవచ్చును. ఈ మాండలికంలో యీ క్రింది నిర్దిష్టన సర్వనామాలున్నాయి:

| | ఏకవచనం | బహువచనం |
|---|---|---|
| ఉత్తమ | నాను (నేను) | మనము |
| | | మాము (మేము) |
| మధ్యమ | నీవు | మీరు |
| ప్రథమ | వాండు (వాడు) | వారు |
| | అది | అదివి |
| | ఇది | ఇదివి |

అది, ఇది అనే సర్వనామాలకు-అదివి, ఇదివి అనే రూపాలు ఉన్నాయి. అవి, ఇవి రూపాలు ఉన్నట్లు కనపడదు. ఈ సర్వనామాల్లో ఉత్తమ, ప్రథమ పురుష సర్వనామాల చివరి ను, ము, వు, రు, లు లోపించి చతుర్థీ విభక్తిలో రూపాలు యీ క్రింది విధంగా ఉంటాయి:

నక్కు (నాకు) మక్కు (మాకు) మనక్కు (మనకి) నిక్కు (నీకు) మిక్కు (మీకు).

ద్వితీయ, సప్తమి విభక్తి ప్రత్యయాల ముందు యీ క్రింది విధాలైన రూపాలుంటాయి :

| | |
|---|---|
| నాను | నన్ |
| మనము | మనిలి |
| మాము | మమ్మిలి |
| వాండు | వాన్ |
| వీండు | వీన్ |
| అది | దాన్ |
| ఇది | దీన్ |

**3. 4. సంఖ్యా వాచకాలు :-**

ఈ క్రింది యివ్వబడినవి సంఖ్యా వాచకాలు

ఒకటి, రెండు, మూండు, నాలు, అయిదు, ఆరు, ఏడు, ఎనిమిది, తొమ్మిది, పది, నూరు, వే, లెచ్చము.

11 నుంచి 20 వరకు యివి —

పదకొండు, పంద్రెండు, పదిమూండు, పదినాలు, పదారు, పదేడు, పదినెనిమిది, పందొమ్మిది.

20 నుంచి 100.

ఇరువె, ముప్పె, నలిపె, ఏంబె, అరివె, ఎళివె, ఎవంబె, తొంబె.

ఆర్డినల్స్‌గా సంఖ్యా వాచకాలు ఉపయోగించేటప్పుడు — ఆవ — అనే ప్రత్యయం చేరుతుంది. నేటి తెలుగులో యీ ప్రత్యయం ఓ —

రెండావదు (రెండోది)
మూండావదు (మూడోది)

### 3. 5. క్రియారూపాలు :

ఈ పరిశీలన కోసం సేకరించిన విషయంలో యీ క్రింది మూడు ప్రత్యయాలు మాత్రమే సకర్మక క్రియా ప్రత్యయాలుగా గుర్తించబడ్డాయి.

| | | | | |
|---|---|---|---|---|
| చీలు | — | చీల్చు | = | చు |
| కాలు | — | కాల్చు | = | చు |
| చూయి | — | చూపు | = | పు |
| వచ్చు | — | చవ్వు | = | వ్వు |

## ప్రేరణార్థక ప్రత్యయం :

ఇప్పిచ్చే అనే ఒక్క ప్రత్యయ రూపం మాత్రమే ప్రేరణార్థక ప్రత్యయ రూపంగా గుర్తించబడింది. యీ మాండలికంలో ఇదే ప్రత్యయం ప్రేరణార్థకాన్ని తెలియజేసేది మలయాళంలోకూడ ఉంది. అందువల్ల మలయాళ ప్రభావంవల్ల ఇంచు అనేది ప్రేరణ క్రియ 'ఇప్పిచ్చుగా' మారి ఉండవచ్చును. నేటి తెలుగులో ''ప్రేరణార్థక'' ప్రత్యయానికి ఇంచు, ఇపించు, ప్పించు, రించు, గించు, అనే అయిదు పర్యాయ రూపాలున్నాయి.

క్రియా రూపాల్ని రెండు వర్గాలుగా విభజించవచ్చును.

1. సమాపక క్రియలు
2. అసమాపక క్రియలు

## సమాపక క్రియలు :

విధ్యర్థకం : విధ్యర్థకాన్ని సూచిస్తూ రెండు పర్యాయ రూపాలున్నాయి.

ఇ అనేది యి తో అంతమయ్యే క్రియలతోను
ఉ అనేది మిగతాచోట్ల వ్యాప్తి పొంది ఉంది.
చూయి (నువ్వు చూడు) ఊయి
పాడు (నువ్వు పాడు) తిన్ను

విధ్యర్థక రూపాల చివర నపుంసకలింగంలో సాధారణ వాచిగా రా అనేది గౌరవ వాచిగాను, బహువచనంలోను ఇండ అనేది వాడుకలలో కనిపించాయి.

చిలుక్కూరా (నువ్వు చిలుకరా)
చిలుక్కిండ (మీరు చిలకండి)

కాలవాచి : ఈ మాండలికంలో రెండు కాలాల్ని మాత్రం సూచించే క్రియా రూపాలున్నాయి. 1. అభూతకాలం 2. భూతకాలం. ఈ రూపాల చివర సర్వనామ ప్రత్యయాలున్నాయి. కాని మలయాళ ప్రభావంవల్ల కొన్నిట్లో సర్వనామ ప్రత్యయాలు లోపించడం కద్దు. ప్రాచీన తెలుగులో లాగానే ప్రథమ పురుషలో లింగ వివక్షత లేదు. నేటి తెలుగులో ప్రథమ పురుషలో లింగ వివక్షత ఉంది.

అభూత కాలం : (Non-Past or Present future) దీన్ని సూచించే రెండు ప్రత్యయాలున్నాయి.

1. త్తు అనేది అచ్చుతో అంతమయ్యే క్రియాప్రాతిపదికల ముందు

2. ఉతు అనేది మిగతాచోట్ల వ్యాప్తిపొంది ఉన్నాయి.

వత్తు — వత్తును
దాటుతు — దాటుదును

భూతకాలం : భూతకాలాన్ని సూచించేవి 4 పర్యాయ రూపాలు.

1. ఎ అనేది ప్రథమపురుష - నపుంసక—స్త్రీలింగాలలోను,
2. ఇక అనేది క్రియాజన్య విశేషణాలలోను
3. త్తి అనేది అజంతాలయిన క్రియా ప్రాతిపదికలతోను
4. ఇతి అనేది మిగతాచోట్ల వ్యాప్తి పొంది ఉంది.

| | |
|---|---|
| ధాటె | (దాటెను) దాటాడు, దాటింది, దాటాయి |
| దాట్ – ఇన్ + ఇ | (దాటిన) |
| మోత్తె | (మోశాను) |
| దాట్ – ఇతి + మి | (దాటాము) |

## వ్యతిరేక అభూతం :

దీనికి రెండు రూపాలున్నాయి. తల అనేది అన తో అంతమయ్యే రూపాల ముందు, దు అనేది ఆ తో అంతమయ్యే రూపాల ముందు వస్తాయి.

| | |
|---|---|
| నూరందల | (నూరాను) |
| నూరదు | (ఆమె, అది, నూరుదు) |
| నూరందలము | (మేము నూరము) |

వ్యతిరేక భూతకాలం : వ్యతిరేక భూతకాలాన్ని సూచిస్తూ రెండు పర్యాయరూపాలున్నాయి. అరె ఏకాచ్కాలతో తప్ప అచ్చుతో అంతమయ్యే అన్ని క్రియల ముందు, రె అనేది మిగతాచోట్ల వ్యాప్తి పొంది ఉన్నాయి.

| | |
|---|---|
| తోలరె | (తోలలేదు) |
| నంబరె | (నమ్మలేదు) |

గుమకరె (దూకలేదు)
పోరె (పోలేదు)

ఉభయ ప్రార్థన్ని **సూచిస్తూ** 'తు—ము' అను ప్రత్యయం వాడబడుతుంది. ఇందులోని చివరి ము సర్వనామ ప్రత్యయం.

చే - తు - ము (చేద్దాం)
పో - తు - ము (పోదాం)

అనుజ్ఞార్థకం **సూచిస్తూ** వాడబడే ప్రత్యయం ఈ. ఇది అన్నంత రూపం తర్వాత వస్తుంది.

చిలుకనీ (చిలకనీ)

నిశ్చయార్థకాన్ని సూచిస్తూ వాడబడే రెండు పర్యాయ రూపాలున్నాయి. ఆల/ఆలె—ఈ రెండు పర్యాయ రూపాలు స్వేచ్ఛగా వాడబడే పర్యాయ రూపాలు.

నగాల/నగాలె (నవ్వాలి)
నీంజాల/నీంజాలె (ఈదాలి)
చోరండాల / చోరండాలె (గోకాలి)

వ్యతిరేక విధ్యర్థకం : వ్యతిరేక విధ్యర్థకాన్ని సూచించడానికి రెండు రూపాలున్నాయి. 1. క అనేది ఏకాచ్కాలైన ప్రాతిపదికల ముందు, ఆక అనేది మిగతాచోట్ల వ్యాప్తిలో ఉన్నాయి.

ఎళుదాక (రాయకు)
ఎణ్ణాక (ఎన్నకు)
తూకాక (తూచకు)
పోక (వెళ్ళకు)

## అసమాపక క్రియలు :

అన్నంతరూపం : అన్నంత రూపాన్ని సూచిస్తూ మూడు పర్యాయ రూపాలు వ్యాప్తి పొంది ఉన్నాయి. 1. అకు అనేది న, ల లతో ప్రారంభమయ్యే పదాలముందు 2. అన్ అనేది అచ్చులు, కగలతో ప్రారంభమయ్యే పదాలముందు 3. అ మిగతాచోట్ల వస్తుంది.

చిలకం బెయ్యే (చిలకబోయాడు)
పాడం బెయ్యే (పాడబోయాడు)
చెయ్యావచ్చు (చెయ్యవచ్చు)
పాడనీ (పాడనీ)

## క్త్వార్థకం

దీన్ని సూచించే ప్రత్యయం ఇ

ఆడి గీచి
చేసి కుర్చి కుట్టి

## వ్యతిరేకక్త్వార్థకం

దీన్ని సూచించే ప్రత్యయం - అక్క
చీల్చక్క (చీల్చక)
తిరంగక్క (తిరగక)
అనుప్పక్క (పంపక)

## క్రియావిశేషణాలు

అభూత కాలికాన్ని **సూచించే** ప్రత్యయం - ఏ

నడవే బుడ్డ = నడిచే బిడ్డ
వచ్చే మాయి = దంచే మనిషి
వచ్చే అచ్చోడి కొందు = వచ్చే క్రిందటరు

భూతకాలికాన్ని సూచించే ప్రత్యయం—ఇ. ఇది ఇక అనే భూతకాల ప్రత్యయం తర్వాత వస్తుంది.

పచ్చిన (పేరిన)
దగ్గిన (దగ్గిన)
పిగిన (పిగిన)

## వ్యతిరేక క్రియావిశేషణం

దీన్ని సూచించే ప్రత్యయం ఇ. ఇది అన్ అనే వ్యతిరేకార్థక ప్రత్యయం తర్వాత వస్తుంది.

నడయని (నడవని)

చేత్వర్థకాన్ని సూచిస్తూ రెండు పర్యాయ **రూపాలున్నాయి.**

1. తే అనేది ఏకాచ్చుల ముందు
2. ఇ తే అనేది మిగతాచోట్ల వ్యాప్తిపొంది ఉన్నాయి.

దుమికితే (దుమికితే)
పోతే

## 3. 6. సర్వనామ ప్రత్యయాలు

ఈ క్రిందివి సర్వనామ ప్రత్యయాలు

| తిరువనంతపురం తెలుగు | | | నేటి తెలుగు | |
|---|---|---|---|---|
| | ఏకవచనం | బహువచనం | ఏకవచనం | బహువచనం |
| ఉత్తమ | — | మి/ము | ను | ము |
| మధ్యమ | వి/వు | రి/రు | వు | రు |
| ప్రథమ | — | పుం. రి/రు | పుం. డు | పుం. రు |
| | పు. న. స్త్రీ | | స్త్రీ. న ది/దు | స్త్రీ. న వి/వు |

పైనిచ్చిన సర్వనామ ప్రత్యయాలు చూస్తే తిరువనంతపురం మాండలికంలో ఉత్తమ, ప్రథమ పురుషలలో ఏకవచన ప్రత్యయాలు గమనించబడలేదు. (మరికొంత విషయ సేకరణ జరిగితే గాని వాటి ఉనికిని గురించి ఖచ్చితంగా చెప్పలేం) కొన్ని ప్రత్యయాలు ఇ అంతంగా కలవి, కొన్ని ఉ అంతంగా కలవి. ప్రాచీన తెలుగులో ఇటువంటి ప్రత్యయాలు ఉండడమే కద్దు. కాని ప్రాచీన తెలుగులో ఉత్తమ పురుషలో వికల్పంగా ని అనే ప్రత్యయం, ప్రథమలో ను ప్రత్యయాలుగా ఉండడం కద్దు. ఈ మాండలికంలో యివి గుర్తింపబడలేదు.

### 3.7 అర్థక ప్రత్యయాలు

## సముచ్చయార్థక ప్రత్యయం

ను అనేది సముచ్చయార్థక ప్రత్యయంగా ఈ మాండలికంలో ఉంది.

ఎయ్యను ఎవ్వను పైరి (నాన్న అమ్మ వెళ్ళారు)

గోపియును వేణువును వచ్చిరి (గోపీ, వేణు వచ్చారు)

నేటి తెలుగులో సంఖ్యా వాచకాల్లో తప్ప సముచ్చయార్థకం వాడుక చాల అరుదు.

రెండున్నర

మూడుంబావు

## ప్రశ్నార్థకము :

'ఆ' అనేది ప్రశ్నార్థక సూచి.

రాముడా కృష్ణుడా అందు పెయింది

(రాముడా కృష్ణుడా అక్కడికి వెళ్ళినది)

పండు తిన్నది కోతియా? (పండుతిన్నది కోతా?)

## అనిశ్చయార్థకము

'ఓ' అనేది అనిశ్చయార్థక సూచి.

గోపియో వేణువో వత్తురు

## ఏవార్థకం

ఏ అనేది నిశ్చయార్థకము

గోపియే వచ్చెను (గోపీ వచ్చాడు)

ఈ మాండలికంలో ఉ తో అంతమయ్యే నామవాచకాల్లో వ, ఇ తో అంతమయ్యే నామవాచకాల్లో యి, సంధిలో ఆగమాలుగా వస్తాయి. నేటి తెలుగులో కొన్నిచోట్ల యిటువంటి ఆగమం సాధ్యం కాదు. కాని ప్రాచీన తెలుగులో సాధ్యమే.

## 4. బాంధవ్య బోధక పదజాలం :

ఈ మాండలికంలో వాడబడే బాంధవ్య బోధక పదజాలంలోని మాటలు

కొడుకు, కూతురు, ఎయ్య (అయ్య), ఎవ్వ (అవ్వ) చినియ (చిన్నాన్న), బెద్దియ (పెదనాన్న), తమ్ముండు, తంగ (చెల్లి) మాప్పె (వీరకాడు) బావ, మామ, పిన్నవ (పిన్నమ్మ) బెద్దవ (పెద్దమ్మ), అన్న, అమ్మ, కోడలు, అల్లుండు, మరదండ్లు (మరదళ్ళు), వదిన, తాత (నాన్నతమ్ముడు), మూత్త (అమ్మమ్మ), మనుమకూతురు (మనవరాలు) మనుమకొడుకు (మనవడు)

## 5. కొన్ని సామ్యాలు :

ఈ మాండలికంలో ఉన్న కొన్ని లక్షణాలు యిటు నేటి తెలుగుతోను అటు ప్రాచీన తెలుగుతోనే చూపే సాదృశ్యాలు కొన్ని

| ప్రాచీన తెలుగు | పెద్ద జాతులు మాట్లాడే నేటి తెలుగు | నిమ్న జాతులు మాట్లాడే నేటి తెలుగు |
|---|---|---|
| 1. ధ్వనులు | | |
| 1. డు మంతాల ముందు పూర్ణానుస్వారం, ంబు ంపు | 1. పదం మొదటి ఇకారం<br>2. ణ, ళ లు వర్ణాలు | మహా ప్రాణాల లోపం.<br>ష, శ, స ల మధ్య వ్యత్యాసం లేదు. |

| ప్రాచీన తెలుగు | పెద్ద జాతులు మాట్లాడే నేటి తెలుగు | నిమ్న జాతులు మాట్లాడే నేటి తెలుగు |
|---|---|---|
| 2. పదాల : | | |
| 1. భూతకాల ప్రత్యయం ఇతి | 1. వ్యతిరేక విధ్యర్థకంలోని ఆక | 1. నిశ్చయార్థక ప్రత్యయం — ఆల / ఆలె |
| 2. అభూతకాల ప్రత్యయం ఉతు | 2. క్రియాజన్య విశేషణం — ఏ | 2. భూతకాలిక క్రియా జన్య విశేషణం ఇ |
| 3. సర్వనామ ప్రత్యయాలు | | 3. తుము — ఉభయ ప్రార్థనంగా ఉపయోగపడడం |
| 4. సముచ్చయార్థకం | | 4. ఉత్తమ పురుష సర్వనామం—నాను |
| 5. ఆగమాలగా వ, య లు | | |

## 6. క్రియా నిష్పత్తి : [ఒక ఉదాహరణ]

నూరు [నూరు]

**సమాపక క్రియలు**

| | | అభూతకాలం | భూతకాలం | వ్యతిరేక అభూతకాలం |
|---|---|---|---|---|
| ఉత్తమ | ఏ. | నూరుతు | నూరితి | నూరందల |
| | బ. | నూరుతుము | నూరితిమి | నూరందలము |
| మధ్యమ | ఏ. | నూరుతువు | నూరితివి | నూరందలవు |
| | బ. | నూరుతురు | నూరిరి | నూరందలరు |
| ప్రథమ | ఏ. పుం. స్త్రీ. న | నూరు | నూరె | నూరందలవు |
| | పుం. స్త్రీ. | నూరుతురు | నూరిరి | నూరందలరు |
| | బ. న. | నూరు | నూరె | నూరదు |

| | |
|---|---|
| వ్యతిరేకం. | నూరరె (అన్ని పురుషలలోను) |
| విధ్యర్థకం | నూరు |
| వ్యతి. ఏ | నూరకురా |
| బ | నూరక్కిండ |
| ఉభయ ప్రార్థనార్థకం | నూరుతుము |
| అనుజ్ఞార్థకం | **నూరనీ** |
| నిశ్చయార్థకం | నూరాల/నూరాలె |

**అసమాపక క్రియలు**

| | | |
|---|---|---|
| క్త్వార్థకం | : | నూరి |
| వ్యతిరేక క్త్వార్థకం | : | నూరికినే |

**క్రియాజన్య విశేషణాలు**

| | | |
|---|---|---|
| భూతకాలికం | : | నూరిని |
| అభూత కాలికం | : | నూరే |
| వ్యతిరేకం | | నూరని |
| హేత్వర్థకం | | నూరితె |

## 7. కొన్ని క్రియా ప్రాతిపదికలు :

అడుగు, అలంమ (తిరుగు), ఆడు, చోరందు (గోడ), చుత్తు (చుట్టు), దచ్చు (కాళ్ళతో తన్ను), దద్దు (పేలు), అలిచ్చు (కరగించు), అనుప్పు (అనుపు), చెదరు, చోరింజు (పాలు తీయు), దా (రా), దచ్చు (దంచు), దగ్గు, దాంగు (దాగు), దోచ్చు, దూయె (దూయు), ఎక్కు, ఎత్తు, గుముక్కు (దుముకు), ఈయు, కడుకు (కడుగు), కలందు (వదలగు), కప్పు, కాలు, కరు, కట్టు, కొడి (నీరుకాయు), కొట్టు (కోయు), కులిక్కు (కదుపు), కుట్టు, లాందు (ఊదు), మెదువు (మెత్తు), మొక్కు, మోయు, ముక్కు, ముంగు, ముత్తు, నగు (నవ్వు), నరుకు, నచ్చు, నేరిచ్చు, (నేర్చు), నిండు, నొళ్ళె (అరుచు), పరప్పు (పరచు), పత్తె (సంతోషించు), పెళందు (చిట్లు), పిడుంగ (ఊడదీయు), పుడిచ్చు (పిడుచు), రాలు, తడుప్పు (తడపు), తాలుచ్చు (నేయు), తవుచ్చు (నిలబడు), తిట్టు, తోలు, దేవు (దొంగిలించు), దూరు, ఏడిచ్చు (ఏడ్చు), ఎణ్ణు (లెక్కపెట్టు), గీచ్చు (గీయు), ఈడిచ్చు (ఈడ్చు), ఇరుక్కు (ఇరుకు) కక్కు, కను, కాచ్చు (కాయు), కాల్చు, కసుకు (రాయు), కాంకు (మరగ చెట్టు), కొరుకు, కులింగు, కుందు (కూర్చొను), కూయు, మారు, మెగంము (తేల), మేమ్ (మేము) ముచ్చు (ముంచు), ముణంగు (గొణుగు), ముంగు (మింగు), నడచ్చు (నడుచు), నములు, నాటు, నక్కు (నాకు), నేయు, నీంజు (ఈదు), ఒప్పు. పదరు (చెదురు), పట్టు (పట్టుకొను) పెరుగు, పీచ్చు (పాలు తీయు), పూయు, రేయు, (లేచు), తకచ్చు (తీయు), తాగు, తెచ్చు, తొక్కు, తుమ్ము, తుళ్ళు, తూక్కు (తూకముచేయు), ఊరు, వాడు, వెచ్చు (వేపు) తువత్తు (మెరుగుపెట్టు), ఉరించు (పీల్చు), వలంజె (వంచు) వడిచ్చు (వడకట్టు) విరిచ్చు (విరబోయు).

## 8. వ్యవహర్తలు :

1969–'70 కేరళ యూనివర్సిటీ భాషాశాస్త్రానికి సంబంధించిన ఫైనల్ ఎమ్.ఏ విద్యార్థులు ఫీల్డువర్కుల సిద్ధాంత వ్యాసాల కోసం యీ విషయం గురించి పరిశోధన జరిపారు. 1970 వేసవిలో ఈ వ్యాస రచయిత మళ్ళీ మరోసారి విషయసేకరణ చేశారు. ఈ పరిశోధనకు సహాయకారులుగా ముగ్గురు తెలుగు వ్యవహర్తలు ఉపయోగింపబడ్డారు.

1. శ్రీరామయ్య చెట్టియార్. వయసు –45. 4వ తరగతి వరకు తమిళమధ్యమంలో చదువుకున్నాడు. తెలుగుతోపాటు మలయాళం, తమిళం, కన్నడ, తుళు, హిందీ, అరబిక్ భాషలు మాట్లాడగలడు- బొమ్మలు తయారుచేసి రంగువేసి అమ్మడం ప్రధానవృత్తి.

2. శ్రీ ఇసక్కి చెట్టియార్ : వయస్సు - 50, తమిళ, మలయాళాలు కూడ మాట్లాడగలడు. వర్తకం యీతని వృత్తి.

3. మాడస్వామి చెట్టియార్ : వయస్సు- 55. తమిళ, మలయాళాలు మాట్లాడగలడు. బియ్యం అమ్మడం యితని వృత్తి.

## 9. రిఫెరెన్సులు :


1 ఏంద్రి. ఎఫ్. సోబెర్గ్ : సప్తమికి తెలుగులో సాక్ష్యం ద్రవిడియన్–సెమినార్ పేపర్స్ (1968), భాషాశాస్త్ర శాఖ, అన్నామలై విశ్వవిద్యాలయం.

2 కె. మహదేవశాస్త్రి : తెలుగు చారిత్రాత్మక వ్యాకరణం, వెంకటేశ్వర విశ్వవిద్యాలయ–పోస్టుగ్రాడ్యుయేట్ సెంటర్, అనంతపురం (డి. లిట్ సిద్ధాంతవ్యాసం, కలకత్తా యూనివర్సిటీ.

3 యన్. శివరామమూర్తి : శ్రీకాకుళం జిల్లా భాష–కొన్ని ధ్వని మార్పులు–1968 (డైలెక్ట్ బుల్లెటిన్–డక్కను కళాశాల–పూనా. సంపాదకులు: డా. డి.యన్.యస్ భట్.

డాక్టర్ బి. ఆర్. కె. రావు

# మాక్స్ వెబర్ ఆర్థిక ఆలోచన

చారిత్రకాధ్యయన పీఠంలో స్కోమెల్లర్, సోంబర్ట్‌లవలె మాక్స్ వెబర్ గొప్ప ఆలోచకుడు. అయితే సోంబర్ట్ కంటె ఉదార వాది. ఫ్రెయిబర్గ్, హైడెల్‌బర్గ్, మ్యూనిచ్ మొదలైన ఏడు విశ్వవిద్యాలయాలలో ప్రొఫెసర్‌గా పనిచేసాడు. అర్థశాస్త్ర సంబంధమైన అనేక గ్రంథాలు వ్రాసినా ఈయన్ను ఆర్థిక శాస్త్రవేత్తల జాబితాలో కాక ఆర్థిక సాంఘికశాస్త్రవేత్తల(Economic Sociologists) జాబితాలో వేసారు. లోకులు అనేక రకాలుగా చెబుతారు. అయినా వెబర్ ఆర్థిక ఆలోచనలో గొప్పవాడే. ఇతడు జాతీయ వాది. వ్యక్తి స్వేచ్ఛకావాలని గట్టిగా కోరాడు. జాతి తత్వము తప్పు విధానమని తిరస్కరించాడు. వెబర్ 1864లో జన్మించాడు 1920లో మరణించాడు. అతని ముఖ్యరచనలు: (1) రోమన్ అగ్రేరియన్ హిస్టరీ (1891) (2) ప్రొటెస్టెంట్ ఎథిక్ అండ్ ది స్పిరిట్ ఆఫ్ కేపిటలిజం (1904, పునర్ముద్రితం 1958) (3) జెనరల్ ఎకనామిక్ హిస్టరీ (1923) (4) ది మెథడాలజి ఆఫ్ సోషల్ సైన్సెస్ (1949). ఇప్పుడతని ఆర్థిక ఆలోచనను చూద్దాము.

## అధ్యయన పద్ధతి:

చారిత్రక సమస్యల అధ్యయనంలో వెబర్ సోంబర్ట్ కంటె జాగ్రత్తగా పనిచేసాడు. అధ్యయన పద్ధతి విషయాల్లో శ్రద్ధ వహించాడు. కాబట్టి పాత చారిత్రక పీఠంవారి ముందుగానే అభిప్రాయాలనేర్పర్చుకునే పద్ధతిని నిరసించాడు. యదార్థాలకు సంబంధించిన దత్తాంశాలను (Data) హెచ్చు అర్థవంతం చేయడానికి పదునుగల భావనల చట్రాన్ని ఏర్పర్చడానికి ప్రయత్నించాడు. చారిత్రక పీఠం ఆర్థిక శాస్త్రవేత్తల అధ్యయన పద్ధతిని సహేతుక రాహిత్యమని ఎంచినందువల్ల దాన్ని తిరస్కరించాడు. ఒక చారిత్రక పరిస్థితి ప్రత్యేక లక్షణాలను (అసమాన లక్షణాలను) తెలిసికొనేందుకు ముఖ్య సాధనంగా (Tool) ఉపయోగపడేందుకు ఆదర్శ అధ్యయన పద్ధతిని (Ideal Type) సూచించాడు. ఆదర్శ పద్ధతిలో యదార్థతను గమనించడం ముఖ్యవిషయము. ఈవిధానం చారిత్రక దత్తాంశాలను సాపేక్షికంగా వివరిస్తుంది.

## పెట్టుబడిదారీ విధానానికి మూలము:

వెబర్ తన "ప్రొటెస్టెంట్ ఎథిక్ అండ్ ది స్పిరిట్ ఆఫ్ కేపిటలిజం"లో పెట్టుబడిదారీ విధానం పుట్టుక మూలాలను వివరించాడు. పెట్టుబడిదారీఉద్దేశ్యం ఉత్సాహం ప్రబలేటట్లు చేయడంలో మతం నిర్వహించిన పాత్రను విశ్లేషిస్తూ, కేథలిక్ చర్చి పెత్తందారీ తనం క్రింద పెట్టుబడిదారీ విధానం పెరగి లేదని చెప్పాడు. కాల్వినిస్టులకు మాత్రమే తమ లాభాలను తిరిగి పెట్టుబడిగా మార్చడం తెలుసు. వారి ఈ ప్రవర్తన మూలధన సంచయానికి త్రోవ తీసింది. కాల్వినిస్టుల్లో ప్రధానంగా అవసరమైన సహేతుక ప్రవర్తన, విరామంలేకుండా శ్రమ చేసే వైఖరి, ఖచ్చితంగా అకౌంటులను నిర్వహించే శక్తి ఉండటంవల్లనే పెట్టుబడిదారీ విధానం ప్రబలడానికి తోడ్పడగల్గారు.

## పెట్టుబడిదారీ విధానం చేసిన మంచి పని:-

మార్కెట్టును బాగా ఉపయోగించుకుని లాభాలు పొందడానికి పెట్టుబడిదారీ విధానం సంఘటిత ఉద్యమాన్ని నిర్వహిస్తుంది. పెట్టుబడిదారీ వ్యవస్థ వ్రేళ్ళు నాటుకున్నప్పటి నుండి, లాభాలు పొందే ఉద్దేశ్యంతో తన కార్యక్రమాలనునిర్వహిస్తూనే ఉంటుంది. పశ్చిమ ప్రపంచంలో సమాజాన్నంతటిని సంఘటిత పర్చడంలో పెట్టుబడిదారీ విధానం ఒక్కటి మాత్రమే విజయవంతమయ్యింది. "మార్క్స్ వర్గ పోరాటంలో శ్రద్ధ తీసుకుని అధ్యయనంచేస్తే, వెబర్ జాతీయ బూర్జువా పెట్టుబడిదారీ విధానంలోని అతి ముఖ్య సమస్యలో శ్రద్ధ వహించి అధ్యయనం చేసాడు" అని పి. సి. న్యూమన్ "ది డెవలప్‌మెంట్ ఆఫ్ ఎకనామిక్ థాట్" (పే.205)లో వ్రాసాడు.

## పెట్టుబడిదారీ విధానం రకాలు:

వెబర్ పెట్టుబడిదారీ విధానాన్ని (1) పొలిటికల్ కేపిటలిజం (2) పెరైయ్ కేపిటలిజం (PariahCapitalism) (3) ఇంపీరియలిస్టు కేపిటలిజం (4) ఫిస్కల్ కేపిటలిజం (5) ఇండస్ట్రియల్ కేపిటలిజంగా వర్గీకరించాడు. పొలిటికల్ పెట్టుబడిదారీ విధానంలో యుద్ధ సాహసము, వలసల స్థాపనవల్ల సంక్రమించిన అధికారము లాభాలను సమకూరుస్తాయి. పెరైయ్ పెట్టుబడిదారీ విధానంలో యూదులు, పార్సీలు మొదలైన ఉపాంత ఆర్థిక ప్రజా సముదాయాల ఆర్థిక వ్యాపారాది చర్యలు ప్రముఖంగా కానవస్తాయి. ఇంపీరియలిస్టు పెట్టుబడిదారీ

విధానం తన సామ్రాజ్యం యొక్క భూభాగాన్ని విస్తరింపజేస్తుంది. ఫిస్కల్ పెట్టుబడిదారీ విధానం పన్నుల ద్వారా డబ్బు ప్రోగు చేస్తుంది. ఇండస్ట్రియల్ పెట్టుబడిదారీ విధానం స్థిర మూల ధనం ఏర్పాటుకు, ఫ్యాక్టరీలను స్థాపించి ఉత్పత్తిని నిర్వహించ డానికి పెద్ద పెద్ద మొత్తాలలో పెట్టుబడి చేస్తుంది.

## కాల్వినిజం ప్రభావం :

ఆధునిక పెట్టుబడిదారీ విధానం పెరగడానికి కావలసిన ఆత్మ ధైర్యాన్ని, ఉత్సాహాన్ని (Spiritual Quality) కాల్వినిజం ఇచ్చింది. భగవంతుడిచ్చిన దాన్ని నిర్వహించు కోవడాన్ని కూడా కాల్వినిజం ప్రజలకు నేర్పింది తత్కారణంగా పెట్టుబడిదారీ వ్యవస్థ వృత్తిగాను, సహేతుక కార్యక్రమంగాను విరాజిల్లుతోంది. భయము,నేరము లేకుండా లాభాలను సంపాదించమని ప్రజలను అభ్యర్థిస్తోంది. పెట్టుబడిదారీ ఉద్యమదారుడు "పెట్టుబడిదారీ విధానంద్వారా తాను తన పనివారిమీద సాగిస్తున్న క్రూర దోపిడితో పనివారు సహకరించినందుకు, తన వృత్తి ధర్మాన్ని బుషులకుండ వలసిన భక్తి తత్పరతతో నిర్వహించినందుకు శాశ్వత మోక్షం కలిగే అవకాశాన్నిచ్చాడు..." అని "జెనరల్ ఎకనామిక్ హిస్టరి"లో (పే. 369) వెటకారంగా వ్రాసాడు.

ఆధునిక పెట్టుబడిదారీ విధానంలో కులీన పరిపాలన (బ్యురాక్రసి) కొట్టవచ్చినట్లు కన్పిస్తుందని, వర్గపోరాటము కులీన పరిపాలన కంటె తక్కువ ప్రాముఖ్యత యివ్వబడవలసిన విషయమని వెబర్ వ్రాసాడు. ఇతర విషయాలేవీ వ్రాయకుండా వెబర్ తన 'జెనరల్ ఎకనామిక్ హిస్టరీ'ని ఒక్కదానినే వ్రాసి ఉన్నట్లయితే వెబర్‌కు ఆర్థిక శాస్త్రవేత్తల జాబితాలో ఇంకా గొప్ప స్థానం లభించి ఉండేదని డాక్టర్ న్యూమన్ "ది డెవలప్‌మెంట్ ఆఫ్ ఎకనామిక్ థాట్" (పే. 203)లో వ్రాసాడు,

# ఈ దేశంలో....

కన్నడ మూలం :

**డా. జి. ఎస్. శివరుద్రప్ప**

తెలుగు :

**శ్రీ ఘట్టమరాజు అశ్వత్థనారాయణ**

ఈ దేశంలో ...
అన్నీ ఆమూలాగ్రంగా
మారాలి;

కాని
నేను కూర్చున్న కుర్చీ, దాని క్రిందవున్న కాస్త నేల
చెక్కు చెదరకూడదు.

ఈ దేశంలో
కుల మత వర్గాలన్నీ
తొలగిపోవాలి;

కాని
వృద్ధిచెందిన మా వర్గానికి కాస్త స్థలం
కేటాయించాలి.

ఈ దేశంలో
వ్యక్తిపూజ వంశ ప్రతిష్ఠ
అన్నీ పోవాలి;

కాని
మా 'యింటి దేవునికున్న ఇనాము భూములు
అలాగే వుండాలి.

ఈ దేశంలో
అందరు మాట్లాడటం నిలిపి
కిమ్మనకుండా వుండాలి;

కాని
నేనాడే మాటలు సదా
చెవులొగ్గి వినాలి

శ్రీ వేదము వేంకటరామశాస్త్రి

# తెలుగువారి వింత పేర్లు

పేరులో ఏమున్నది, అది వట్టి ఆడంబరము, లేదా పిలుచుటకు, గుర్తించుటకు సాధనమని కొందఱి యభిప్రాయము. కాని పేరులోనే ఒక జాతి యొక్క వ్యక్తిత్వము, ప్రత్యేకత, జాతీయత కనబడుచుండును. వారివారి పేర్లు వినగానే ఏయూరు, ఏ జాతి, ఏ భాష, ఏ ప్రాంతము — అను విషయములు స్పష్టముగా తెలిసిపోవును. అందులోను తెలుగువారికి ఇంటిపేర్లొక ప్రత్యేక లక్షణము. భారతదేశములో, ఒక్క తమిళులకు తప్ప అన్ని ప్రాంతముల వారికిని పేర్లకు ముందుగాని వెనుకగాని, ఊరిపేరో, మూలపురుషు పేరో, లేక ఆయా కుటుంబాలకు సంబంధించిన ప్రత్యేక లక్షణ చిహ్నము వంటి పేరొకటి యుండును. ఒక అయ్యరుగారిని వారి తెలుగు మిత్రులొకరు ఇట్లు అడిగినారట :

'అయ్యరుగారూ మీయింటి పేరేమండీ ?'

అయ్యరుగారు — 'ఇంకా పెట్టలేదు' అని బదులిచ్చినారట. 'అయ్యో, అదేమి పెట్టడమా ?' అని ఆ మిత్రులడుగగా అయ్యరుగారు 'అదే, ఇల్లుకట్టుతున్నాను. పూర్తి ఐతే గేటుపెట్టి, గేటు స్తంభంమీద, ఆలోచించి మంచిపేరు పెట్టదలచుకొన్నాము' అని బదులిచ్చినారట. 'అయ్యో ! అది కాదండీ, మీ కుటుంబానికి పారంపర్యంగా ఫలానివారని ఒక పేరుండదా. మిమ్మల్ని ఏమంటారు. Family name, Sir name ఉండదా? అని మిత్రులు ఆశ్చర్యపడి అడుగగా వారు 'ఓహో ! అదా, మాకు ఇంటిపేరు లేదు తండ్రి పేరు పెట్టుకొంటాము. లేక గ్రామనామం ఉంటుంది చంద్రశేఖర వెంకటరామన్ — అంటే నాపేరు వెంకటరామన్. నాతండ్రిపేరు చంద్రశేఖర అయ్యర్‌గారు నా కుమారుడు వెంకటరామ చంద్రశేఖరన్. అట్లా ఉంటుంది.' ఆ తెలుగు మిత్రులు ఆశ్చర్యపడినారట. కాని వైష్ణవులకు ఇంటిపేర్లున్నవి. — 'మాడభూషి, కిడాంబి, వంగీపురం, ప్రతివాది భయంకరం' ఇత్యాది ఇవి వారి తెలుగు పుట్టు పూర్వోత్తరములకు సంబంధించిన చారిత్రక జ్ఞాపికలు. చరిత్రకారులకు మంచి సాధన సామగ్రి.

ఇంటిపేరుగాక తెలుగువారి స్త్రీ పురుష నామధేయములే వింతగా నుండును. పూర్తి పేరు చెప్పలేకయో, ముద్దుగానో, జగన్నాథం, ఆంజనేయులు, అంబికానాథ ప్రసాద్ ఇత్యాది పేర్లను జగ్గయ్య, అంజయ్య, అంబయ్య అనిపిలుచుట మామూలు. శ్రీకాళహస్తీశ్వరుని పేరును తిరుక్కాళనాథుడుగా పెట్టుకొని తెక్కయ్య అని పిలిచిరి గదా. వేంకటేశ్వరుడు వెంకయ్య, వెంగళప్ప ఐనాడు గదా అసలు పేరుపెట్టుటలో కూడా సంప్రదాయము లున్నవి. కొన్ని యిండ్లలో బారసాలనాడు నామకరణ భాగము ములభాగాన తెగదు. కోపములు, మనస్తాపములు ఏర్పడుచుండును. మామూలుగా పెద్దమనుమనికి తాత — పితామహుని — పేరు పెట్టుట ఆచారము. తండ్రియే కుమారునికి మొదటిదైవము. ఇది ద్రావిడ సంప్రదాయము. తమిళములో మనుమనికి పదము 'పేరన్'. అనగా 'పేరుగలవాడు'. తాతకు తన పేరేగలవాడే 'పేరన్'. అది మొదటి వానికే ఉండను. తెలుగువారు ఈ పదమును మఱచిపోయినారుగాని సంప్రదాయమును మఱువలేదు. మామూలుగా మొదటి మనుమనికి తాతపేరు పెట్టి రెండవ వారికి నాయనమ్మ తండ్రిపేరు, మూడవవానికి తల్లి తండ్రి పేరు, ఆడపిల్లలకు నాయనమ్మ పేరుగాని, అమ్మమ్మ పేరుగాని లేక అంతకు ముందు తరాల వారి పేర్లుగాని, వారి వారి స్థానము, మర్యాదలు అభిమానములను బట్టి పెట్టుట వాడుక.

ఈ సంప్రదాయ మరాదలకు సంబంధము లేక, చాలా కాలము పిల్లలు లేనివారు, తమకు పుట్టిన మొదటి బిడ్డకు — పెంటలోనో, బూడిదలోనో పొర్లించి పెంటయ్య, కుప్పయ్య, కుప్పస్వామి, కుప్పమ్మ, పెంటమ్మ అని పేర్లు పెట్టుట ఆచారము ఏ దేవునికైనను మ్రొక్కుకొని ఆ దేవుని పేరు పెట్టుట కూడ చూచుచున్నాము కొందరికి పతి పేరుకు ముందు ఒక వెంకట వచ్చుచుండును. కొందరు చాల దేవతల యొక్క, పెద్దల పేర్లు కలిపి దీర్ఘమైన పేర్లు పెట్టుకొనుట కూడ కలదు — శ్రీ వీరవెంకట సత్యసూర్యనారాయణ ప్రకాశరావులు చాలమంది.

ఈ పద్ధతులకు, ఆచారములకు బొత్తిగా సంబంధము లేక వింతగా కనబడు పేర్లు చాల ఉన్నవి— కోమటయ్య(వైశ్యుడు కాడు) కోమటియజ్వ, ఏనాదిశాస్త్రి, ఏనాదిరెడ్డి రెడ్డిశాస్త్రి, కోమటిరెడ్డి, రెడ్డి నాయుడు, మస్తానయ్య, తూర్కన్న, పళ్లయ్య, పల్లమరాజు, పేరిశాస్త్రి, పేరయ్య, పిచ్చయ్య, ఎల్లమంద — ఇత్యాదులు పెక్కులు చాల విచిత్రములు. ఇవి ఊరక నిరర్థకముగా పెట్టుకొన్న పేర్లా, లేక సార్థకములా, సంప్రదాయ గర్భితములా ? ప్రాచీన కాలమున మంత్రులు, కవులు, రాజ పురోహితులు తమ కుమారులకును, కుమార్తెలకును తమ పోషక ప్రభువుల పేర్లను పెట్టుకొనుట ఆచారముగా నుండెడిది ఇది చరిత్ర గ్రంథములలో కొల్లలుగా చూడవచ్చును. నెల్లూరి తిక్కరాజు మనుమసిద్ధి తండ్రి పేరును, ఆయన మంత్రి కొమ్మనామాత్యుడు తన కుమారునికి తిక్కన సోమయాజికి పెట్టుకొన్నాడు. ఖడ్గతిక్కన పేరుకూడ, రాజులలో సిద్ధిరాజులు, మంత్రులలో సిద్ధమంత్రులు, ఇతరులలో సిద్ధయ్యలు ఉండిరి రెండవ కాకతీయ బేతరాజు మంత్రి

వైజదండనాథుడు తన కుమారుని బేతన మంత్రియని పేరు పెట్టుకొనెను. చేమకూర లక్ష్మణామాత్యుని కుమారుడైన వేంకట రాజు తన ప్రభువుతో 'పుత్రుల నెందఱ పేరుపెట్టినం దీరునే నీ ఋణంబు'అన్నాడు. అసలీ వెంకటరాజు,వెంకటరాయ అను పేళ్లు విజయనగరపు మొదటి వెంకటరాయల తర్వాతనే తెలుగువారిలో ప్రచారములోనికి వచ్చినట్లున్నది. చరిత్ర చక్కగా చూచిన ఒక్కొక్క శతాబ్దములో ఒక్కొక్క పేరు ప్రసిద్ధి పొందినట్లు కనబడుచుండును.

ఇదంతయు చూడగా ఈ కాలములో కుల జాతి వాచకము లైన 'కోమటి', 'ఏనాది', 'రెడ్డి' పదములను ఇతర వర్ణములవారు వహించుట వలన వానిలో ఏదో చరిత్ర ఇమిడియున్నట్లు అనుమానము కలుగుచున్నది. అతి ప్రాచీన కాలమున, శాతవాహన నాగార్జునాదుల కాలము నుండియే, పేళ్లను ముద్దుగా ప్రాకృతీక రించుచుండిరో లేక సంగ్రహించుచుండిరో గాని, కాశ్మీర పండితుల పేళ్లు మమ్మట, రుద్రట, బిల్హణ, మల్హణ, జల్హణ, కల్హణ, మంఖక, రుయ్యక వంటివి చాల కలవు. మండన మిశ్రుని భార్య ఉభయ భారతిని 'ఉంబా' యన్నారు. ఆమె భర్త ఉంబేకాచార్యుడు. శాతవాహన చక్రవర్తులలో పులుమాయి పులుమావి యన్న పేళ్ల కేమర్థము. వీనికేమర్థమో ఎవరుమ వివరించినట్లు నాకు తెలియ రాలేదు. నాకిట్లు తోచినది. ఇది ఇంద్రుని పేరు. ఇంద్రాణి శచీదేవి పులోమజ. ఇంద్రుడు పులోమజిత్. ('ప్రాచీన బర్హిరహీహ, పృతనాషాట్ పులోమజిత్' — అమరము.) అదే పులుమాయి,పులు, పులోమ అను వానిని చంపినవాడు. వానికి మారకుడు=మాయి. మాపు=చంపు. నిర్మూలించు,అని యుండును. కొంపుమాపు, రూపు మాపు ఇత్యాదులులేవా.శబ్దరత్నాకరములో'మాయంజేయు,పొగొట్టు' అనియు సాయంకాలము, రాత్రి, మైల అను నర్థములు మాత్రమే కలవు. పౌరాణిక యుగములోను, చారిత్రక యుగములో ప్రారంభ కాలములోను ఇంద్రపూజలు, ఇంద్రోత్సవములును ఉండి భాగవత మతము ప్రచారమునకు వచ్చిన తర్వాత క్రమముగా పోయినవి. గోవర్ధనోద్ధరణకథ భాగవత మత విజయ సూచకమని, శ్రీకృష్ణో పాసనా ప్రాదుర్భావసూచికమని కొందఱు పండితుల యభిప్రాయము. ఇంద్రధ్వజమును కాళిదాసు రఘువంశములో వర్ణించియున్నాడు. ప్రాచీన తమిళ వాఙ్మయములో 'ఇందిరావిళా' యొక్క ప్రభావము చూడవచ్చును. సంస్కృత నాటకములలో కూడ నున్నది. జైన రాజులలో ఇంద్రులు చాలమంది, కాబట్టి పులుమావి, లేక, పులుమాయి యనునది ఇంద్రుని పేరుగా నుండవచ్చునని తోచు చున్నది. ప్రాకృత భాషా ప్రభావ మొకప్పుడు ఆసేతు హిమాచల ముండి యుండును. లేకపోయిన కుమారిల భట్టాచారుని పేరిలోని లకారమెట్లు వచ్చినది. కుమారుడు సుబ్రహ్మణ్యస్వామి గదా. అమ్మా అనుటకు కొందఱు 'అమ్మలూ' అనుటలేదా.

కాబట్టి చరిత్రకారునికి ప్రతి పేరులోను ఏదో చరిత్ర కనబడుచునేయుండును. ఈ కాలములో కోమటి, ఏనాది, రెడ్డి ఇత్యాదులు జాతివాచక శబ్దములు. ఒకప్పుడు కానట్లు తెలియు చున్నది. శ్రీనాథుని సమకాలికుడైన వామనభట్ట బాణుని తండ్రి పేరు కోమటియజ్వ, బ్రాహ్మణుడు. వీరి ప్రభువు పెదకోమటి వేమారెడ్డి. ఈ బ్రాహ్మణరెడ్డి కుటుంబములకు కులక్రమా గతమైన స్నేహ సంబంధముండి యుండును. లేకపోయిన ఒకరి పేరు ఇంకొకరు పెట్టుకొనుట సంభవింపదు. ఈ వేమారెడ్డి పెదకోమటి రెడ్డి కుమారుడు. తండ్రుల తరములో రాజు తండ్రి, పండితుని తండ్రి ఇరువురును కోమటి నామకులే. రాజుకు అతని తండ్రి ఆ పేరు పెట్టుకొనగా, తదాశ్రితుడు పండితుడు, తాను కూడ, పూర్వ సంబంధ కృతజ్ఞతా సూచకముగా పెట్టుకొన్నట్టు న్నాడు. ఇరువురికిని వైశ్యులతోనేమి సంబంధము. నిశ్చయముగా ఇది జాతివాచకముగా ఒకప్పుడు ఉండియుండదు. దీనిని గుఱించి కొంత ఆలోచించి శ్రీ చిలుకూరి వీరభద్రరావుగారు తమ 'ఆంధ్రుల చరిత్ర'లో కోమటి శబ్దము జైన తీర్థంకరుడైన గోమతేశ్వరుని వలన వచ్చియుండునని వ్రాసియున్నారు. జైనబౌద్ధముల దేశ మందు ప్రబలి యుండిన కాలములో ఎందరో వైదికులు, బ్రాహ్మణులు, క్షత్రియులు, వైశ్యులు, శూద్రులు జైనమతా వలంబకులైరి. పంపపొన్నమయ్య మొదలైన ప్రఖ్యాత జైన కన్నడ కవుల పూర్వులు ఆంధ్రబ్రాహ్మణులు. వీరివలెనే వైశ్యులును జైనులై గోమతేశ్వర పూజకులై కోమటులనబడి యుండి, మరల వైదిక మతావలంబకులై, పూర్వనామధేయమును వదలకయుండి యుందురనుటలో ఆశ్చర్యము గాని, అసంభవముగాని ఉండుటకవ కాశములేదు. వైష్ణవ బ్రాహ్మణులలో గోమతమువారికి ఆపేరెట్లు వచ్చినదో? మతమును వదలినను పేరును వదలి యుండరు. పొన్నమయ్య=పొన్ను=బంగారము బంగారయ్యలు మనలో చాలమంది. పంప — పంపా పంపాసరోవరమును ఎఱుగని వారెవరు.

'ఏనాది' శబ్దము ఏనాదివాండ్రకెట్లు వచ్చినదో (అనాది?) తెలియదుగాని (వేనాడు - వేనాది — ఏనాది ?) తమిళశైవ నాయనారులు అఱువత్తిమువ్వురలో ఏనాదినాథనాయనారు చాల ప్రసిద్ధుడు. ఇది శివుని పేరు ఏణాదినాదుడేమో. ఏణముజింక. శివ విగ్రహములకు ఒక కుడిచేత జింకబొమ్మ కలదు. బసవ పురాణములో 'ఏణాధినాథుండు నీయంకకాదు' అని యొక భక్తుడు శివుని సంబోధించును. నిజముగా నీతడు అంకకాడే. రాజుల కొలువులో రాజులకు ప్రాణమిచ్చుటకు కొన్ని నియమముల ప్రకారము శత్రువులతో యుద్ధము చేయు భటులకు అంకకాం డని పేరు. దీనిని శ్రీ నేలటూరి వెంకటరమణయ్యగారు చక్కగా తమ వ్యాసములలో విశదీకరించియున్నారు. ఈ ఏనాదినాయనారు గొప్ప కత్తియుద్ధ నిపుణుడు. ఇతనిమీద ఈర్ష్యతో నొకడు పోరాడి ఓడిపోయి, ఎట్లైనను ఈతని కడతేర్పదలచి ఒక మోసము చేయును. ఈ నాయనారు గొప్ప శివభక్తుడు. శివభక్తులీతనికి శివునితో సమానము. ఆ విషయము తెలిసికొని,విభూతిపెట్టుకొని, దానిని శిరస్త్రాణముతో కప్పి, మరల నాయనారుతో యుద్ధము చేయవచ్చి, కొంత పోరాడి, ఒకమారు విభూతి కనబడునట్లు

శిరస్త్రాణమును సర్దుకొనెను. ఆ విభూతి రేఖలు చూచి, నాయనారు, 'అయ్యో, శివభక్తుడే!' అని దుఃఖించి, పోరాటము మానినయెడల, ఇంతవరకు తనదే పై చేయి య్యియున్నందున, ప్రత్యర్థికి, శివభక్తునికి, అపఖ్యాతి కలుగునని శంకించి, అట్లు కలుగకుండుటకు, యుద్ధముచేసి, అతనిచేతనే ఓడిపోయినట్లు అభినయించి ప్రాణములు వదలెను. ఇటువంటి శివభక్తుని పేరు నెల్లూరుజిల్లాలో చాలమందికున్నది. మా పెత్తండ్రి — పెత్తల్లి భర్త — కొండగుంట వెంకటరమణశాస్త్రి గారి — ప్రతాప రుద్రీయ నాటకములో పేరయ్య పాత్రధారి—ఇంకొక ముద్దు పేరు ఏనాది శాస్త్రి. నెల్లూరులో మా తాతగారి మిత్రులు, సువ సిద్ధులగును పాటి ఏనాది రెడ్డిగారు. చాలమంది యానాది అని చెప్పట వాడుక. నేటికిని ఏనాదయ్యలెందరో.

రెడ్లు గ్రామములలో పన్నులు వసూలుచేసి రాజులకు పంపు చుండిరి, అది యొక ఉద్యోగము.

తూర్కన — శృంగార నైషధకృతిపతి మామిడి సింగన పెద్దలలో నొకడు, కులాగ్రగణ్యుడు. ఇతడే మూల పురుషుడు· భారద్వాజ మహామునిని చెప్పి ఇట్లు చెప్పినాడు:

'ఆముని నాథుసన్వయమునందుదయించె......

...పెదతూర్కన మంత్రికులాగ్రగణ్యుడై'.

శ్రీనాథుడు శృంగార నైషధకావ్యోప సంహారమందు 'నెల్లూరి తూర్కరాజపౌత్త్ర' అన్నాడు మామిడి సింగన్నను. ఇది దుర్గా శబ్దభవమై తమిళులవలన (వారికి ద లేదు· తకారమే) తూర్గమై యుండవచ్చును. లేదా మద్రాసులో 'తులుక్కాణం అమ్మ'యని ఒక గ్రామదేవతను పూజించుచు 'తులుక్కాణం' చెట్టియార్, మొదలియార్ మొదలైన పేర్లవారున్నారు. కాబట్టి ఇది అట్టిదిగాను కూడ ఉండవచ్చును, మనకు దుగ్గన్నలున్నారుగదా. శ్రీనాథుని బావమఱది దగ్గుబల్లి దుగ్గన్న

వేమ, వేమన్న, వేమారెడ్డి—వేప—వేముల (వేములవాడ)- వేపచెట్టు మహాలక్ష్మి. రావి వేప చెట్లనుకలిపి ప్రతిష్ఠించి లక్ష్మి అశ్వత్థనారాయణులని పూజించుట మన ఆచారము. లేక పోయిన— వేల్=వేలాయుథము+మ. వేలాయుధన్ సుబ్రహ్మణ్యస్వామి. సుబ్రహ్మణ్య అనుపేరుగల వారికి వేమ అను నామాంతరముకలదేమో పరిశోధించుట మంచిది. ఈ పేరు కడప, నెల్లూరుజిల్లాలలోనే కనబడుచున్నది.

పళ్లయ్య—నెల్లూరి రంగనాథస్వామికి పళ్లికొండ పెరుమాళ్ అని పేరు. ఇది ఒక కొండగాదు. పళ్లికొండ అనగా పడుకొన్న. పళ్లియనగా శయనము. కొండ యనగా కొనిన అని తమిళములో అర్థములు. శయాన శౌరి, రంగనాథస్వామి, బుద్ధుడుకూడ శయనించియున్న శిల్పములు, ప్రతిష్ఠలు కలవు గదా. బౌద్ధ గ్రామములకు విద్యాలయములకు పళ్లియని పేర్లు. అదే 'పళ్లె కూటం.' తమిళము.

పేరయ్య, పేరమరాజు, పేరిశాస్త్రులు—నెల్లూరిలో లేరు గాని గోదావరిజిల్లాలో పేరూరి ద్రావిడులలోఎక్కువ. తమిళములో పరమ శివునికి పేరయ్య అని పేరు. పెరియ+అయ్య=పేరయ్య. తమిళదేశములో పేరూరు గొప్ప శైవక్షేత్రము. (పేరురము= పెద్ద ఊరు.) ఈ ద్రావిడులు ఆ ప్రాంతమునుండి వచ్చిన వారేమో.

పిచ్చయ్య — ఇది ఉన్మాదమునకు సంబంధించినది కాదు. పరమ శివుడు ఆది భిక్షువు, తమిళ పదము. శివాలయములలో బ్రహ్మోత్సవములలో చివరిదినమున శివుడు భిక్షాటనము పోవునట, ఆదిన 'పిచ్చాండి' 'భిక్షాటన పరుడైన సన్యాసి'గా శివ వి గహమును ఊరేగింతురు. కల్యాణోత్సవమైన నాలుగవ దినమే సన్యాసమా ? ఇదేమి ఐతిహ్యమో నాకు తెలియదు. పిచ్చై యనగా ప్రసాద మనియు 'అల్లా పిచ్చై' అని మహమ్మదీయులు పేరు పెట్టుకొను చున్నారు. మన రామప్రసాద్, గౌరీ వర ప్రసాద్ — వంటిది ఈ పేరు. కాని శైవనాయనారులలో సుందరమూర్తి ఈశ్వరుని పిత్తా (=పిచ్చివాడా) యని సంబోధించినాడు. అయినను ఈ యర్థములో ఈ పదమునకు ప్రచారము లేదు·

కాటయ్య—కాటమరాజు, కాటారెడ్డి, కాటయవేమారెడ్డి. ఇక్కడుకాడనగా వల్లకాడు, అడవి. ఊరికి వల్ల, అనగా దగ్గరగా నుండు కాదు. 'ముసలివారు కాటికి కాళ్లు చాపుకొన్నట్లు' అని

సామేశ యున్నది గదా. వల్లకాటి అయ్య శివుడే, సందేహింపనక్కర లేదు. కేతన, కేతయ్యలు—కేదారేశ్వరులు.

ఎల్లమంద — ఏమోతెలియలేదు. ఎల్లమ్మ, ఎల్లయ్య పోలయ్య పోలమ్మ—ఇత్యాదులు గ్రామదేవతలను బట్టి వచ్చి యుండును. పోలమ్మ పొలిమేరమ్మ. పొలి=పల్లి. గ్రీకు భాషలో పొలియన్న గ్రామమే. దాని శాస్త్రము నగర పరిపాలనశాస్త్రము పొలిటిక్సు. ఎల్ల=పొలిమేర. అదే పోలేరమ్మ. వానవారు జాతరలు జరుపు దేవత.

మన తెలుగు కవుల—నన్నయ్య=నారాయణయ్య, నన్నన్ — తమిళములో చాలమంది. తిక్కన=తిరుక్కాళనాధుడు (కాళహస్తీశ్వరుడు) జగ్గన్న=జగన్నాధుడు, జక్కన్న=యక్షరాజు=కుబేరుడు. రాజరాజ శివభక్తుడు, రాజరాజు శివుడు కూడా, రాజునకు (చంద్రునకు)రాజు, రాజన్న. ఎఱ్ఱన్న అంగారకుడు, ఎఱుపు. పోతన్న పోతరాజు - పోతపి— పొత్తపి ఊరు కూడా. పోతును గ్రామదేవతకు బలివేయుదురు. పోతరాజే ఒకదేవత.

కొన్ని మండలములలో ప్రధాన దేవతలను బట్టి పేళ్లు. విశాఖపట్టణజిల్లావారు ఎక్కువగా అప్పారావులు, అప్పళాచార్లు అప్పళనరసింహాలు, (అప్పయ్య దీక్షితుని కాపేరెట్లు వచ్చినదో!) సింహాద్రి నరసింహస్వామికి అప్పడని పేరు. గోదావరి జిల్లావారు సత్యనారాయణులు. దాక్షారామప్రాంతమువారు భీమశంకరయ్యలు. కృష్ణా జిల్లాలో చాల పేర్లు కలిసియున్నవి. సుబ్బారావులు సర్వత్ర ఉన్నారు. సుబ్బరాయుడు, పాముసుబ్రహ్మణ్యస్వామి, పాపయ్య, పాపరాజు కందుకూరు, కనిగిరి, కందనవోలు, కోవూరు మొదలైనవి సుబ్రహ్మణ్యునివే. కో=పెద్ద. దేవుడు. కోయిల్ — కోవెల = దేవాలయము — దేవుళము = దేవకులము.

బాపట్ల ప్రాంతమువారు భావనారాయణలు. ఆ దేవుడు భావనారాయణుడు. ఆతని ఊరు=పట్టు. అదే భావనారాయణపట్ల, భావపట్ల, బాపట ఐనది.

పెంచెలయ్య, చెంచయ్య—నరసింహుడు. పెనుశిల—పెంచెల (కోల).

వెంకయ్య, వెంకటయ్య, వేంకటేశ్వరుడు, వెంకట రమణ, వెంకటాచల,వెంకటరాయ ఇత్యాదులు.

మునయ్య, మునుసామయ్య, చిత్తూరు జిల్లాలో ఎక్కువ. మునులు సిద్ధులు ఎక్కువగా ఉండినచోట. సిద్ధవటము కడప జిల్లాలో దానికి సమీపమే.

అంకయ్య అంకాళమ్మను బట్టియేగాని అర్కయ్యలు అక్కయ్యలు, అదే అక్కన్న మాదన్నలలో అర్కన్న, మాధవన్నలు. నల్లయ్య కృష్ణుడు. గురునాధుడు సుబ్రహ్మణ్యస్వామి. మల్లయ్యలు శ్రీశైల మల్లికార్జునయ్యలు, గొబ్బిదేవర శివుడు. కోపి=గొబ్బి గొబ్బిమ్మ పార్వతి. బయ్యన విజయాదిత్యుడు. విజయ—బిజ్వ—బిజ్జ—బెజ్జ (విజయాదిత్య=బెజయిత) బయ్య — బయ్యావారు కలరు. పరమానందయ్య వినాయకుడు.

ఇవిగాక వైష్ణవమతము వలన ఇంకను చాల పేర్లు వచ్చినవి. ఎందరో తిరునారాయణ స్వాములు, వీరరాఘవయ్యలు, అళఘ సింగరులు, సింగరాచార్లు, పర్వతాలు పర్వతరాయడైనచో పానకాలు పానకాలరాయుడు మంగళగిరివాసి కావలెను. కొండయ్య కొండలరాయడైనచో భద్రయ్య వీరభద్రయ్యో లేక భద్రాచల రామయ్యో కావలెను.

అల్లాడరెడ్డి, అల్లాడయ్య, అల్లాడిశాస్త్రి ఇవన్నియు కంచి వరదరాజస్వామి, అరుళాళప్పెరుమాళ్—అల్లాళ—అల్లాడ—అల్లాడిగా మారివచ్చినవే.

ప్రాచీన రాజవంశావళిలో బేతరాజులు, బేతనలు కలరు. బేతన భట్లులు కూడ. ఇది బేతాళ సంబంధమై యుండవలెను. బేతాళోపాసన శైవములో నొక భాగము. బేతాళ శబ్దము ప్రేతశబ్దభవమై యుండును. ప్రేతములోనేగదా బేతాళుడు పూనుట. శవ దహనములు లేని కాలపు విషయము. బేతాళభక్తులు బేతన్నలు.

పుల్లయ్యలు మాత్రము వారి దేహ రుచిని బట్టి యేర్పడి యుండరు. పుల్ల అన్నగా చిన్న—చిన్నయ్యలు—చినప్పా పిళ్లైలు — చిన్నసామి అయ్యర్లు చాలమంది. చిన్నస్వామి ఆంజనేయుడో గరుడుడో. పెరియ తిరువడి — శిరియ తిరువడి అని కలదు గదా. పెరియ తిరువడి మహావిష్ణువే.

దొరసాములు—ధుర—ధురంధర—నుండి దొరలై సాములై యుండవలెను.

ఈ విధముగా సంస్కృత ప్రాకృత తమిళాది భాషా ప్రభావములను శైవ వైష్ణవాది మతముల ప్రభావములను నెమ్మదిగా పరిశోధించి ఎంతో ప్రాచీన చరిత్రయునట్లు తోచుచున్నది. పండితులు పరిశోధింతురు గాక.



# స్వయం ఉపాధికి సోపానాలు

నేటి యువతరానికి గుదిబండలా తయారైంది నిరుద్యోగ సమస్య. దీన్ని మనం దృఢ నిశ్చయంతో తొలగించుకోవాలి. అందరికీ ఉపాధి కల్పించాలి.

ఈ బృహత్తర కృషిలో భాగంగానే విద్యావంతులైన నిరుద్యోగులకు శిక్షణ ఇవ్వడానికి **1978** ఆగసు **15**వ తేదీన రు. **5** కోట్ల ఖర్చుతో కూడిన ప్రత్యేక ఉపాధి పథకాల్ని ప్రారంభించారు.

**1976-77** సంవత్సరం రాష్ట్రంలో ఉపాధి అవకాశాలు గణనీయంగా పెరిగాయి. ఉపాధి కేంద్రాల ద్వారా **52,876** మందికి ఉద్యోగాలు కల్పించారు. గత సంవత్సరంకన్నా **34** శాతం ఎక్కువ మంది ఉద్యోగాలు పొందారు.

సన్నకారు రైతుల అభివృద్ధి లాభసాటిగాని రైతులు, వ్యవసాయ కూలీల పథకం; క్షామ పీడిత ప్రాంతాల అభివృద్ధి; పశుగణాభివృద్ధి మొదలైనవి ఎన్నో కార్యక్రమాలు ఇప్పుడు అమలు జరుగుతున్నాయి. వీటివల్ల **15** లక్షలమంది సన్నకారు రైతులు, లాభసాటిగాని రైతులలో **6.58** లక్షల మంది ప్రయోజనం పొందారు.

**2½** ఎకరాల మాగాణీ, **5** ఎకరాల మెట్ట భూమిగల సన్నకారు రైతులను భూమి శిస్తునుంచి మినహాయించారు.

ఉత్సాహంతో స్వయం ఉపాధి సోపానాలను అధిరోహిద్దాం. నిరుద్యోగ సమస్యకు చరమగీతం పాడుదాం.

---

*సమాచార, పౌరసంబంధశాఖ, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం హైదరాబాదు*

31/78-79



# దూరంగా పారిపో!

## శ్రీ కాసల నాగభూషణం

లోకం నలుమూలల్నీ
 'నిశ్శబ్దమే ఏకంగా ఏలే వేళ
నేను మేలుకున్నాను నిద్రలోంచి.
విప్పుకున్న నా కన్నుల్లో
అప్పటి వరకూ కాపురాన్ని
చక్క దిద్దుకుంటోన్న కలలన్నీ
కన్నీళ్ళగా మారి, జారి
ఇంకి పోయాయి తలగడలో—మనుగడలోకి మళ్ళే !
ఆశల దిశాంచలాలలో
ఊహల గాలికి
అలా అలా తేలిపోయే రేపటి రూపులు
మెరుపుల నిప్పుల్లో కాలి
బూడిద పేలికలై
ఎగిరిపోయాయి కళ్ళకి కనబడకుండా.
ఎటు చూసినా
మింటికి మంటికి ఒకటే ధారగ
కారు చీకటి – కంటి పాపే శూన్యమంతటా
కమ్ముకున్నట్టు
కురుస్తోంది.
తడుస్తున్నాను.
శవం తాలూకు స్పర్శ చల్లగా.
భయం
పాములా ప్రాకుతోంది
వెన్నుపాము మీాద జర జరా.
ఒక టొకటీ చినుకులు కురిసి,
కలిసి
కాళ్ళని చీకటి నీటిపైకి అమాంతంగా తేల్చి,
నన్ను నిలువునా వెల్లువలో ముంచి
తీసుకు వెళుతోంది గడ్డి పరకలా.
ఈత రాక, ఊపిరాడక
కొట్టుకుపోతున్నాను — ఎటువేపో !
ఈ ఆశ్వాసం ముగిసేలోగా
తుది నిశ్వాసం విడిచేలోగా
నా జీవితంలోకే తొంగి చూడకు వేకువా !
చేతనయితే ఇంకా దూరంగా పారిపో !



## శ్రీ నందివాడ భీమారావు

# ముందే మా తరం

ఆశ్చర్యపడే లక్షణమే ఉండాలి గాని — ఉంటే ఈ అపారమైన, అనంతమైన సృష్టిలో అడుగడుగునా క్షణక్షణం 'ఆః' అనిపించే విషయాలూ, వ్యక్తులూ, తత్వాలూ కోకొల్లలు నిప్పులు జిమ్ముకుంటూ నింగికి ఎగిరిపోతే నిబిడాశ్చర్యమేమరి. నెత్తురు చిమ్ముకుంటూ నేలకు నేరాలిపోతే నిజంగా నిర్దాక్షిణ్యమే ఎదురైతే మహాశ్చర్యం. బస్సుల వాళ్ళు రిక్షాలవాళ్ళని చావకొడితే, కావలసిందే వాళ్ళకి అన్న మధ్యతరగతి రియాక్షను ఆశ్చర్యం కలిగించకపోతే అంతకంటె లోతైన దెబ్బే తగిలుండాలి అంతరాంతరాల్లో. భగవంతుడుండి, ఈ సృష్టిలో ఇన్ని మన కళ్ళకి అస్తవ్యస్తంగా, అవకతవకగా, అన్యాయంగా ఉండే వాస్తవాలుండడం, అంతుపట్టని ఆశ్చర్యం. కాని ఇవన్నీ ఉండి భగవంతుడనే ఒక ఆయువుపట్టైనా లేకపోతే మరీ విడ్డూరం. సృష్టి రహస్యాలన్నిటినీ వెదికి వెదికి పట్టుకుని, దాంట్లో ఉన్న ఆశ్చర్యాత్మకాల్నీ, ఆశ్చర్యార్థకాల్నీ తెగేసి కోసి ఎనలైజ్ చేసి, "ఇదింతేనయ్యా, ఏం విడ్డూరంలేదూ" అనగలిగిన భౌతికశాస్త్రం కూడా చాలామటుకు 'ఎలా' అన్న ప్రశ్ననే ఎదుర్కొంటుందికాని, 'ఎందుకు' అన్న ప్రశ్నని సవాలు చెయ్యదు. 'విశ్వందర్పణదృశ్య మాననగరీ దృశ్యాం నిజాంతర్గతాం'. కాని నిజంగా మన కళ్ళతో చూసేదీ, చెవులతో వినేదీ అంతా మాయే, ఈ పెంజీకటి కవ్వలి వెలుగే సత్యమైతే, అంతకంటే గుండెలు బాదుకోవాల్సిన విషయమేముంది.

'ఒరే, నేనివాళ చెబుతున్నాను విను. నువ్వు ఒంటరిగాడివై పోతావు' అనేవాడు తాతయ్య నవ్వేవాణ్ణి. చాదస్తమనుకునేవాణ్ణి. జలియన్‌వాలాబాగ్ రోజులు. సందు యవ్వనం రోజులు రక్తం ఉడుకెత్తే కాలం. చుట్టూ పదిమందిని వేసుకుని పరాయి ప్రభుత్వం పైశాచికతని బాహాటంగా తిడుతూ, ఎంత పెద్ద వాళ్ళైనా, వాళ్ళలోని స్వార్థాన్నీ, కుత్సితత్వాన్నీ, కొంచెం తనాన్నీ వేలెత్తి చూపెట్టి హేళనచేస్తూ తిరిగే రోజులవి. రాబోయేకాలం మాది. మేమంతా ఒకటై పంట ప్రజలందరికీ లేకుండా ఎగరేసుకుపోయే తుంటర్ల నందర్నీ ఒంటర్లనిచేసి, 'దేశం మనది, మనందరిదీ' అనే ఒక సర్వమానవ సౌభ్రాతృత్వాన్ని నెలకొల్పుతాం. వెనకచూపు కబుర్లు చెప్పే నీలాంటి వాళ్ళే ఒంటరి వాళ్ళౌతారు తాతయ్యా. "పెద్దమాటలురా. నేనుండన్రా అప్పటికి". 'ఎక్కడున్నా ఆ స్వర్ణయుగం చూసి సత్తిగాడు నిజమే చెప్పాడు అనుకుందూగాని'. 'కాదురా నేననేది నేచెప్పినట్టు నువ్వు ఒంటరిగాడివై ఎందుకిలా అయింది అనుకునేప్పుడు నేనుండన్రా".

'మాంగల్యం తంతునా మమజీవన హేతునా..." సత్తిగాడి పెళ్ళి. వీడు నాపేరెట్టుకున్నాడు. నాబోటిగాడనే అనుకునేవాణ్ణి.

"ఆంగీరస బార్హస్పత్య...... భారద్వాజస గోత్రోద్భవస్య, సత్యనారాయణ శర్మణః పౌత్రేః." అవును. వీడు నాపౌత్రుడే...నారక్తం పంచుకుపుట్టిన వాడి రక్తం పంచుకుపుట్టినవాడే నాలో 1922 నాటికి లక్ష్మి నా ఇంటిగడపదాటి లోపలికొచ్చిన నాటికి లావాలా మరుగుతున్న ఆ రక్తమే ఈ 1978 నాటికి వీడిలోను ప్రవహిస్తోంది. తరం తరం నిరంతరం· నా ఒంట్లో ఏదో జ్వరం. బాజాలు భజంత్రీలు. మంగళవాయిద్యాలు. అందరూ చల్లగా ఉండాలి. పెళ్ళివారిల్లు కలకల. ఎటుచూసినా కిలకిల. నా ఒంట్లో జ్వరం. నా కంట్లో పొర.

"సత్యం బాబాయ్. కొంచెం విశ్రాంతి తీసుకో. పరధ్యానంగా ఉన్నట్టున్నావు. ఒంట్లో బాగులేదా. కాఫీ తాగావా" పరధ్యానమే, ఇది ఇవాళ్టి జబ్బామరి "ఒరులేయవి యొనరించిన నరవరయప్రియంబు తనకగు, తానొరులకు నవి సేయకునికి పరాయణము పరమధర్మ పథములకెల్లన్". చాలదు తాతయ్యా ఇంకోడికి హాని చెయ్యకపోవడమే పరమధర్మమైతే మన ధర్మం ఎత్తు చాలా తక్కువన్నమాట. నీ అవసరం, మరోడి అవసరం నా అవసరాల కంటె ముఖ్యం. నా కండలు కరిగించేది నావాళ్ళ కోసం. నాకోసమే కాదు ఎంతమందికి వీలైతే అంతమందికి అండలు కలిగించేందుకు. ఏవాడు జీవింప ననేకులు జీవింతురు. అట్టివాని మనుగడయే సఫలము. "ఒరే నీదారి సుగమం కాదని వేరే చెప్పక్కర్లేదనుకో. చాలా కష్టపడి ఈ దారిని వెళ్ళినా నువ్వు సాధించేదేమీ ఉండదు. ఒంటరితనం తప్పించి." తాతయ్యది కత్తిలాంటి దృష్టి. ఎన్ని రకాల జీవితాల్ని ఎన్ని రంగుల్లో చూశాడో. నలభై ఏళ్ళు దాటిన వాళ్ళంతా నానాగడ్డీ కరిచి ఏదో ఇంత వెనకేసుకుందాం అన్న ధ్యేయం ఒక్కటే పరమాదర్శమైపోయినవాళ్ళే, అని కూడా అనుకునేవాణ్ణి.

తాతయ్య — ఆ చీకటి హరికేన్ లాంతర్లు, పొదుగాటి కొబ్బరిచెట్లు, కొబ్బరాకుల, కొబ్బరాకుల సందులో వెన్నెల్ల, మందువాలోగిళ్ళ, అహింసా సిద్ధాంతాల, అంటరానితనాల, సాంఘిక దురాచారాల, దురాచార నిర్మూలన నోద్యమాల, తెల్లోడి మాయల, నల్లోడినరకాల, చాదస్తపు దూరస్తపురోజుల్లోంచి దాదాపు అర్ధశతాబ్ది ముందుకి తొంగిచూడకలిగేడనే అనుకోవాలా. వీరబ్రహ్మంగారు కొన్ని శతాబ్దాల తరువాత జరిగే విషయాలు చెప్పాట్ట. మనదేశంలో యోగులకి భూత భవిష్యద్వర్తమానాలు తెలిసేవిట. అయితే తాతయ్య సామాన్య మానవుడేనని నా నమ్మకం ఆయనలో అసాధారణ శక్తులేం లేవు. జీవితంలో ఆశ్చర్యపడాల్సిన సందర్భాలు చాలా చూసి, ఎవళ్ళే విధంగా ప్రేరేపణ చెంది ఎలా ప్రవర్తిస్తారో

ఏ దారిన వెడితే ఏ పుంత తగులుతుందో క్షుణ్ణంగా పరిశీలించి అవగాహన చేసుకున్న జిజ్ఞాసువు మాత్రమే. జీవితాన్ని అర్థం చేసుకున్న వాళ్లు దాంతో తగువుపెట్టుకోరు. అలా చేసుకోలేని వాళ్లే 'జగమేమాయా' దేవదాసులు. వామాచేమిటి.

'సత్యంబాబోయ్ ధర్మం ఆమ్మోయ్'. 1922 నాటి సిల్వర్ స్క్రీన్ బెట్. బలహీనమైంది ముద్ర. ఫొటోలకి ఆల్బము లుంటాయని తెలియదు జీవితాన్ని కూడా ఫ్రేములోనే బిగించేవాళ్లం. చలం కలం విశృంఖలం. శాఖాంతరం మతాంతరం కాదు ఇంకా నయం. అయ్యోరాత కట్నం కూడానా. వీడు వాళ్లని పోషించకుండా ఉంటే చాలు. ఇంటో తల్లీ తండ్రి నీ తలెత్తుకోకుండా చేసి, ఊళ్లోవాళ్ల కన్నీళ్లన్నీ వీడే తుడుస్తాడు. లక్ష్మి నా సర్వస్వం. నేను లక్ష్మికి సర్వస్వం. అంతే అయితే కావలిసిందేముంది. 'నీ బతుకు నువ్వు బతగడం చేతగాదురా అబ్బాయ్'. సదాచారం పేరుతో, సంప్రదాయం పోరుతో నిజానికి దురాచారాల్ని రాజ్యమేల నిస్తున్నాం. ఏదన్నా అంటే భయం. అటు తెల్లోళ్లేనాయన వ్యవస్థని ముక్కలు చేస్తారు. ఇటు ఇంటిదొంగలు భల్లూకప్పట్టేనా పట్టేస్తారు. ఈ లోగానే సంఘాన్ని చావుదెబ్బ కొట్టైనాసరే మేలుకొనేట్టు చెయ్యాలి.

చేముట్టు సరసానిక్కర చరణాలాడని రామప్పంతుళ్లంటే మంట. హేళన, క్రరలు విరక్కొట్టాం. గన్నుల కెదురెళ్లాం. గాంధీజీకి జై అన్నాం. కాంగ్రెసు పార్టీ స్తై అన్నాం కటకటాల కటకట రుచ్చూశాం దేవతాపులుసు తాగాం. ఇంకా ఏమేమిటో. నువ్వు ఒంటరిగాడివై పోతావురా అబ్బాయ్. ''పదిమందితో చావు పెళ్లితో సమానం అనుకుని ఎప్పుడూ రంగస్థలం మధ్యలో ఉండే నేను ఒంటర్నేమిటి తాతయ్యా నెర్రిబ్రాహ్మడా''. — 'వీర గంధము తెచ్చినారము, వీరులెవ్వరో తెల్పుడే'. మా అస్తులు దధీచి అస్తులు. సత్యాగ్రహ వజ్రాయుధం పన్నులు కట్టలేదు. ప్రభుత్వం పళ్లూడగొట్టింది వృత్తులు మానుకున్నాం. ప్రవృత్తులు మారలేయా. 'బతకడం చేతగాదురా అబ్బాయ్'. మాకొద్దీ తెల్లదొర తనము మరే దొరతనం కావాలా. కిందవాడు ఆహుతి అవడానికి పైవాడి రంగుతో సంబంధమేముంది.

చాలాకాలం బతికితే ఎవరేనా ఒంటరివాళ్లవుతారేమో అలా అయితే తాతయ్య చెప్పినదాంటో ప్రత్యేకతేముంది. ఇందులో ఏదేనా కారణం ఉంటే నా మనసు, మెదడు పన్నెసేతీరులోనే ఉండాలి. కొద్దో గొప్పో 'నా' అనే భావం లేనివాడు ఎంత నిస్వార్థజీవి అని ప్రజలు మెచ్చుకున్నా హితులు స్నేహితులు అయినవాళ్లు కూడా ఒక గడి అవతలే ఉంటారు. వీడి నిస్వార్థత వాళ్ల స్వార్థానికి అడ్డం వస్తుంది.

ఆశ్చర్యమే. ఒకళ్ల స్వార్థం ఇంకోళ్ల స్వార్థానికి అస్తమానూ అడ్డమే వస్తుందనుకోనక్కర్లేదేమో. కొంతవరకేనా సంఘం స్వార్థం ప్రాతిపదికమీద నడుస్తుంది. నీ స్వార్థానికి నా సహకారముంటే నా స్వార్థానికి నీ సహకారముంటుంది. బొత్తిగా నిస్వార్థ జీవి ఇంకోళ్ల స్వార్థానిక్కూడా ఉపయోగపడలేడు. అందుకే వాడైన వేడైన కాలంలో అందరూ మనవాళ్లే అయినా అనగా అనగా ఎవరికివారే. నువ్వు నా మేనల్లుడి కుద్యోగమిప్పించు. నేన్నీకు లైసెన్సు తొందరగా వచ్చేట్టు చేస్తాను. నువ్వు మడిగట్టుక్కూర్చో. నాకు వేరే పనుంది వెళ్లొస్తా. అయ్యో ఇదండి కిటుకు.

కట్నం దురాచారం. అనేక కుటుంబాలు ఈ దురాచారం వల్ల నాశనమౌతున్నాయి. యువకులు ముందుకువచ్చి తమకు నచ్చిన యువతుల్ని దమ్మిడీ కట్నం లేకుండా పెళ్లిళ్లు చేసుకోవాలి. తలి దండ్రుల్ని ఒప్పించాలి. అవసరమైతే ఎదిరించాలి. రాజకీయాలు చల్లబడి చప్పబడిన రోజుల్లో ఇదీ మా వేదిక 'మాంగల్యం తంతునా మమజీవనహేతునా' — ఏమాట కామాటే చెప్పకోవాలి. రాఘవుడిలో నాకున్న వేడి తిరుగుబాటు లేకపోయినా సంఘ సంస్కరణే సంప్రదాయమైపోయిన కుటుంబంలోవాడు కనక ఆదర్శాలూ, ఆశయాలూ, అంటూ ఆపసోపాలు పడేవాడు. తరం తరం నిరంతరం. ఆదర్శాలు ఇంకోతరం నిలదొక్కుకున్నాయి. చుట్టూరా ఆవరించిఉన్న చీకటిని ఊరికే తిట్టుకుంటూ కూర్చోకండి. ఒక చిన్నదీపాన్ని, ఎంత చిన్నదైనాసరే, వెలిగించడానికి ప్రయత్నించండి. ఈ దీపంలో విద్యుత్తు ప్రవేశపెట్టాలనుకున్నాం. అప్పుడు. స్వతంత్రం ఒచ్చేకే. ఇరవైఏళ్ల క్రితం కదూ. ఆయన పాపం కాశేశ్వరావు గారు. 'పంతులుగారూ చట్టం చేస్తే కట్నాలు మానేస్తార్లండీ. చాటుమాటున తీసుకుంటారుకాని'. చట్టమంటూ ఉంటే, కొన్నాళ్లు చాటుమాటున సాగినా అదే మాసిపోతుంది కాలగతిలో. శారదాయాక్టు వచ్చిన ఇన్నాళ్లతర్వాతగదా చిన్నపిల్లల పెళ్లిళ్లు, ఏ నాటికో కోటికో తప్పించి, ఆగిపోయాయి అలాగే ఇదీను. చట్టం శక్తి బహుకాల ఫలితాల్ని బట్టి నెమ్మదిగా బేరీజువేసుకుందాం. ముందు చట్టం రానివ్వండి అప్పటికి రాఘవుడుది గవర్నమెంటు ఉద్యోగమేగా. లా డిపార్టుమెంటు. ఈ చట్టం రాయడంలో వాడికీ చిన్న పాలుంది. అదీ మా కుటుంబానికి గొప్ప.

'రక్తం మండే యువకుల్లారా రారండి.
వయస్సు మళ్లిన, ఎముకలు కుళ్లిన
**సోమరులారా చావండి.'**

నలభై ఏళ్లు దాటిన ప్రతి మనిషీ ఒక స్కాండల్. ప్రపంచాన్ని ఇన్ని ఉక్కు ఉచ్చుల్లో ఉన్న విధంగా బిగించి, తమ కొచ్చేలాభాలకి అడ్డు అదుపులేకుండా అన్ని హంగులూ అమర్చుకుని ముక్కు మూసుక్కూర్చున్నట్టు నటించే ముచ్చులు. వీళ్లు ముసలి వాసనవేస్తారు. ఎముకలుకుళ్లాయిగా. ఏ సంఘసంస్కరణా, ఏ ప్రతిఘటనా, ఏ విప్లవవాదం వాళ్లకి కిట్టవు. తిరోగామి మనస్తత్వం వాళ్లది. తెగించి ముందుకు దుమికే యువకులకు కదల్చరాని అడ్డుగోడలు వీళ్లు. పెకలించరాని ముళ్లకంచెలు. వయసొచ్చిన కొద్దీ మనిషి కుంచించుకుపోతాడు తన మీదా, తన వాటి మీదా ఆ కట్టుకునే గుణంపెరిగిపోతుంది. మరి యువకులో ఆదర్శాలకీ, ఆశయాలకీ ప్రతీకలు. నవ్యకావ్యాల నవలా రాజీల

నాయకులు. తాము నమ్మిన సిద్ధాంతాల కోసం ప్రాణాల్ని, తమను నమ్మిన కన్యల కోసం కన్నవాళ్లనూ వదలగల ధీరోదాత్తులు.

జవానీకీ రేల్ పేలీ జాయేరే· పడుచుదనం రైలుబండి పోతున్నది. వయసు వాళ్లకిందులో చోటున్నది. ఈ చోటు అందరికీ అక్కర్లేదా అబ్బాయి. ముసలాళ్లకి ముందుకెళ్లాలని ఉండదా. లేదండి. వాళ్లది గడుసుదనం రైలుబండి. ఆ బగాలగేజీ ఎక్కిస్తూ మెల్లిగా వెడతారు. మాది సూపర్ ఫాస్ట్ ఎక్స్‌ప్రెస్. ఎక్కడికిట. ఎక్కడికైతేనేం. ఉరకడం ముఖ్యం· అందరూ ఎక్కారా అని చూసేందుకు సమయం, అవసరం కూడా లేవు.

సత్యం మావయ్య మనవడు అమెరికా వెడతాట్టగా పెళ్లవగానే ఆ కండిషను మీదనే చేసుకున్నాట్ట. కండిషనేముందయ్యా. అటాయన కోటికి పడగెత్తాడు. Only Daughter. అమెరికా ఏముంది, చంద్రమండలానికైనా పంపిస్తాడు అసలా ఆస్తంతా వీళ్లదేగా. ఆయన హరీ మంటే అబ్బో వీళ్లు సత్యం మావయ్య, రాఘవులు బావ కబుర్లు చెబుతారుకాని వీళ్లకీ డబ్బుమీద మొగ్గే. లేదురా. సత్యం మావయ్య ఎన్ని అవకాశాలు ఒదిలేసుకోలేదు. కావాలను కుంటే ఈ పాటికి పదవో, పదిలక్షలో అతనివి కాక పోయేవా. ఇలా ఒంటరిగా ముసలిక్కడ్దరులో శూన్యంలోకి చూస్తూ తనలో తను గొణుక్కుంటూ కూర్చునే ఖర్మేం. వినగలడొరేయ్.

మా తాతయ్య కిష్టంలేదేరా ఈ పెళ్లి. ఇంత వైభవంగా పెళ్లి జరుగుతుంటే ఆయన పరధ్యాన్నంగా కూచున్నారేం. ఆయనా. సరే ఆయన మాట చెల్లితే ఏ హరిజన స్త్రీనో కట్టుకుని దరిద్రం పాలించమంటాడు. ఆయన, గాంధిగారూ, స్వదేశీ అంటూ తిరిగి తగలేసిన ఆస్తి ఉంటే ఇప్పుడిలా మావగారి డబ్బుమీద మోజెందుకోయి.

హవుస్ ఆఫ్ బాంబూ–నంబర్ ఫిఫ్‌టీఫోర్

కదుల్తున్న శరీరాలకి మత్తు. హుషారు. లోపలికదలికబంద్. ఆలోచన అసలే అవసరంలేదు. ఈ లక్షణం ఈ తరహా సంగీతానికేనా. అసలు సంగీతమే ఈ త్రోవా ఏమిటి. ఆ పాత మధురం అంటే ఏమిటి. మన ప్రమేయంలేకుండా మనకి ఆ శబ్ద తరంగాలు తగుల్తూనే మధురం అనిపించి మైమరపిస్తాయా. అన్యదాలోచనామృతం. అంటే సాహిత్యంలోనేగాని సంగీతంలో ఆలోచనకి చోటే లేదుగా. మరి సంగీత జ్ఞానము వినా సన్మార్గం లేదంటాడేమిటి త్యాగ జస్వామి. అసలు సంగీతం, జ్ఞానం రెండు కలుస్తాయా.

నంబర్ ఫిఫ్‌టీఫోర్ ది. హవుస్ ఆఫ్ బాంబూ

జ్ఞానంతో ప్రమేయం లేని సంగీతం, ఉట్టినే Euploria ఆనందా భాస కల్గించే సంగీతం ఒకటీ, త్యాగరాజు చెప్పిన జగదానందకారకమైన సంగీతం వేరొకటేనా.

---

'సీతమ్మ పెళ్లి కూతురాయెనే,
మన రాముడు పెళ్లి కొడుకాయెనే'

మామగారు జనక మహారాజే. కాని సత్యం రఘువంశ సింహాసనానికి వారసుడైన కళ్యాణ రాముడుకాడే. శబరి వర్ణించిన రాముళ్లాంటి నిరుపేదల వంశంవాడే. మరి ఆయనేం చూశారు వీడిలో. పోనీ ఆయన గారాల కూతురేంచూసింది. రూపం, చదువూ. డబ్బున్నవాళ్లకి ఇవి దొరకడం లెక్కలోమాటకాదే. ఏమిటబ్బా కిటుకు. ప్రేమేనా.

వీడి మాటేమిటీ. తాతయ్యకి నేనెలా కొరుకుడుపడలేదో, నాకు వీడూ అంతే. చిన్నప్పణ్ణించి వీడి తీరే వేరు. అన్నిట్నీ ప్రశ్నించడమే దేవుడున్నాడా తాతయ్యా. మంచివాళ్లని రక్షించి చెడ్డవాళ్లని నరకంలో వేస్తాడా. నువ్వూ నాన్నా చాలా పాపాలు చేశారా. తాతయ్య మనం ఏదేనా కావలిస్తే ఇంకోళ్లని తన్ని తెచ్చుకోవచ్చా....? ఎందుకు తెచ్చుకోకూడదు. ఇంకోళ్లు మన్ని తంతే ఏం చెయ్యాలి. అహింసంటే ఏమిటి నాన్నా.

తాతయ్యా నువ్వు చెప్పింది ఒప్పుకోడానికి సిద్ధంగాలేను. ఎందుకంటావా మీరంతా అన్యాయాన్ని ఎదుర్కొన్న హింసనే ఎండ్స్ ఎండ్ మీన్స్ అంటూ తర్కిస్తున్నారుగాని అసలు ఏ అన్యాయపు సంఘం ఎంతో హింసని కడుపులో దాచుకుని, ఒక్క ప్రాణుల్ని అణువణువునా కోసికోసి వెర్రి బ్రాహ్మణ్ణి తినేసి మీసాలు నాక్కుంటూన్న చిన్నయ సూరిగారి పులిలా కూర్చుందో దాన్ని గురించి మాట్లాడరేం. అది హింస కాదంటారా ఏమిటి కొంపదీసి.

అనుకునేవాణ్ణి. ఏమో వీడు చెప్పే దాంట్లో మాలాంటి అహింసావాదులికి కొరుకుడుబడని తర్కం ఉన్నట్టుంది. ఆ మధ్యన గోరాగారు ఉన్నట్టుండి అతివాదుల్లోకి వెళ్లక తప్పేట్టు లేదండీ అన్నారు. బహుశా ఆయనకీ అనిపించిందేమో మనల్ని చాదస్తుల కింద కట్టేసి అసలుకి భంగం లేకుండా చూసుకునే శక్తులే మన అహింసావాదాన్ని, సంఘ న్యాయాన్ని ప్రశ్నించే చిన్నవాళ్ల మీద ప్రయోగిస్తున్నారని. కాని నిజంగా హింసే దారైతే ఎంతదారుణం. మహాత్ముడి కృషియావత్తూ వృధాయేనా. ఆయన హింసకు తావివ్వకుండానే మొత్తం ఉద్యమం నడిపేడే. అవతలి శత్రువు దుర్నిరీక్ష్యమైన ఆంగ్ల సింహాసనమైనా లెక్క చెయ్యలేదు. అంతకంటె బలవత్తరమైందా ఈనాటి ఇంటి శత్రువు. 'క్రియాసిద్ధి స్సత్వే భవతి మహాతాం నోపకరణే'. మహాత్ముడంతటి శక్తిమంతుడు, ఆయుధం చేతబట్టని జగన్నాటక సూత్రధారి, రాట్నచక్రధారి రావాలి.

ఔనూ, మరి వీడేమిటి. చిన్నప్పుడు అంత ఉద్రిక్తంగా మాట్లాడేవాడు. శుద్ధ గాంధేయుల వంశంలో పుట్టి వీడు కటిక్కమ్యూనిస్టు అయిపోతాడా ఏమిటి ఖర్మ అనుకునేవాళ్లం కూడా రాఘవుడూ నేనూ. దగ్గిరుండి చిన్నప్పుడే 'ఎక్స్‌పెరిమెంట్స్ విత్ ట్రూత్స్' చదివించా. ఆ రోజుల ముచ్చట్లు చెపుతుంటే శ్రద్ధగా వినేవాడే. ఎక్కడ ఎందుకు పెడదారి పట్టాడూ అనుకునేవాణ్ణి.

కాని ఇదేమిటి మరీ దారుణం. హింసని వదిలేసాడులే అని ఊపిరి పీల్చుకుందామనుకున్నా ఏకంగా ఎదటిపక్షంలో కలిసిపోతున్నాడేమిటీ. ఆ వయస్సులో ప్రాపంచిక సుఖాలమీద, స్టాటస్ మీద, డబ్బు ఇవ్వగలిగిన పవరుమీదా యావ సహజమేనా ఏమిటి. స్వార్థం లేకుండా బతుకు లేదన్న మాటేనా. మా తరంలో లేరా ఇలాంటి వాళ్లు. లేకేం.ఎటొచ్చీ ఇంత నిర్మొహమాటం బాహాటం లేదేమో. స్వార్థానికి ఆ రోజుల్లో డ్యూటీ, ప్రభుత్వంమీద విశ్వాసం, క్రమగతమైన మార్పు లాంటి ట్రెడిషనల్ వాల్యూన్ని తొడిగేవారు. ఇప్పుడు కవిత్వానికి లాగే స్వార్థానిక్కూడా దిగంబరత్వం సహజమైపోయిందేమో.

అన్ని సంప్రదాయాలూ చెప్పే మాటేమో 'పరుల కొరకు జీవించే ప్రతి మనిషీ పరాత్పరుడు'. కాని Ayn Rand మతమే ఎక్కడచూసినా 'తనకొరకే తపనపడే తత్పురుషుడె సత్పురుషుడు' అన్న భావం ఇవాళ్టి జీవితానికి సరిపోతుంది.

ప్రయివేట్ వ్యూస్ బికేమ్ పబ్లిక్ బెనిఫిట్స్. ఎవడిమటుకు వాడు స్వార్థం చూసుకుని లాభాలు పెరగడానికేనా ఉత్పత్తిని పెంచితే ఆ వ్యాపకంలో ఎథికల్ వాల్యూస్‌కి, నీతి నిజాయితీలకి ఏమాత్రం ప్రమేయం లేకపోయినా దేశం మొత్తంమీద ఉత్పత్తి పెరుగుతుంది. ఉత్పత్తి పెరిగితే జనాభాలో ఒక్కొక్కడికీ కోసిచ్చే కేకుముక్క ఇంకాస్త పెద్దదౌతుంది. వ్యక్తిగత స్వార్థం అనుకోకుండా ఆశించకుండానే సామూహికలాభం కలిగిస్తుంది. ప్రయివేట్ వ్యూస్ బికేమ్ పబ్లిక్ బెనిఫిట్స్. ఉత్పత్తి పెరగడానికి డబ్బుపెట్టిన వాడు దానిమీద ఆదాయం పెరగడానికీ, పెరిగిన ఆదాయం అనుభవిస్తానూ ఎన్ని ప్రయివేట్ వ్యూస్‌కి తావిస్తేనేం! ఏవిటీ అవకతవక తర్కం· నిజంగా ప్రతి ఒక్కడికీ అందులో కడ బంతివాడికి ఇదివరకటి కంటే పెద్ద ముక్క దొరుకుతుందా. దొరుకుతోందా. లేకపోతే ఇది ఒట్టి గ్రాస్ నేషనల్ ప్రాడక్ట్ భజనదారుల కుహనా వాదమా. అయ్యా పోనీ నిజంగానే కాస్త పెద్ద ముక్క ప్రతివాడికీ దొరుకుతోందనుకుందాం. కాని ఇంత అవకతవక అస్తవ్యస్తపు సాంఘిక సూత్రం ఆధారంగా కాస్తో కూస్తో స్థిరత్వం, నిలకడా కలిగి, కొంతవరకేనా అందరికీ ఆనందమయం అయిన సంఘం నిర్మించుకోవచ్చనిపించడం లేదే మరి

ఇది తర్కంలో లోటా. మనుషుల్లోనా.

'ఫెయిర్ ఈస్ ఫవుల్ ఎండ్ ఫవుల్ ఈస్ ఫెయిర్' అంటాడు లార్డ్ కీన్స్ లాంటి మేధావి. ప్రస్తుతం ప్రపంచానికి నైతిక సూత్రాల అవసరం లేదు. ఫవుల్ ఈస్ ఫెయిర్. అందిన కాడికి దొరికించుకో. అనుభవించు. నువ్వూ నీ వాళ్లూ· ఫెయి ఈస్ ఫవుల్. నువ్వొంటరిగాడివైపోతావురా అబ్బాయ్. తాతయ్య లార్డ్ కీన్స్ చదవలేదు. ఇంగ్లీషే రాదు. అయినా కీన్స్ కంటే ముందే ఇచ్చాడు నాకు వార్నింగు. ఫవుల్ ఈస్ ఫెయిర్. 'చక్కని రాజమార్గ ముండగ సందులు దూరనేల ఓ మనసా'. పిచ్చి త్యాగ రాజా నీకేం తెలుసయ్యా. నువ్వేం భోగరాజువా ఏమిటి మాపట్నాభి గారు చమత్కరించినట్టు. సందుల్లోనేనయ్యా బేరాలు దొరికేది.

అందులో నల్ల చీకటి బేరాలు. అందులోఉన్న మజా రాజమార్గంలో ఎక్కణ్ణించొస్తుందయ్యా. చిక్కని పాలు మీగడ చిక్కుతాయను కుంటున్నావు పాపం. రాజమార్గంలో దొరికేవి మీగడ తీసేసిన నీళ్ళపాలే చేయను గంగా సాగరం కాదు. హాయను నవాసారం, సారాయం నసాళం.

'బాబాయ్‌–ఆ వారగా మడతమంచం వేస్తాను, నడుం వాల్చ రాదూ'. నడుం వాల్చక చేసేదేముంది. అరవై ఏళ్ల క్రితం నా బందో అని అన్నివిషయాలూ నాకే కావాలని నడుంకట్టి రంగంలో దూకాం. ఇప్పుడు నడుం పడిపోయింది. వాల్చక !

తాతయ్యా పడుకున్నావా. ప్రసూనా నేనూ దణ్ణంపెడదా మని వచ్చాం. ఆశీర్వదించు. 'దీర్ఘసుమంగళీభవ'. సుఖంగా నూరేళ్లు బతకండి నాయనా. ఏం తాతయ్యా కళ్లల్లో నీళ్లు కనబడుతున్నాయి. ప్రసూనా లోపలికెళ్ళు. నేను తాతయ్యతో మాట్లాడాలి.

నేను దేవతల పక్షం వదల్లేదు తాతయ్యా. కచుడు, మృత సంజీవని కథ చెప్పేవాడివి కదూ నా చిన్నప్పుడు.

..............................

..............................

..............................

నేను ఒంటరిని కాదు తాతయ్యా.

# ఆనంద కందము

## శ్రీ బులుసు వేంకటేశ్వరులు

శ్రేయము లొసంగి విజయసంసిద్ధిఁ గూర్చి
లాభము సుఖంబు సమకూర్చి క్షోభఁ బాపి
నీతి నియమంబు సద్ధర్మనిచయ మొసఁగు
సుందర కవిత్వ మానందకంద మెందు.

పరమ పావన నిరుపమ భారతీయ
సంస్కృతికిఁ బ్రతిబింబమై సత్యధర్మ
నిస్తుల జ్ఞాన సంపద నిలుపఁగలుగు
సుందర కవిత్వ మానందకంద మెందు.

శబ్ద పరిపుష్టి భావసౌష్ఠవము వ్యంగ్య
వైభవము రీతి సంపద ధ్వని విశేష
మ సము సుమపేశల సుశయ్య నతిశయించు
సుందర కవిత్వ మానందకంద మెందు

సౌరు మీఱెడు రాయంచ చందమునను
మంధగమనంబున నమందమాధురియును
పదముల మయూర నృత్యంబు పరిఢవిల్లు
సుందర కవిత్వ మానందకంద మెందు.

పచ్చ కప్పుర పలుకుల వాసనలును
సన్నజాజుల గుమగుమల్ చంపకసుమ
పరిమళంబులు కలువలపస యొసంగు
సుందర కవిత్వ మానంద కంద మెందు.

మంద మలయ మారుతమందు మలయు చలువ
కచ్చ పీతంత్రుల జనించు కోమలాస్య
మమర మందారమందలి యమృతము గల
సుందర కవిత్వ మానంద కంద మెందు.

అలఁతియలఁతిగ నాజూకు లన్ని వెలయ
శుభకరంబు లలంకార శోభ లెసఁగ
నానుడులు సామెతల్ కదు నలువెసంగు
సుందర కవిత్వ మానందకంద మెందు.

నవనవఁబుగ వికసించు ప్రవిమలములు
పద్మ దళములు శబ్దముల్ భావసూత్ర
సంగథిత రత్న మాలికా చందమందు
సుందర కవిత్వ మానందకంద మెందు.

దివ్య సుందరి శారదాదేవి పూజ
విహిత నిష్కామ భక్తిఁ గావించుటకయి
ఆత్మ సంతృప్తియే ఫలమై చెలంగు
సుందర కవిత్వ మానందకంద మెందు.

# చంద్రగూడు

## శ్రీమతి సి. విజయలక్ష్మి

నీరెండలో చినుకులు ఆణిముత్యములుగ తోచి
స్ఫటికములై వర్ణరహితములై మెరిసినవి.
పరవశించిన ప్రకృతి వర్ణసంక్రమాన్ని కలబోసి
సప్తవర్ణాల ఇంద్రధనుస్సులో అమర్చింది

ఇరుశిఖరాల మొనలపై ధనువు ఏర్పడి
కృష్ణానదీ శీకరాల అల్లెత్రాడు పదే పదే
ప్రేయసీ ప్రియుల సరస సల్లాపములను ప్రేరేపించి
ఉత్తేజపరుస్తూ "ప్రియా" సంబోధనమే
ధనుష్టంకారముగ మ్రోగిస్తున్నది!

పగలబడిన ప్రకృతి పరవశించి జాతి బేధం
లేకుండా జిల్లేడు పూగుత్తులను సయితం
విరిబాణాలుగా సంధించి, గమ్యం తెలియక
ప్రణయానికి దరీ, పరిమితీ లేవని తెలిసి
శూన్యంలోకి రసిక హృదయంగా గురిపెట్టి
వదిలితే, వలపుల తలపుల జల్లుల వన్నెలే
చంద్రగూడు!

సరసన లేని ప్రియుని—ప్రియ వాల్లభ్యమును
తలపోసి, శరాఘాతాలను తట్టుకొనలేక బేలనై,
అరమోడ్పుల అందాలను తనివితీరా తిలకించాలని
కనులు తెరచిన నాకు "ప్రకృతి అపూర్వ
సౌందర్యరాశి" అని

ఆరాధిచాను. ప్రకృతి అందాలను — బంధాలను
గుప్తంగా గుప్పెడు హృదయంలో భద్రపరచాలని
పూనుకున్నాను ఆ పూనికను కనికట్టు వేసినట్లుగా
లీలగా గోచరించింది ఒక ఆకృతి—నే కలకంటున్న స్మృతి!

ఎవరో తెలియక భయక్రాంతనై
అరుదెంచినదెవరో తెలిసి పరవశనై
ఆనందంలో ఉక్కిరి బిక్కిరైన
ఆ క్షణం నా కళ్ళలో — ముఖంలో — తనువులో
కోటి హరివిల్లులు ఒక్కసారిగా వెలిగి
కిరణ సహస్రాలనేకం ఏర్పడితే,
మా ప్రేమ సరాగాలను జతచేసి
అల్లుకుంటే, జిలిబిలి పొదరిల్లు చంద్రగూడు!
— నవ్వులతో పూలజల్లుగా!



సాంధ్యశ్రీ

# సంప్రదాయం ప్రగతి వ్యతిరేకమా-3?

## 1

"కమ్యూనిష్టు వివరంలోంచి వస్తే తప్ప ప్రపంచంలో సాహిత్యానికి ముక్తి లేదనే" ఒక వాదం ఉందనుకుందాం. ఇది వివిధ సిద్ధాంతాలలో ఒక సిద్ధాంతం. ఒక వైశాల్యాన్ని ఒక చిన్న రంధ్రం లోంచి చూస్తే పరిపూర్ణత సిద్ధిస్తుందా?

కదిలిస్తే రక్కిస పొద నాగు వెదజల్లినట్లు—"సామాజిక చైతన్యము—సోషలిజం" అంటూ ఆవేశపడే సోదర కవులు కవిత్వం ప్రజలకోస మంటారు. ఐతే ఏ ప్రజలకోసం? 1. మందాధికారులు, 2. మధ్యమాధికారులు, 3. ఉత్తమాధికారులు. ఇలా ప్రజలను మూడు వర్గాలుగా [సోదర అభ్యుదయ కవుల అనుజ్ఞతో] విభజించుకుంటే ఏ గ్రంథం లేదా ఏ రచన— ఏ ఏ ప్రజలు స్వీకరిస్తారు—? ఒకవేళ నా వర్గ విభజన సంఘ వ్యతిరేకమైతే - ఒక జాతినో, ఒక జీవినో, ఒక రోగినో, ఒక సిద్ధాంతాన్నో మాత్రమే పరిధిలోకి తీసుకొని అల్లుతున్న తాళ్ళు మిగిలినవారికి పనికిరాని వేనే...! ఎవరి చిత్త సంస్కారాము సారంగా వారు స్వీకరిస్తారు కానీ—వినాదాలతో, కేకలతో—ఎంతకాలం, ఎందరిని పుస్తకాలను చదివిస్తారు...? ఇది కమ్యూనిష్టు సిద్ధాంతమా? [కాకపోతే తెలియ చేయండి] కాదనే భావిస్తున్నాను.

ఏ ఒక్కదేశంలో ఏ ఒక్క గ్రంథం సర్వజనామోదం పొందింది? ఆ గ్రంథ సందేశ మందరికీ శిరోధార్యమైపోయిందా? ఒకరి ప్రధాన మొకరికి ఉపసర్జనం కాదా? చరిత్ర కవిత్వ మవుతుందా? కవిత్వం ప్రజలకోసమైనప్పుడు—ప్రజకోసం చెప్పే నినాదము—ఉపన్యాసము కవిత్వంగా చెలామణీ కావాలికదా? మరి అలా జరగదెందుకని—? ఉపదేశం ప్రజకోసమైతే — మిగిలిన కవిత్వం—కవిత్వంకోసం కాదా? ఉపదేశంకోసమే బయలుదేరి ఛందోబద్ధమై కూడా "మనుస్మృతి" ఎందుకు కావ్యం కాలేకపోయింది? అందులో కవిత్వం లేదు కనుక.

ఒక రాజునో; ఒక భోగినో; ఒక యోగినో; ఒక నాయికనో—వర్ణించి [పైగా అంగాంగ వర్ణనట; కచ, కుచ ఏవి దొరికితే అవి వర్ణించారటగా?] న ప్రబంధ పురాణ కవులందరూ తప్పకుండా సిగ్గులేని వారే...ఎప్పుడు..? ఒక ఎర్ర జెండానో, ఒక పిల్లిగడ్డం గాడ్నో, ఒక రాజకీయ నంగి వెధవనో, ఒక సిద్ధాంతం మార్క్సుగాడ్నో ఆకాశానికెత్తే ఎంగిలిమూతులు నాకే నంగిమాటల కవులున్నంతవరకు. ఇలా ఈ ధోరణి ఎన్నో సమస్యలను సృష్టించుకొంది. అప్పుడు—ఇప్పుడు—ఎప్పుడూ— తలలెత్తే ఈ ప్రశ్నలకు సంప్రదాయం జీవనాళిక అయింది. సమాధానమైంది.

## 2

"కర్ణంగతం శుష్యతి కర్ణ ఏవ సంగీతకం సైకతవారి రీత్యా
ఆనందయత్యంతరను ప్రవిశ్యసూక్తిః కకాదేవసదా సుగంధా"

ఇది సంగీత—సాహిత్యాలమధ్యగల భేదం. రెండూ ఆనంద కారకాలే. ఐతే ఇక్కడ సూక్తి [సాహిత్యం]కి ఉత్కృష్టత ఆపాదింపబడింది. స్మరించేకొద్దీ ఈ సాహిత్యం సర్వతోముఖంగా భాసిల్లి ఒక మనస్సులో ముద్రపడిపోతుంది. సాహిత్యశబ్దం వచ్చింది కాబట్టి—కవి కనిపిస్తాడు. ఎవడు కవి-? అనే ప్రశ్న మళ్ళీ పుట్టాలి.

ఎవడు తనమీది తన వ్యామోహాన్ని ప్రజలద్వారా, వాళ్ల కరతాళ ధ్వనులద్వారా ఎక్కువ చేసుకొని సంబరపడి పోదామని అనుకోడో—అట్టి ఒక యోగ్యుడు. ఆ మంచివాడు కవి, సంసారంలో పడాలి. ఏ శిల్పమహత్యం, ఏ శబ్ద సౌందర్యం; ఏ శిల్పమహత్యం; ఏ నాద మాధుర్యం ఎవడినుండి ఎంత నేర్చుకోవటానికి ఎంత వీలుంటుందో — ఆ సంస్కారవంతుడి చిత్త ఔన్నత్యంలోంచి [ఇక్కడ మళ్ళీ త్రివర్గాలు తలెత్తుతాయి] ఈ కవి జన్మిస్తాడు మహాకవిగా. ఆ కవి సృష్టిలో (తన పరిధిలేని) ప్రపంచాదర్శ, సంస్కృతీ సంప్రదాయాలు పుట్టుకొస్తాయి. ఆ కవిత్వంలో యజ్ఞ, దాన, తప, త్యాగములనే నాలుగు మూలస్తంభాలుంటాయి. దేశం సర్వం ఆ స్తంబాలపై ఆశీనమవుతుంది కవిసృష్టిలో.

ఇతఃపూర్వం దేశమంటే మట్టి అని ఏ పూర్వకవి అన్నా చెప్పాడేమో వాడి నోట్లో గడ్డి పెట్టండి. కనుక ఈ తపస్సు— ఈ ఉపదేశం; జనమైన దేశం—కాదు ప్రపంచంకోసం. ఇంకా కవిత్వం వేరే ప్రజలకోసమంటారా? [ఇంత కారం కొట్టండి ప్రజల కళ్లలో ఓ అభ్యుదయ కవులారా! మీరు.]

అది జీవిత లక్ష్యాన్ని వదలి జీవన వృత్తిని అవలంబించటం. ఇది తప్పని సంప్రదాయం చెపుతుంది.

"పుంఖాను పుంఖ విషమేక్షణ తత్పరోపి
బ్రహ్మేవలోక నధియ నజహాతి యోగీ
సంగీత తాళ లయ నృత్త వశంగతోపి
మౌళిస్థ కుంభ పరిరక్షణ ధీర్నటీవ"

''వౌళి స్థకుంభ పరిరక్షణ'' జీవితలక్ష్యం. మిగిలిన వ్యవహారమంతా జీవనవృత్తి. సాహిత్యంలో రచన జీవన వృత్తి. మరి లక్ష్యం...?

ఒక అధికారము; అద్దానిని నిల్పుకొను నేర్పు; ఔచిత్యము యొక్క తీర్పు లోకజ్ఞత్వము సంప్రదాయశుద్ధమైన భావనాపటిమ; ఇవి యొనగూర్చుకొన్న విశ్వశ్రేయో భావముగల ఒక ఫలసిద్ధి. ఇది లక్ష్యమైనచో — వెరపేల? ఇది సంప్రదాయ విరోధుల మూలధనము. ఇది స్వతస్సిద్ధము. వస్తువును వస్తువుగా చెప్పుటకు ప్రజ్ఞ కావలెనా? శిల శిల్పమగుటకెంత శ్రమజరుగవలెను? ఒక్కొక్క సుత్తి దెబ్బ ఒకొక్క భావరేఖ. ఇది కళాత్మక ప్రేరకమైన రస ధుని—ధ్వని.

**"Literature is the art of images and every invasion of naked ideas or propaganda is always detrimental to the given work."**

ఇది ఎవడైన కమ్యునిష్టు చెప్పాడంటే ఒప్పుకుంటారా మన ఏ ర. స. కవులైనా? ఐతే ఇది చెప్పింది కమ్యునిష్టే!

## 3

తరాలనుండి సంప్రదాయం, చరాచర విశ్వసృష్టిలోని తత్త్వవిచారం, ఒక ధర్మవిచారం. ఇది సాహిత్యంలోకి వస్తే విశ్వశ్రేయాన్ని ఒనగూర్చుకున్న కావ్యమో; పురాణమో; ప్రబంధమో అవుతుంది. సంప్రదాయ సాహిత్య మేదికూడా సమాజాన్ని ఒక్క కోణంనుండి ఎప్పుడూ చూడలేదు—అన్ని మతాల బరువుమోసిన వస్తువు — వెంగడించిన విషయ వస్తువు—ఏదీ...? అని మనం చూస్తే సంప్రదాయ మొక్కటే నిలుస్తుంది.

''సంక్షేపాద్వాక్య మిష్టార్థ వ్యవచ్ఛిన్నా పదావళీ
కావ్యం స్ఫుటదలంకారం గుణవద్దోషవర్జితం''
(అ. పు.)

గుణములచేత—అలంకారములచేత, యుక్తమై—దోషవర్జితమైన ఇష్టార్థ ప్రతిపాదితము — కావ్యము. ఇది కదా సంప్రదాయము. ఇందులో అధునికుల కభ్యంతరమైన ప్రగతి విరోధమేమి గలదు—?

వేద వాక్యములకు మంత్రము అని అసాధారణ నామము. మంత్రమనగా పునఃపున రనుసంధానము, మననము చేయదగినదని.

''మననాన్మంత్రః'' ఇది పరం పరాగితమై సంప్రదాయమైనది.. దీనినే జగన్నాథుడు— ''భావన'' అనే మాటలో పొదిగినాడు. ఈ ''భావన''కే మంత్రార్థము. ఏ అర్థమును పునఃపున రను సంధానము చేయుటచే లోకోత్తర ఆహ్లాదము (చమత్కారమా...?) కలుగునో అట్టి భావనా గోచరమగు అర్థమే రమణీయార్థము. ఇట్టిది కావ్యము. ఇది మాన్యత కావ్యము. ఇది వేద కావ్యము. అప్పుడు అలంకారిక కావ్య లక్షణము వేద కావ్యమునందు కూడా సంగతమే అగును. కనుక ''కావ్యం ఛందః'' అను శ్రుతి ప్రమాణము ననుసరించి; కృత్స్న వేదము కావ్యమని చెప్పనగును. ఇట్టి దానిలో—ప్రగతి వ్యతిరేకముండునా ?

''పశ్చాత్పురస్తా దధరా దుదక్తాత్ కవిః కావ్యేన పరిపాహి రాజన్
సఖే సఖాయ మజరోజ రిమ్ణే౽గ్నేమర్తాగ్ం అమర్త్యస్త్యంనః''

ఓ రాజా! [రాజో—మంత్రో—లెనినో—మార్క్సో ఎవరైతేనేం] క్రాంతదర్శనుడవై కవి వగు నీవు నీ కావ్యముతో నలువైపుల చెలరేగే అరిష్టాల నుండి, ఉపద్రవాల నుండి కాపాడి; ఓ స్నేహితుడా జరారహితడవైన నీతోను, నీ కావ్యముతోను, సఖ్యమొనర్చే నన్ను కూడా [పాఠకుడ్నా?] జరా రహితుడ్ని చేయి అమర్త్యుడవై—నన్ను అమరుడ్ని చేయి.

ఇంత మాత్రం సమ సమాజ స్థాపనావకాశం ఏ కవి ఇస్తున్నాడండీ...? ఇదిమన సంప్రదాయంకాబట్టి పనికిరాదందునా...? ఇది ఒకజాతి గుత్తకు తీసుకొన్నది—ఒక వర్గంచేత అధ్యయనం చేయబడింది—కాదుకదా—? వేదం — కాపీ రైటు హక్కుల్లేని — ముష్టివాళ్ల నోట్లో నుంచి (ఉపాదనం బ్రాహ్మణ వృత్తి కదండీ) వచ్చింది...అన్నంపెట్టి మరీ చెప్తారు.

అచ్చు వేయించుకొని — డబ్బుకు అమ్ముకున్న అభ్యుదయ కవిత్వం ఎక్కడా కూడా పట్టెడన్నం పెట్టిన దాఖలా లేదండి. పాపం పద్యాల్లో నా సోదర కవులు పేదల కడుపులోని మంటను — [వర్ణించకుండా — అలంకార రహితంగా — నగ్నంగా]- బట్టలువిప్పి చూపిస్తున్నారు. ఎంత పేద కవులు? వారికి నా సెల్యూట్!

## 4

''అకర్దమ మిదం తీర్థం భరద్వాజ నిశామయ
రమణీయం ప్రసన్నాంబు సన్మనుష్య మనో యథా''

పోలికలు—[అలంకారాలు] తీసివేస్తే మిగిలేవి నీళ్ళు; మనిషి.

నీళ్లను గురించి ఏమి చెప్పవలె? మనిషిని మనమెరుగమా? ఈ వాల్మీకి ఇదేదో విషయాన్ని కొత్తగా చెప్పినాడా? త్రికశుద్ధిగల మానవుని బోలిన నీళ్లను చూపినాడా? స్వచ్ఛతమములైన నీళ్లను బోలిన మానవుని చూపినాడా...? ఇది సంప్రదాయము. ఇది ప్రగతి విరోధమా?

''ఆపోహిష్టా మయో భువః .........
(ఇత్యాది)

ఇంత సంప్రదాయ మిట్లు వాత్సల్యంతో సర్వాన్ని స్పృశిస్తున్నది కదా.. ఇది ప్రగతి వ్యతిరేకమా- ?

ఈ సంప్రదాయం తరతరాల నుండి ఒక్క వ్యష్టి ప్రయోజనాన్ని మాత్రమే కాదు —సమిష్టి సిద్ధాంతాన్ని విడమరిచి లోకానికిచ్చింది.

అనుభవ పరంపర నుండి జీవితాన్ని జీవితంగా మలచినవారు జీవిత మర్మం తెలిసినవాళ్ళు, వివేకంతో సారాన్ని గ్రహించినవారు, పరిశీలించిన పరమార్థం సంప్రదాయం ఒక విచికిత్స జిజ్ఞాస, యియాస ఇన్ని-ఎన్నిటినైనా సంప్రదాయం ముడివిప్పి చెప్పుతుంది.

మాటనేర్వని పసితనమున శిశువులు...''తత...తా...త...'' అనుటయు మన మెరిగినదే. వర్తమానాభిమానులు, సంప్రదాయ దూరులు, శిశువు ఉచ్చరించిన ఆ శబ్దముల రహస్యమేమైనా గుర్తించినారా? లేదనుకొనిన.. బృహస్పతి ''బృహస్పతే'' అని స్వాత్మను సంబోధించి ఇలా అన్నాడు :

''తొలుత శబ్దములు తెలియక పూర్వమే శిశువు ఉచ్చరించిన తత, తాత శబ్దములు వాచోగ్రము-వాగగ్రము. అట్లా ఉచ్చరించే ఆ శిశువులను చూడు. శ్రేష్ఠము, పాపరహితమునై, నిగూఢముగా నున్న ఈవేదార్థజ్ఞానము, వేదాభ్యాసకాలమున ఆవిర్భూతమగును''

ఈ తత...తాత శబ్దముల రహస్య మేమిటిట ? ఈ తత, తాతే త్యాది శబ్దములు ''తత్'' శబ్దమున కుపలక్షకములై తచ్ఛబ్ద వాచ్య పరమేశ్వర ప్రతిపాదకములు.

ఇది సంప్రదాయ సిద్ధాంతం. ఇది జీవిత పరమార్థ సాధనకు మాత్రమే రూపొందబడినది. ఇది మనకు తెలియకుండానే మనలను నడిపించగల ఒకానొక మహదైశ్వర్యము. వరము.

జీవన వృత్తిని అనుసరించే తరుణంలో ఏ లక్ష్యన్నైతే విడువరాదో-అది సంప్రదాయం. ''ఆ కీర్ణం ఋషిపత్నీనాం ఉటజ ద్వారారో దిభిః అ పత్యైరివ నీవార భాగధేయోచిత్తైః మృగైః'' అనే మాటల్లోని మహిమాన్వితములైన అర్థ సంపత్తిచేత సంప్రదాయం ప్రయుక్తమౌతోంది. మనం ఏ సంపదను తర తరాల నుండి, యుగయుగాల వరకు అనుభవించదలచామో అది సంప్రదాయమే. ఇది వేద ప్రసాదం. సర్వ శిరోధార్యం అర్థమూ అధికారము కాదు; అంతర్జ్యోతిని వెలిగించగలగటం సంప్రదాయం. ఇట్టి సంప్రదాయం మనదైనందుకు గర్వించాలి. దానిని మనం మననం చేసుకొని – ఆచరించాలి.

---

# అజాగళస్తనస్సేవ

## ఉమ్మెత్త

నా యింటికి
వెన్నెల
సున్నం కొడితే
ఎవరికి
సంబరం ?
నా యింట్లో
ఎండ
విరగ పండితే
ఎవరి కడుపు
నిండుతుంది ?

నేను
పడుకొనే
చోటుకి
వాన
వచ్చేమాట
నిజమే
?
నా హృదార్చి
తీరుస్తుందా !

శ్రీ నేమలికంటి ముకుందరావు

# "అనంతవర్మదేవుని తాండ్రంగి శిలాశాసనము"

తాండ్రంగి గ్రామము విశాఖపట్నం జిల్లా శృంగవరపుకోట తాలూకాలో కొట్టాము గ్రామము నానుకుని, జామి గ్రామమునకు షుమారు 6 మైళ్ల దూరమందు కలదు. సదరు ఆ గ్రామములో ఒక శిలాశాసనము కలదని బ్రహ్మశ్రీ అవసరాల సుబ్రహ్మణ్యం గారు నాకు దయతో తెల్పిరి. కొట్టాము గ్రామమందు చోళేశ్వరాలయమందు కూడ ఒక శిలాశాసనము కలదని తెల్పిరి. వారికి నా కృతజ్ఞతలు. ఈ రెండు శాసనములు అర్వాచీన తూర్పు గాంగ చక్రవర్తియైన అనంతవర్మదేవుని వీరుసగా 5 మరియు 70 వ రాజ్య వర్షకాలమునాటివి. అందు కొట్టాము శాసనము 70వ రాజ్య వర్ష కాలము నాటిది. దానిని రాష్ట్ర పురావస్తు శాఖ 'ఎపిగ్రాఫియా ఆంధ్రికా' 5 వ సంపుటమునందు ప్రకటనకై పంపబడింది. ప్రస్తుత శాసనము రాష్ట్ర పురావస్తు శాఖ డైరెక్టరు గారి అనుమతితో 'ఆంధ్రప్రదేశ్ హిష్టరి కాంగ్రెసు' మూడవ సభలో ఆంగ్లములో చేసిన ప్రసంగమునకు తెలుగు అనువాదమును ప్రకటించు చుంటిని.

తాండ్రంగి శిలాశాసనము నునుపు తేల్చని బండపై క్రీ.సం|| 11–12 వ శతాబ్దుల నాటి కళింగములో వాడబడు తెలుగు లిపిలో 20 బంతులలో చెక్కబడెను. కాని యీ బంతుల వరుస క్రమము లేనివై యుండుటచే చదువుట కొంచెము కష్టముగ తోచును. భాష అంతయు తెలుగు. శకవత్సరముల సంకేతములు, దాతపేరు తెలుపు ప్రారంభ శ్లోకము, వ్యాస గీతములు మాత్రము సంస్కృతము. లిపి ప్రత్యేకతలు ఏమియును లేవు. భాషా విశేషములు కూడ లేవు. కాగా లేఖక ప్రమాదములు 2 వ బంతిలోని 'వియచ్చంద్ర' కు బదులు 'వియశ్చంద్ర' సంధి నియమము పాటించకపోవుట తప్ప యితరత్ర చెప్పదగిన విశేషములు లేవు.

## శాసన విషయము :

''గొథామ తీర దేశమందున్న తాండ్రంగి గ్రామములో శ్రీ వాసుదేవునకు 'బిరుదరాజ భయంక్కర' మరియు 'సమరార్జున' బిరుదాంకితుడైన కాటయ పడాలు తాండ్రంగి మహాజనాలకు గ్రామణియైన కృష్ణని నుంచి పుట్టెడు పండు భూమినికొని ఆ దేవునికి అఖండ దీపము నడుపుటకు అనంతవర్మదేవుని 5 వ రాజ్యవర్ష కాలమందు కన్యామాస శుక్లపక్ష ద్వాదశితిథి శుక్రవారము నాడు ఏర్పాటు చేసినట్లు'' తెల్పును.

## వర్ణనీయాంశములు-శాసన కాలము :

కళింగము నేలిన అర్వాచీన తూర్పుగాంగ చక్రవర్తి అనంత వర్మచోడగంగడు శ. సం. 999 లో రాజ్యమునకు వచ్చినట్లు అతని తామ్ర శిలాశాసనములు[1] తెలియచేయును. ప్రస్తుత శాసనము అతని 5 వ రాజ్య సంవత్సరమందు చేసినట్లు చెప్పబడెను. అనగా శక సంవత్సరము 1004 నాటిది. కాగా అస్పష్టమైన శక సంవత్సరము తెలుపు సంకేతము లుండుటచే యివ్వబడిన శక సంవత్సరము తెలియుట లేదు. కాని వందల సంఖ్యను సూచించు సంకేతములు 'వియచ్చంద్ర' మాత్రము స్పష్టముగా తెలియుచున్నది. కాని శాసనములో నివ్వబడిన 5వ రాజ్యవర్షములో తిథి, వార, మాసముల ననుసరించి దానికి సరిపోవు ఇంగ్లీషు తేది శుక్రవారము, 17వ సెప్టెంబరు 1081 అని తెలియుచున్నది అనగా శ. సం. 1003 అనంతవర్మ రాజ్యమునకు వచ్చిన సంవత్సరముతో కలుపుకొని చూచిన 5వ సంవత్సరమునకు సరిపోవుచున్నది. యీ తిథి వార మాసముతో కూడిన దినము బహుశ వైష్ణవులకు పరవడిదిగా తోచును.

అనంతవర్మ దేవుని ప్రథమ కుమారుడైన మధుకామార్ణవుని కాలమందు — అనగా శక సంవత్సరము 1075 లో–పొన్నమ కుమారుడు కళింగదేశ నివాసియునైన కాటమ పడాలు ఖిలోరు గ్రామ 'సాధుప్రజ' నుంచి 5 మాడలకు భూమినికొని ఆ భూమిని ఖిలౌదేశ్వరస్వామికి తన మాతామహుల పుణ్యము కొరకు అఖండ దీపదానము చేసినట్లు తెలియును [2]. కాని ప్రస్తుత తాండ్రంగి శాసనములో నగుపడు కాటయ పడాలు, యితను ఒకరేనా అని సందేహము కలుగును. కాని మనకు తగు ఆధారములు లేవు. కాగా కాటమ పడాలు వునికి 'కళింగ దేశము' మరియు 'మాడ పడాలు' అను తెలుగు పదములు పై నాగరి శాసనములో ఉపయోగించుటను బట్టి, ఆ శాసనపు పరిష్కర్త ఆచార్య సర్కారు పండితులు, కాటమపడాలు బహుశ కళింగదేశమందున్న ముఖలింగము ప్రాంతపు వానిగా భావించెను. అటులయిన ప్రస్తుత కాటయ పడాలు, ఖిలోరు

శాసనపు కాటమ పడాలు ఒకరే అయివుండవచ్చుననియు మరియు అనంతవర్మదేవుని కాలమునుంచి అతని కుమారుడు మధుకామార్ణవ దేవుని కాలము వరకు గాంగ చక్రవర్తుల సేవలోనుండి పై దానములు చేసెననుటకు నిదియొక ఆధారము. లేనిఎడల ప్రస్తుత కాటయ పడాలు, శ్రీలోరు శాసనపు కాటమ పడాలునికి ముందు తరమువాడై తాతగా అభిప్రాయపడవచ్చును.

## శాసన ప్రాముఖ్యత :

1) అనంతవర్మదేవుడు అతని పూర్వీకులు శైవమతావలంబులు. మహేంద్రగిరి శిఖరమందున గోకర్ణస్వామి భక్తులు, అనంతవర్మదేవుడు శ. సం. 1040 కి ఏ కొద్దిముందుగనో తదుపరినో వైష్ణవ సంప్రదాయమును ఆచరించి, ప్రజలలో దానిని ప్రోత్సహించినట్లు పలువురు చరిత్రకారుల అభిప్రాయ . కాని ఇప్పటివరకు లభ్యమైన అతని తామ్ర శిలాశాసనములు ఏఒక్కటి అతనిని పై తేదికిముందుగా వైష్ణవావలంబనుడుగా తెలియచేయుట లేదు. కాగా ప్రస్తుత శాసనము ఆ విషయమును గూర్చి తెలియజేయుటనూ లేదు 'బిరుద రాజభయంకరుడు' మరియు 'సమరార్జుని'గా పేరెన్నికగన్న అతని సేనాని 'కాటయ పడాలు' శ్రీ వాసుదేవునికి అఖండ దీపమునకై తాండ్రంగి మహాజనములచే పుట్టెడు పందు భూమిని తీసుకొని దానిని ఆ దేవునికి ధారలుపోయుట మూలమున అనంతవర్మదేవుని ప్రారంభ రాజ్యకాలములో పరమత సహనమున్నట్లు చెప్పక చెప్పనని రుజువుచేయును. యీ కాలమందు భాగవత మత ఆచారక్రమములో ఒక భాగమైన శ్రీ వాసుదేవుని పూజాదికములు తెలుగు కళింగ ప్రాంతమందు క్రీ శ. 11వ శతాబ్దిలో ప్రజాదరణలో నున్నట్లు చెప్పవీలగును. హరేకృష్ణమహతాబు పండితులు కృష్ణ–వాసుదేవుని ఆచార క్రమమును; పూరిజగన్నాథ మత ఆచారక్రమమును వేరుగనూ,[3] ప్రతాప్ ముఖర్జీ[4] మొదలగువారు యీ రెండింటని ఒకటిగానే అభిప్రాయపడుతున్నట్లు తెలియును.

2) యీ శాసనము ద్వారా మనము మొదటి సారిగా కళింగ దేశమందున్న 'గోధూమ తీరదేశ' మను భౌగోళిక భాగమును చూడనగును. యీ తీర దేశములోనిదే తాండ్రంగి గ్రామము. 'గోధూమ తీర' అనగా గోధూమ నదీతీర ప్రాంతము. శ. సం. 1067 నాటి అనంతవర్మదేవుని జామి శాసనమందు 'గోస్థలి' నది ఒడ్డున నున్న జామి అగ్రహారమును తెలియచేయును.[5] కాని యీ 'గోస్థలి' ఆ 'గోధూమ' నదులు ఒక్కటే అవునో కాదో మనకు తెలియదు. కాని ప్రస్తుతము జామి గ్రామమునకు అతి సమీపమందు ప్రవహించుచున్న 'గోస్థలి' నది వునికిని బట్టి ఆ రెండు పేర్లు 'గోధూమ' 'గోస్థలి' ఒక్కటేననియు, ఆప్రాంతమును ప్రస్తుత శాసన కాలము నాటికి 'గోధూమ తీరదేశ' మని ప్రత్యేక పరిపాలనా ప్రాంతముగా పిలువబడెనని నా యూహ.



"తాండ్రంగి శిలాశాసనము"

పైన చెప్పబడిన అనంతవర్మదేవుని 70 వ రాజ్యవర్షపు కొట్ఠాము గ్రామశాసనమందు, కొట్ఠాము గ్రామము ఏఱదపంపుకు సంబంధించినదిగాను, జామినాడుగట్టుకు ఆనుకుని వున్నదిగాను మరియు వసంతర భూమిలో నున్నట్లు చెప్పబడెను.[6] ఏఱద పంపు అదే పేరున గల విషయములోని అంతర్భాగము[7] ఏఱద అను మాట బహుశ తెలుగులోనిదని తెలుపు మాట ఏఱు ననుసరించి ఏర్పడిన భూభాగముగా తోచును. అటులైన యీ ప్రాంతములోని 'ఏఱు' 'గోస్థలి' లేక 'గోస్తని' లేక 'గోధూమ' గా తెలియును. ప్రస్తుతము గోస్తనీ నదీ ప్రవాహమును యీ పరిసర ప్రాంతమందు చూడనగును కనుక గాంగ శాసనములలో మనకగుపడు 'గోధూమ తీర' లేక 'గోస్థలి తటిల' లేక 'ఏఱద' విషయ మరియు పంపు — యీ పేర్లన్నియు ఏఱు ననుసరించి ఏర్పడినవిగా తోచును. యీ విషయము ప్రస్తుత విశాఖ జిల్లాలోని విజయనగరం శృంగవరపుకోట తాలూకాలకు సంబంధముండునట్లు తోచును.

3) 'గోధూమ తీరదేశ' పదము మనకు 13 వ శతాబ్దిలో కాకతీయ రాజులచేత హతముగావింపబడిన 'అర్వాచీన గాంగ చక్రవర్తుల వీరుని బిరుదును' జ్ఞప్తికి తెచ్చును. కాకతి గణపతిదేవ చక్రవర్తి (క్రీ. సం. 1199–1261) సైన్యాధిపతులగు అయ్యకులమునకు చెందిన జాయపనాయకుడు

మరియు రేచెర్ల సామంతుల సేనాని రాజె నాయకుల ద్వారా 'గోధూమత్రాటి' బిరుదు వహించిన వీరుని బొక్కెర యుద్ధమందు తల నరికినట్లు తెలియును.[8] కాని 'గోధూమత్రాటు' ఏ ప్రాంతపు వాడయింది సమాచారము తెలియదు. కీ. శే. నేలటూరి వెంకట రమణయ్యగారు యీ చంపబడిన 'గోధూమత్రాటు' కళింగమును పాలించిన అర్వాచీనగాంగ చక్రవర్తియైన ముమ్మడి రాజరాజు సామంతునిగా భావించిరి[9] కాని ఆ 'గోధూమత్రాటి' బిరుదాంకితునికి యీ 'గోధూమ తీరదేశము'కు ఏ సంబంధముందీ ప్రస్తుతము చెప్పలేము, కాని క్రీ. శ. 13వ శతాబ్దిలో వధించబడిన 'గోధూమ త్రాటి' లేక అతని పూర్వీకులు యీ ప్రాంతపువారై యుందురని నా యూహ.

## అధోజ్ఞాపికలు

1. చూ. ముఖలింగ తామ్ర శాసనము, E. A. Vol. IV, P. 33 ff; తెంబూరు తామ్రశాసనము, Bharati, Aug. 1968 and కొర్ని శాసనము· I. A. Vol. 18·
2. చూ. E. I. Vol. XXXV, P. 115 ff
3. చూ. 'Jagannadha of Orissa' by H. K. Mahtab
4. చూ. 'Medieval Vaishnavism in Orissa' by Pratab Mukherji.
5. చూ. No. 26/75 జామి శాసనము (unpublished)
6. చూ. E. A. Vol. V P.
7. చూ. తెంబూరు తామ్రశాసనము, భారతి, ఆగష్టు 1968 and Murupava Inscription, JAHRS. Vol. 12; Appendix to History of Kalinga by R. Subba Rao, P. 23ff.
8. చూ. Hyd. Archaeological Series No. 19, P. 166ff and E. I. Vol III No. 15 and S. I. I. Vol. X No. 355,
9. చూ. Early History of Deccan, P. 606.

## శాసన మూలము[1]

1 స్వస్తి [||X] చా (శా) కాబ్దానాం సనమను (మూ) [న్యX][2]

2 వియచ్చ (చ్ఛ) ంద్ర – కన్యాశుక్ల ద్వాదశ్యాం శుక్రవా–

3 రేయ[3] బనయ తనయ శ్రీనిధి కాటనాఖ్యం [|X]

4 గోధూమత్తీర దేశో (శే X) శ్రీ భువనదలికా గ్రామ–

5 ణి తాండ్రంగి శ్రీకృష్ణ దత్తోస్తి (త్రి X) భువన భా–

6 వనద్వీప మాచంద్ర స్థాప [ం X] ం స్వస్తి శ్రీ మ–

7 దనంత్తవమ్మ౯దేవర ప్రవర్ధ౯మానవిజ–

8 యరాజ్య సంమ్వత్సరంబులు ౫ శ్రాహింగ –

9 న్య శుక్ల ద్వాదశియు శుక్రవారంబు నాండు

10 బిరుద రాజభయంక్కర సిమకా (రా) జ్జు౯న కాటయ

11 పడాలు తాండ్రంగి మహాజనము చేతంబు–

12 ట్టం (ట్టెం) డు. భూమి విడిసికొని యందుట (లX) శ్రీవాసు–

13 దేవునకు నాచంద్రాక్క౯ంబుగాను నఖండ దీప

14 ంబు యెత్తించ్చె (చె) దీ [నిX] విలోమ[4] మంబు పేసినవా–

15 రు గంగ కరుత వేయి కె (క) [విX] లలం జంపెన పడు–

16 పం [శ్చX] మ [హాX] పాతకంబు నంబ (బో)వు వారు యి (యీ) అఖండ దీ–

17 ప భూమి నడిపిన వారల పదంబుల నాతల మో

18 చి (సి) కొని యుండంగలఅు (ము X) [||X] స్వదత్తాం పరదత్తాం వా

19 జ (యో) హ రేతి వసుంధర షష్టిం వర్ష సహస్రాణి విష్టాయాం [ం X].

20 జాయతేక్రిమి [ఃX] [||X]

---

1 ప్రతిబింబము ననుసరించి

2 అనుమానాస్పదము.

3 'య' అక్షరము అనవసరమనిపించును

4 'మ' అక్షరము అనవసరమనిపించును.



# మీకు తెలుసా?

వ్యాపారదృష్టిలేని ఏకైక పుస్తక ప్రచురణసంస్థ నేషనల్ బుక్‌ట్రస్ట్, ఆంధ్రుల అభిమానానికీ, అభిరుచికీ తగిన అనేక ఉత్తమ పుస్తకాలు ప్రచురించింది. కథా సంపుటాలు, నవలలు, యాత్రా కథలు, జీవితచరిత్రలు, జానపద సాహిత్యం, విజ్ఞాన గ్రంథాలు, బాలసాహిత్యం - ఈ క్రింది సుప్రసిద్ధ రచయితల కలంనుంచి వెలువడ్డాయి.

| | |
|---|---|
| విశ్వనాథ సత్యనారాయణ | వాకాటి |
| పాలగుమ్మి పద్మరాజు | మహీధర్ |
| కొడవటిగంటి కుటుంబరావు | మాలతీచందూర్ |
| బాలాంత్రపు రజనీకాంతరావు | జానకిరాణి |
| వేదుల సత్యనారాయణశాస్త్రి | పురాణం |
| దాశరథి | కనకమేడల |
| ఇలపావులూరి పాండురంగరావు | చల్లా రాధాకృష్ణశర్మ |
| ఆయాచితుల హనుమచ్ఛాస్త్రి | అమరేంద్ర |
| తిరుమల రామచంద్ర | విద్వాన్ విశ్వం |
| పిలకా గణపతిశాస్త్రి | డి. వెంకట్రామయ్య |

## పుస్తకాలు దొరుకు చోట్లు

### ఎన్. బి. టి. బుక్‌సెంటర్

సిటీ సెంట్రలు లైబ్రరీ
అశోక్ నగరు,
హైదరాబాదు-500020.

### ఎ. పి. బి. డి.

హైదరాబాదు,
మద్రాసు,
మచిలీపట్నం.

### విశాలాంధ్ర పబ్లిషింగుహౌసు

హైదరాబాదు, విశాఖపట్నం,
అనంతపురం, తిరుపతి,
గుంటూరు, వరంగల్లు.

### నవోదయ ప్రచురణలు

విజయవాడ,
గుంటూరు.

# కలగూరగంప

## త్యాగసింహాసనం?

వేంగి చాళుక్యుల్లో రాజరాజు మాత్రమే త్యాగసింహాసన మన్న కారణం ఎవరూ ఆలోచించలేదు ఆ త్యాగి తండ్రి విమలాదిత్యుడు ఈ సంఘటన గూర్చి పండితులూ, పరిశోధకులూ ప్రత్యేకత కల్పించి వేంగి సింహాసనం అధిష్టించే అర్హత కేవల పరను మాహేశ్వర, పరమ బ్రాహ్మణ్యానిదే గాని మరో మతాన్ననుస రించిన వారికి లేదని నిర్ధారణం ఇచ్చారు

విమలాదిత్యుడు జైనమతాభిమ నియై రాజ్యపరిత్యాగంచేసి చిరమకాలం రామతీర్థంలో గడపిన చరిత్ర ఉన్నది. త్యాగకారణం తెలిసే అవకాశాల్లేవు

విజయాదిత్య రాజమహేంద్ర ఇమ్మడి అమ్మరాజు (క్రీ. శ. 945–70) వీరస్వర్గం చేరగా అన్న రాజనారాయణ దానార్ణవుడు వేంగి నేలెను. దానార్ణవుని ఇమ్మడి యుద్ధమల్ల వారసులు పద భ్రష్టుని చేయడం, జటాచోడ భీముని ఆక్రమణ—అదంతా 'అంధకారయుగం' అన్నారు రాజబంధువైన జటాచోడ భీముడు ఇటు కళింగ (గాంగ)నుండి అటు కాంచీపురం (చోళ) వరకూ అరివీర భయంకరుడు. దిక్కులేని దానార్ణవుని కొడుకులు శక్తివర్మ, విమలాదిత్యులు చోళరాజు సహాయంతో జటాచోడ భీముని నోడించి పైతృకాన్ని గెల్చుకున్నారు. శక్తివర్మ రాజైన తర్వాత వేరొక యుద్ధంలో మరణించగా విమలాదిత్యుడు దాయాదుల నోడించి రాజైనాడు. మధ్యలో కొంతకాలం అత్తవారింట (చోళరాజ్యం) ఉండడం బహుశా కళింగ గాంగులకు ఓడియుండుట. గంగులు ఆదినుండీ స్వతంత్ర్య ప్రియులు. అవకాశమున్నప్పుడల్లా స్వతంత్ర ప్రకటన—చరిత్ర ఉన్నది. వేంగిచాళుక్యులకూ, వారి మిత్ర—బంధువులైన కాంచీపుర చోళులకూ సామ్రాజ్యవాదులైన కల్యాణీ చాళుక్యులు బద్ధవైరులు. సామ్రాజ్యవాదులుగా మారిన కాంచీపుర చోళులు కొన్ని తరాలు కుంతమి చాళుక్యులతో పోరాడిన చరిత్ర ఉన్నది. బలమైన పొరుగు రాజులకు తమ కన్యల నిచ్చి వారి భర్తలు, కుమారులకు అధికారప్రాప్తి కల్గించడం చోళరాజనీతి.

విమలాదిత్యుని భార్యల్లో ఒకామె రాజరాజచోళుని కూతురు కుందవమహాదేవి. వీరి సంతానం రాజరాజు భార్య మేనమామ కూతురు అమ్మంగదేవి. వీరి సంతానం రాజేంద్రచోడ (కులోత్తుంగ చోళ) – పత్ని మధురాంతకదేవి చోళ రాజకన్య. వేంగి చాళుక్య వైభవం విమలాదిత్యునినాడే దిగజారి, కాంచీపురానాశ్ర యించిన వైనం పరిశోధకులు గుర్తించారు.

విమలాదిత్యుని మరో భార్య వేంగిలో పుట్టి పెరిగిన మేడవ మహాదేవి. ఈమె అత్తిలి ఆపంట మహామండలేశ్వర సూర్యరాజు కూతురనీ, జటాచోడ భీముని కూతురు, అతని కుటుంబానికి చెందిన కన్య అనే నమ్మకాలు. మేడవదేవి కొడుకు రాజరాజును ముప్పతిప్పలు పెట్టిన వీరవిజయాదిత్యుడు వేంగిచాళుక్య సంప్రదాయమే పాటించెను. పెదతండ్రి పేరిటివాడు ఇతని కొడుకు ఇమ్మడి శక్తివర్మ. విమలాదిత్యుని కొడుకుల గూర్చి "భారతి" వ్యాసాల్లో, నా రెండో పుస్తకం "గుడీ—గుంపా"లో చర్చించాను.

విమలాదిత్యుడు జినాభిమాని కావడంతో రాజ్యార్హత పోయిం దనే వాదం సరికాదనుకుంటాను. వేంగిచాళుక్యులు ఆదిలో జైనులు—వేంగిలో మారారు. కుబ్జవిష్ణువర్ధనుని నాటినుండి విమలాదిత్యుని పినతండ్రి ఇమ్మడి అమ్మరాజు నాటివరకూ వేంగి చాళుక్యులు జైనానికిచ్చిన దాన శాసనాలున్నాయి. పశ్చిమ గోదావరికి సంబంధించినంతవరకూ అత్తిలి, నరియంపూడి (మల్లపూడి), కలచుంబఱ్ఱు (కంచుమర్రు), చామెకాంబకిచ్చిన పోకతోటకు చరిత్ర ఉన్నది. అహింస జినాభిమానులైన రాజులు యుద్ధాలు చేసారు. వీరెవరికీ లేని అనర్హత ఒక్క విమలాదిత్యునికే కల్గించడంలో ఏదో 'మసిపూసి మారేడుకాయ' చేయడం జరిగిందా?

'కాసట్లబీసట్ల కథలు' అంటూ "మహాభారతం" ఆంధ్రీక రింప జేయడం కారణాలు మరోసారి చెప్పుకుందాం. రాజరాజు ఆంధ్రాభిమానం అనిపించదు. విమలాదిత్యునినాడు జైన—బ్రాహ్మణ స్పర్థలుండెనా? ఉన్నంతలో త్యాగం చేయాల్సిన అవసరం కనిపిం చదు. కుంతల చాళుక్యుల చేతిలో చోళుల ఘోరపరాజయం విరక్తికారణమనిపించదు.

రాజరాజు వీరవిజయాదిత్యులలో ఎవరు సరైన వారసుడో తెలియదు. రాజరాజు యువరాజు కాబట్టి జ్యేష్ఠుడన్నారు. కాని వేంగిచాళుక్యుల్లో అన్నలుండగా తమ్ములు యువరాజులు, రాజులైన చరిత్ర ఉన్నది చోళుల వత్తిడివలన రాజరాజును యువరాజును చేసారా?

విమలాదిత్యునినాడు బలమైన సామంత కళింగ రాజ్యంలో వీరవిజయాదిత్యుడు రాజప్రతినిధిగా ఉన్నందున్న రాజరాజుకన్న మిన్న అనెందుకనరాదు!

రాజరాజు పట్టాభిషేకం తండ్రి సమక్షంలో జరగలేదు. రాజరాజును అతని రాజ్యంలోనే ముప్పతిప్పలు పెట్టి మూడు సార్లయినా పదభ్రష్టునిచేసి, చివరికి తన కొడుకు శక్తివర్మను రాజు చేయగల్గెను. వీరవిజయాదిత్యుడు దీన్నిబట్టి వేంగిలో వీర విజయాదిత్యుని అభిమానించే వారెక్కువ అనిపించకపోదు. రాజ రాజుకు చోళులు, వీరవిజయాదిత్యునికి పశ్చిమ చాళుక్యులు మిత్రులు. పిమ్మటి కాలాన రాజరాజు పుత్రుడు రాజేంద్రుడు (కులోత్తుంగచోళ) వీరవిజయాదిత్యు నోడించి కూడా తన దృష్టి చోళ సింహాసనంపై ఉన్నందున వేంగిని వీరవిజయాదిత్యునికి వదలెనన్న పరిశోధకులు వీరవిజయాదిత్యుడే అర్హుడై యుండె నేమో అని ఆలోచించలేదు. చేతికందివచ్చిన, తాను రాజును చేసిన

శక్తివర్మ యుద్ధంలో మరణం, వృద్ధాప్యంలో మరో కుమారుని మరణం—ఇమ్మడి శక్తివర్మ మరణించగా జనాభీష్టంపై రాజైన వీరవిజయాదిత్యుని మరణవార్తకు కులోత్తుంగ చోళచక్రవర్తి విచారం, వృద్ధాప్యంలో పశ్చిమ చాళుక్య, కాంచీపుర చోళులతో పోరిన వీరవిజయాదిత్యుడు, సమకాలిక సమీప కాలిక వీరుల్లో మేటి వేంగీ సింహాసనాన్నధిరోహించేందుకు అర్హుడైయ్యుండును.

విమలాదిత్య, రాజరాజులతో పోల్చిన వీరవిజయాదిత్యుని తాత—పూర్వులనాటి చాళుక్య వైభవాని కాసక్తుడవాలి. 'కవి యుధిష్ఠరుడు' (బిరుదు).

వేంగీ చాళుక్య రాజ్యానికి మూలస్తంభాలు స్వామిభక్తి పరాయణులైన మహామండలేశ్వరులు. వీరూ, పౌరులూ రాజరాజుకన్న వీరవిజయాదిత్యుని అర్హత గుర్తించుట జరిగెనా?

విమలాదిత్యుని వైరాగ్య కారణం — 'త్యాగసింహాసనం' అర్హుడు, సమర్థుడైన వీరవిజయాదిత్యునికి జరిగే అన్యాయం — త్యాగకారణమైయ్యుండునా?

పరిశోధకులు పునరాలోచించదగిన విషయము.

*శ్రీ జి ఆర వర్మ*

# బహుభాషావేత్త, సుకవితాలోలుడు ఆచార్య రోణంకి అప్పలస్వామి

"అప్పలస్వామిగారూ తెలుగు దేశం మీ గొప్పదనం తెలుసుకోలేదు" అని ఆరుద్ర ఏనాడో 1948 లో గావున అన్నాడు. తన తొలి కావ్యం "త్వమేవాహం" గురువుగారికే అంకితం ఇచ్చాడు. [నా తొలి కావ్యం 'వెలిగించే దీపాలు' కూడా మేస్టారికే అంకితం చేసాను. శిష్యులు అంత కంటె యింకేం చెయ్యగలం?] 30 ఏళ్ళ తరవాత కూడా ఆరుద్ర మాట నిజంగానే మిగిలిపోవడం ఎంత శోచనీయమైన విషయం! ఇప్పుడు ఆయన్ని అరసం వారు కాకినాడలో జరుపుకుంటున్న మహాసభల్లో సన్మానించారు అది ఆయనకు తగిన గుర్తింపుగా నేను భావించడంలేదు. వారి రచనలు ప్రచురించడమే ఎవరయినా చెయ్యవలసిన మంచి పని.

రోణంకివారు రాయని భాస్కరులు. ఎవరో పట్టుబట్టి రాయిస్తే తప్ప ఏదీ రాయని వ్యక్తి. ఆయన అప్పుడప్పుడు రచించిన వ్యాసాలు, పీఠికలు, రేడియో ఉపన్యాసాలు కలిసి 20 వరకూ ఉంటాయి. వాటిని ఒక్కగా "ఎడిట్" చేసి ప్రచురిస్తే ఒక అపురూపమైన సాహిత్య విమర్శగ్రంథం అవుతుంది. ఆయన ఆంగ్లంలో రాసిన వ్యాసాలు ఒకటి సంపుటి, ఆంగ్ల కవితలు మరో సంపుటి అవుతాయి. తెలుగు దేశంలో ఎవరైనా వదాన్యులు ముందుకువచ్చి ఆ మూడు సంపుటాలూ ప్రచురిస్తే—అప్పుడు తెలుస్తుంది రోణంకి వారి ఘన లోకానికి! [నేను ఆ పనికి రెండు మూడేళ్ల క్రితమే పూనుకున్నాను. వారి దగ్గరే వారి రచనలు కాపీలు లేవు. బహు కష్టించి తెలుగు దేశం అంతా గాలించి తెలుగు రచనలు మాత్రం కూడగట్టాను. ధనాభావంవల్లనే ప్రచురించలేకపోయాను అలభ్యమైన వాటిని కూడా సేకరించి 1980 నాటికైనా ఒక పుస్తకంగా తేవాలని పట్టుదల!]

అప్పలస్వామిగారిది అతుల్యమైన పాండిత్యం. ఇంగ్లీషు, ఫ్రెంచి, స్పానిష్, లాటిన్, గ్రీకు, ఇటాలియన్, జెర్మన్, హీబ్రూ-భాషలలో ఆయనది కూలంకషమైన వైదుష్యం. [వీరితో సమానమైన పండితులు మన దేశంలో బహుకొద్దిమంది వుంటారేమో!] 70వ ఏట ఈనాటి కింకా తన కాలంలో అత్యధిక భాగాన్ని గ్రంథపఠనానికి వినియోగపరుస్తున్న అచ్చమైన సాహితీ పిపాసువులు. తన యావదాస్తినీ గ్రంథ రూపంలోకి మార్చిన సాహిత్యప్రియులు వారికి చదువు ఒక తపస్సు!

19 9 సెప్టెంబర్‌లో శ్రీకాకుళం జిల్లాలో టెక్కలి సమీపానగల ఇజ్జవరంలో జన్మించారు, అప్పలస్వామిగారు. విజయనగరం కళాశాలలోనూ, అనంతరం కాశీ విశ్వ విద్యాలయంలోనూ చదివి ఆంగ్లంలో యం.ఏ పట్టా పొందారు. విజయనగరం మహారాజా కళాశాలలో అధ్యాపకులుగా ప్రవేశించి 1969 లో ఆంగ్ల శాఖాధ్యక్షులుగా రిటయిరయ్యారు. తరువాత నాలుగేళ్ళపాటు ఆంధ్ర విశ్వ విద్యాలయం శాఖాధ్యక్షులుగా రిటయిరయ్యారు. తరువాత నాలుగేళ్లపాటు ఆంధ్ర విశ్వ విద్యాలయం ఆంగ్ల శాఖలో యు జి.సి ప్రొఫెసర్‌గా వున్నారు. ఇప్పుడు టెక్కలిలో స్థిరపడి బహు భాషా కవితా రసాస్వాదనలో మునిగితేలుతున్నారు. ప్రఖ్యాత కథకుడు చాసో వీరికి బాల్యమిత్రుడు.

శ్రీరంగం నారాయణ బాబుపై [భారతి 1954], గురుజాడపై [ది ఇండ్వర్టయిజర్ 1962], శ్రీ శ్రీ పై [సృజన, జ్యోతి, ఈనాడు 1970 73] రాసిన వ్యాసాలు, కవిత్వ నిజస్వరూపం [కళాకేళి—1969]—వగైరా రచనలు తెలుగు విమర్శనా సాహిత్యానికి శాశ్వతాలంకారాలు. ఇతర విమర్శకులకు ఆదర్శప్రాయాలు. చిత్రభాను, మానేపల్లి, వేగుంట మోహన ప్రసాద్, రంధి సోమరాజు, చాగంటి తులసి అరుణకిరణ్ — వగైరాదుల గ్రంథాలకు రాసిన పీఠికలలో దేశ దేశాల సాహిత్యాలది దృక్పథం దర్శన మిస్తుంది నారాయణబాబు కవితలు, చాసోకథ, గురజాడగేయాలు, చావలి బంగారమ్మ, నండూరి సుబ్బారావుగార్ల పాటలు, మన ప్రాచీన ప్రబంధాల్లోని సొంపయిన పద్యాలు ఎన్నిటినో బహు రమ్యంగా ఆంగ్లీకరించారు. వీరి ఆంగ్ల కవితలు "SONGS AND LYRICS, INDIAN LOVE POEMS"అనే పేర రెండు సంపుటాలుగా వెలువడ్డాయి. కేంద్ర సాహిత్య ఎకాడెమీ వారి పంపున "మాకియవెల్లీ రాజనీతి"ని తెలుగు చేశారు.

విశ్వ విద్యాలయాల్లో ఆచార్య పదవులు నిర్వహించేవారు వీరి పాండితి ముందు సిగ్గుపడాలి. వివిధ సాహిత్య పీఠాల్లో పదవులధిష్టించినవారు వీరి చిత్త శుద్ధి ముందు, నిగర్వత ముందు తలలు వంచాలి తగుదునమ్మా అంటూ బిరుదులూ, బహుమా

నాలు తెచ్చుకుంటున్నవారు వీరి సాహిత్య వ్యక్తిత్వం ముందు సాగిల బడాలి. వారి శిష్యుడిగా, రెండు దశాబ్దాల సన్నిహిత సాహచర్యంగల వ్యక్తిగా—పక్షపాత దృష్టితో నేనే మాట రాయడంలేదు. ''పండితులైన వారు...'' అన్న పద్యం భర్తృహరి ఏనాడో రాసాడు.

**శ్రీ మానేపల్లి సత్యనారాయణ**

# సుకుమార మతీ, అం. కే! మేలుకో!

నవంబరు భారతి' 78 సంచిక కలగూరగంపలోని ''ఒక దెబ్బకు రెండు పిట్టలు'' అనే లేఖ చదివాను.

ఇటీవల కలగూరగంపలో విక్రమార్క పోరాటం సాగిస్తున్న ఒక లేఖకుడి ఆరాటం చదవటమేకాదు — ఆ లేఖకుడు తలకిందికేసుకుని అం. కె. గా మారటంలో ప్రధానంగా కనిపించే పిరికితనం కూడా చదివాను.

## అం కె గారు లేవనెత్తిన అంశాలు :

''కవితా మూర్తుల్లోని భావ ప్రయోజకత్వాన్నీ, కవిత్వ చిత్రీకరణనీ విపులీకరించటం కోసమే ఈ పరిశీలన'' అని నా వ్యాసంలో చెప్పబడి వుంది కాబట్టి, ఒక ప్రయోజనంతో, ఒక ఉద్దేశ్యంతో, ఒక అవగాహనతో ఈ పరిశీలన చేయబడింది కాబట్టి; ఒకే దెబ్బకు రెండు పిట్టలు అనే ధోరణిలో ఉండటంలో ఆశ్చర్యమేమీ లేదు కానీ — అందులో ''ఒక కవిని తెగనాడాలి, ఒక కవిని పొగడాలి'' అనే రీతి కనిపించటం అం. కె. గారి దృష్టిదోషాంతరీకరణకి Symbol తప్ప మరోటి కాదు.

'పరిశీలన కవిత్వ దృష్టితో ఉంటే బాగుండేది' అనేది అం.కె. అంశాల్లో రెండోది

ప్రకృతి లేకుండా మనిషి లేడు కాబట్టి, మనిషి లేకుండా సమాజం లేదు కాబట్టి సమాజం లేకుండా కవిత్వం బతక లేదు కాబట్టి - ప్రత్యేకంగా కవిత్వ దృష్టితో పరిశీలించాలనే అల్పమైన అం కె గారి గుడ్డెద్దు తత్వానికి ఉదాహరణ.

అంతేకాదు; సదరు కవితలపై పరిశీలకుడి అభిప్రాయాలు లేకుండా, పరిశీలనా రీతి అంటూ ప్రత్యేకంగా ఉంటుందనుకునే అజ్ఞాన ఖనీ! అం.కె. గారూ! చెట్లను చూడకుండా అడవిని చూస్తాననుకునే మూర్ఖత్వం ఇదే. [ఎందువల్ల బాగుందీ, దెబ్బతినడానికి కారణాలు ఎక్కడికక్కడ అణుమాత్రంగా వివరించబడ్డాయి. మరోసారి బుద్ధిగా వ్యాసం చదువు కోండి.]

శేషేంద్ర దైవచింతన మీద నాకెలాగూ పేచీ లేదు. కానీ, శివారెడ్డి దేవుని ప్రస్తావించటం గురించి, నా అభిప్రాయం గురించి కొంచెం వివరిస్తా.

ఈ జాతి నరాల్లో తరతరాల్నుంచి 'దేవుడనే' పదం నాటుకుపోయింది కనక, ఈ దేశ సంస్కృతిలో యుగ యుగాల్నుంచీ దేవుడు జీర్ణమైపోయాడు గనక, ఈ మానవుని సెంటిమెంట్లలో 'దేవుడు' ఒక భాగమయి పోయాడు గనక — ఈ 'కన్‌సెప్ట్'ని తొలగించటానికి సమకాలిక సమాజ సంస్కృతిలో ఉన్న కన్‌సెప్ట్‌ని వాడుకోవచ్చు — [వజ్రాన్ని వజ్రంతోనే కోయాలి — తప్పదు.] ఇక్కడ దేవుడు ఒక సింబల్. కర్మ సిద్ధాంతానికి, మూఢ విశ్వాసానికీ, గుడ్డి ఆరాధనకూ ప్రతిరూపం. దాన్ని నిరసించటానికి, తొలగించటానికి కవి దేవుణ్ణి ప్రస్తావించ వలసివచ్చింది. ''రెండడుగులు వెనక్కి, మూడడుగులు ముందుకి'' అని లెనిన్ అంతటివాడు చెప్పాడు. అంత మాత్రానికే అది తిరోగమనమనీ, అది 'ఆస్తికత' అనీ పిలవబడుతుందా? ఒక మార్క్సిస్టు క్యాపిటలిస్ట్‌గురించిప్రస్తావిస్తే అతను క్యాపిటలిజాన్నిఒప్పుకుంటున్నట్టా? అవుననే అం.కె గారంటే అంతకన్నా అవగాహనా దారిద్ర్యము మరోటి ఉండ బోదు

కవి ఏ 'మూడ్'లో రాశాడో విమర్శకుడు ఆ మూడ్‌ని అందుకుని, అర్థం చేసుకుని ఆలోచించి రాయటం పరిశీలకుడి ఫండమెంటల్ రెస్పాన్సిబిలిటీ అని తెలవకపోతె మానే; అనుభవం తర్వాతే అసలు కవిత్వం వస్తుందనీ అనుభూతిని అక్షరాల్లోకి ఎక్కించటమే కవిత్వమనే బేసిక్ నాలెడ్జ్ లేకపోతే మానే; ఆఖరుకు నిరసనకు అర్థం కూడా తెలియకపోతే పోయింది కానీ —

'దేవుణ్ణి పిలు!

నిలబెట్టి గుండెల్లో దిగేస్తా కత్తి

మనన్ని వెధవల్ని చేసినందుకు'' అనటంలో 'చేతగాని తనం' చూస్తున్నానంటే ఆ అభేద్యమైన అజ్ఞానాన్ని ఎవరూ క్షమించలేరు [రా.రా. గారికి క్షమాపణలతో].

అం.కే! ప్రజలంటే ఎవరో తెలియాలంటే రంగనాయకమ్మ పత్రిక చదువు! దేశజనాభాలో వాళ్ల శాతమెంతో కావాలంటే జనాభా లెక్కల సేకరణ శాఖను విచారించు! జనంలో చొచ్చుకు పోవడం కావాలనుకుంటే ఇందిరాగాంధి హస్తాన్నిఅడుగు— చెబుతుంది!

నల్గురు కవుల్లో నానిన పేర్లే కావచ్చు వాళ్లవి. ఆ నల్గురు కవుల్లో నానటానికేగా నువ్ కలగూర గంప గుత్తా తీసుకుంది ?

పోతే — 'దుఃఖానికీ' 'దోసెడు కన్నీళ్లకీ' తేడా తెలీలేదా ? దుఃఖం అధైర్యానికి, చేతకాని తనానికీ, 'సింబల్.' సుదీర్ఘమై మనిషిని కుంగదీస్తుంది. 'దోసెడు కన్నీళ్లు' జాలికి, కరుణకు, సహృదయానికీ సింబల్. జల్లులాగా మనిషిని గట్టి పరుస్తుంది. మొదటిది ప్రాణం తీసే వరద రెండోది ప్రాణం పోసే దోసెడు నీళ్లు. రెంటి మధ్యా అభేదాన్ని మొలిపించి, కావాలని భావ

వైరుధ్యాన్ని అంటగట్టాలనుకుని నీ అనవగాహనను బయట పెట్టుకోవటం మంచిది కాదు.

''కవితా సూర్యుళ్లిద్దరూ ప్రజాధ్యేయంలో పయనిస్తున్నరనేది'' వాళ్ల కవిత్వాన్ని బట్టి మాత్రమే చెప్పొచ్చని ఉదాహరణ పూర్వకంగా చెప్పాను. [చూ॥ భారతి మార్చి 78, పే. 16]. అంతే కాని నేను భ్రమించానని భావించి, సంతోషించిన 'భ్రమ ను ఏమనాలి ?

ప్రజల్లో ప్రవహించకుండా ప్రతీకలంటూ, ఊహా చిత్రాలంటూ, ఇజాల గారడీలు చేసే రచయితలే, దేశాన్ని నిరాశా నిస్పృహల మధ్య చెడుగుడాడిస్తున్నారనే కదా వాదం! భేష్! చాలా గొప్ప మాట! దేశపతనానికి కాంగ్రెస్ పార్టీ కారకురాలని జనతాపార్టీ, జనతాపార్టీ కారకురాలని కాంగ్రెస్ వాళ్లూ, అదీ ఇదీ కాదు భూస్వాములు కాపిటలిస్టులు కారకులని మార్క్సిస్టులు మొత్తుకుంటుంటే వింటున్నాం కానీ — కవులే, రచయితలే 'ముఖ్య' కారకులనేది సరికొత్త వాదం!

పద్య కవిత్వం భావానికి అడ్డుపడుతుందని, అనుభూతికి ఆంక్ష విధిస్తుందని ఛందస్సుల నడుములు విరగదన్నారు కానీ, పద్యాలు రాయలేక కానేకాదు. పద్యాలే ప్రజల్లో చొచ్చుకుపోతాయని ప్రముఖ విరసం సభ్యుడి ఉవాచ. వెనక్కివెళ్లండిమళ్లా, ఎవరొద్దన్నారు ?

అయినా నవచైనా ప్రజా ఉద్యమ నిర్మాత 'మావో' అభిప్రాయంలో మాత్రం ''కళా విలువల్లేని ప్రజా సాహిత్యం, కళా విలువలు పోషించబడిన బూర్జువా సాహిత్యం నిష్ప్రయోజనం. రెండూ ఒకటే''

వేమన అయినా, వి బి. గద్దర్ అయినా, మామూలు జానపదులయినా, ప్రతీకల్నీ పదచిత్రాల్నీ వాడకుండా ఉండలేరే ? అసలు అవేవీ లేకుండా 'భాషే' లేదనీ, ప్రవహించే కాలమే కవుల్ని నిర్ణయిస్తుందనీ, కొ.కు. అన్నట్లు ''ప్రపంచంలో విప్లవ పరిణామాలేర్పడకుండా సాహిత్యంలో విప్లవ ప్రేరణరాదనీ'', అం.కె. ఆలస్యానంతరమైనా గుర్తించటం ఆరోగ్య ప్రదం.

శేషేంద్ర ఎవరో ? ఎక్కడ నివసిస్తున్నారో, ఎవరితో పాలు పంచుకుంటున్నారో, ఎవరిని ఉద్ధరిస్తున్నారో తెలీని అమాయకుడా! అం.కే! స్టేజీల మీద దొర్లే మాటల్నుంచీ, పేజీల మీద మెరిసే వాక్యాల నుంచీ — మేలుకో! మేలుకో!

**శ్రీ నందిని సిధారెడ్డి**

# లవంగీ గాథ మిథ్య

లవంగీ గాథ దేశంలో గతానుగతికంగా వ్యాపించి స్థిరపడింది. అంతేకాని ఆ గాథలో నిజం ఏమీలేదు. ఈ విషయాన్ని సోదాహరణంగా, సప్రమాణంగా నిరూపించడానికే ఈ వ్యాసం ఉద్దేశించబడింది. ఈ క్రింది నిదర్శనాలు గమనించతగి ఉన్నాయి:

1) శ్రీనాథుని కాలంలో వాడయిన డిండిమ భట్టారకుని లవంగి సన్మానించినట్లు డిండిమవంశ చరిత్రను దెలిపే ''విశేష రత్నమాల' అనే గ్రంథం నుండి తెలుస్తూంది. డిండిమ కవి కాలం క్రీ.శ. 15 వ శతాబ్దం. పండితరాయల కాలం 17వ. శతాబ్దం. లవంగికి, పండితరాయలకు మధ్య సుమారు 200 సం॥లు వ్యత్యాసమున్నది. కనుక రాయలు లవంగిని ప్రేమించినాడనే మాట నిరాధారమైనది. అనాలోచితమైనది కూడా.

2) ఇక లవంగిపై పండితరాయలు చెప్పినవనుకుంటున్న శ్లోకముల తత్వాన్ని తేటతెల్లం చేస్తాను. నిజానికి ఈ ప్రేమ సూచక పద్యాలేవీ పండితరాయల గ్రంథాల పూర్వప్రతులలో లేవు. 100 సం॥కు పూర్వం ముద్రించిన పండితరాజ శ్లోకములు కల ప్రతిలో గ్రంథారంభమునకు ముందుగా ప్రత్యేకమయిన పేజీలో లవంగీ ప్రేమ సూచకమైన శ్లోకసప్తకం ఉంది. ఈపేజీ తరువాత తిరిగి ఒకటవ సంఖ్యకల పేజీలో సరస్వతీ వినాయక ప్రార్థనలతో గ్రంథం ప్రారంభమైనది. దీనిని బట్టి పూర్వ పండితరాజ శతక గ్రంథంలో ఎక్కడా లవంగికి చెందిన ఏ పద్యాలు లేవనీ, రాయల ప్రతిపక్షులు అసూయతో రాయల కీర్తిని కళంకితం చేయడానికై పిమ్మట ప్రక్షిప్తరూపాలైన ఈ పద్యాలను చేర్చారనీ స్పష్టమౌతూంది.

3) రసగంగాధర పీఠికలో మహామహోపాధ్యాయ పండిత దుర్గాప్రసాద మహోదయులు కూడా తాము చూచిన పండితరాజ గ్రంథాలలో ఎక్కడా లవంగ్యనురాగ సూచక పద్యాలు కనబడలేదని రసగంగాధర పీఠికలో వ్రాశారు. (నిర్ణయసాగర ప్రెస్ 3వ ముద్రణ)

4) మన రాయలు నిజంగా లవంగిపై అనురాగంతో ఈ పద్యాలను రచించి ఉన్న పక్షంలో, ఈ కవిపద్య రత్నాలన్నిటికీ రత్నపేటికా స్థానీయమైన ''భామినీ విలాస'' గ్రంథంలో ఈ పద్య రత్నాలు కూడా ఉండి తీరవలసిందే కదా! కాని ఈ పద్యాలు ఆ విలాస గ్రంథంలో ఎక్కడా లేవు.

5) ఝాన్సీ కళాశాలలో ముఖ్య హిందీ పండితుడైన శ్రీ మహావీర ప్రసాద ద్వివేది, తన 'భామినీ విలాస భాషాటీకా భూమిక'లో ఇలా వ్రాశారు:

''.. వాచక్ హాస్యకరేంగికి లవంగీకా కలశలేకర్ జగన్నాథ పండితకీ సమ్ముఖ ప్రవేశ్ కర్నా నితాంత అసంభవ్ హై, క్యోంకి మునల్‌మానోం కే పరదా విషయక నియమ్ సహజ ఉల్లంఘన్ నహీ హోసక్తే, నహోసక్తే హోంగే...''

6) ఇంతేకాక రాజస్థాన ప్రదేశములోని జయపుర పండితులైన 'దేవర్షి భట్టశ్రీ మధురానాథశాస్త్రి'' తమ రసగంగాధరోపోద్ఘాతములో,

''...జగన్నాథ పండితస్య ప్రతపక్షిణః అసూయయా జాతి ద్వేషేణవా అస్య పాండిత్యాత్ అప్రభవంతో జాతి ప్రభావానుసారం నిన్దాం చక్రుః। అన్యథాన కించిత్ ప్రమాణముపలబ్ధమస్మిన్।

అప్పాశాస్త్రి ప్రభృతిభిరపి ఖండిత మిదమ్ లవంగీ సంగ వృత్తమ్।......''

అంటూ ఈ లవంగీ గాథకు ఏమీ ప్రమాణము లేదనీ, ఈ కవి ప్రతిపక్షులు ఈ కవి పాండితిపై అసూయ వహించి లేవదీసిన నిందా మాత్రమే ఈ గాథ అనీ, ఈ మిథ్యాపవాదను అప్పాశాస్త్రి వంటి సుప్రసిద్ధ పండితులు పూర్తిగా ఖండించి వేశారని భట్టశ్రీ తెలిపినారు. ఇంకా

7) ''...మమతు మతిర్నమనాగపైతుధర్మాత్ ''

''శాస్త్రాణ్యా కవితాని నిత్యవిధయ స్సర్వేపి సంభావితాః।...
సంప్రత్యుజ్ఝితవాసనం మధుపురీ మధ్యే హరిస్సేవ్యతే'...''

మొదలైన రాయల స్వీయ వాక్యాలవలన, ఈ పండితుని ధార్మిక శీలమూ, బ్రాహ్మణోచిత శ్రౌతస్మార్త సత్కర్మాచరణమూ, స్పష్టమౌతూన్నాయి. ఇట్టి సత్కర్మానుష్ఠానమునకు ధర్మపత్ని ఉండి తీరాలి. కామేశ్వరి అనే ధర్మపత్ని ఈ పండితుని ఎల్లవేళలా సేవిస్తూ ఈతని మనస్సును చూరగొన్నట్లునూ, ఆ ధర్మపత్ని తన హృదయంలో నిత్య నివాసం కల్పించుకొని ఉన్నట్లునూ, ఆమె పతివ్రత ఐనట్లునూ, ఆమె విలాసములే తన కవితా విలాసములుగా పరిణమించినట్లు నూతన ''కరుణా విలాసము'' లో స్పష్టంగా పండితరాయలు చాటినాడు. ఇట్టి పరిస్థితిలో తన ధర్మపత్నికి కాక మరొక అన్యజాతి వనితకు ఈ కవి మనస్సులో స్థానం దొరకడ మనేది అసంభవం కొందరు విజ్ఞంమన్యులు భావించినట్లు మన పండితుడు లవంగీ సంగంతో పతితుడైన పక్షంలో అట్టి పతితునికి శ్రౌతస్మార్తాది సత్కర్మాచరణమునకు అర్హత ఉండదు కదా? ఇట్టి సందర్భంలో ఈ పండితుడు ''నేను నిత్యనైమిత్తిక క్రియలన్నిటినీ శ్రద్ధగా నిర్వహించాను'' అని తన గ్రంథంలో ఘంటా పథంగా చెప్పుకొనగలడా? ఇంతేకాదు. ''నేను ఎట్టి పరి స్థితిలో ఉన్నను నా బుద్ధి ధర్మమార్గాన్ని విడవకుండు గాక!''

''మమతుమతిర్న మనాగపైతు ధర్మాత్।''

అని మనసారా భావించిన జగన్నాథ పండితరాయల ప్రవృత్తి ఎట్టిదో మనకు తెలియదా ?

8) చక్రవర్తి యొక్క మహాసభలో ధర్మశాస్త్ర సమ్మతంగా ''ధర్మనిర్ణయము'' చేయగలవాడే ''పండితరాజ' బిరుదమునకు పాత్రుడు కాగలడు అని శ్రీ మహాదేవగోవిందరానాడే తెలిపి ఉన్నారు. ఏ తదనుగుణంగా తన ధర్మనిర్ణయ దక్షత చేతను, విశేషంగా తన సర్వశాస్త్ర వైశారద్యం చేతను అశేష భారతంలో ఏకైక పండి తుడుగా ఎన్నిక చేయబడి సార్వభౌమునిచే సాదరంగా ''పండితరాజ'' బిరుదమును పొందిన జగన్నాథ పండితరాయలపై కేవల అసూయా భావంలో ఇట్టి మిథ్యాపవాదను మోపడం, ఆ నిందను కొందరు పండితులనుకొన్న వారు కూడా సమర్థించడం అనేది అవివేక విలసితం అనిపించుకొనక మానదు.

పై నిదర్శనములను బట్టి ''లవంగీ గాథ మిథ్య'' అని నా భావము. ఇక ఈ గాథ నిజమనుటకు సమర్థమైన తగినన్ని చారిత్రక నిదర్శనాలున్నచో పండితులు పత్రికా ముఖంగా తెలుప గలరని ఆశిస్తున్నాను. ఇతిశమ్.

— శ్రీ ఖండవిల్లి సూర్యనారాయణశాస్త్రి

## సమన్వయ మెట్లు ?

విమర్శక విద్యా స్వతంత్రులైన—శ్రీ 'తిరుమల రామచంద్ర' గారిచే రచింపబడిన ''హిందువుల పండుగలు'' అను అపూర్వ గ్రంథమును - భాగ్యవశమున చదువ గలిగితిని. ఆ గ్రంథము సామాన్యులకే గాక నసామాన్యులకు తెలిసికోదగిన విశేషములు కోకొల్లలుగ నున్నవి. ఆ గ్రంథము వారి పరిశీలనా శక్తితో బాటు— బహు భాషా పాండిత్యము వేనోళ్ళ చాటుచున్నది.

ఆ గ్రంథాంతరమున—'శ్రీరామనవమిని' గూర్చి వ్రాయుచు చివర రాముడు జీవించి రాజ్యపాలన మొనరించిన దానిని వివ రించుచు 'దశవర్ష సహస్రాణి. దశవర్ష శతానిచ। భ్రాతృభిస్సహితః శ్రీమాన్—రామోరాజ్య మకారయత్'' అను వాల్మీకి రామాయణ శ్లోకము నుదహరించినారు. పై పద్యము ననుసరించి—శ్రీరాముడు పూర్ణమానవుడుగ జీవించెను. కాని కాలమానములకు మన ప్రాచీనులచే సంకేతములు వాడబడుటాచారమనియు అట్లే శ్రీ వాల్మీకియును — ఇట్టి సంకేతములనే వాడియుండుననియు కొందరనిరి. 'తృతీయందశమిత్యాహుః చతుర్థంతు సహస్రకం' (తృతీయ మనగా=పది. చతుర్థమనగా=వేయి) అను అభియుక్తోక్తి వలన దశవర్ష సహస్రములనగా=పలువదియు, దశవర్ష శతము లనగా=ముప్పదియు రెండును కూడగా డెబ్బది (70) యనియు - శ్రీ దుంపల రామిరెడ్డి యను పండితులు చక్కని సమన్వయము చేసిరి, అని వ్రాసిరే కాని—తృతీయ మనగా—పది ఎట్లో - చతుర్థ మనగా=వేయి ఎట్లో సప్రమాణముగ వివరింపలేదు కాని—రచయిత గాని, తదితరులుగాని, సమన్వయ పరచి - అస్మాదృశుల సంశయమును దీర్ప మనవిచేయు చున్నాను -

— శ్రీ కె. రామానుజాచార్యులు

## ప్రాంతీయ భాగ సంఖ్యార్థము

భారతి, డిశంబరు 1978 సంచికలోని కలగూరగింప యందు ప్రచురితమైన ''ప్రాంతీయ భాగములు — సంఖ్యలు'' అను శ్రీమతి ఆర్. జగదీశ్వరిగారి వ్యాసం ఆంధ్రదేశ చరిత్రకు మాత్రమేగాక, ఆంధ్ర సాహిత్య రంగమునకును ఆవశ్యకమైనది. అందు సంతరించిన పట్టిక అమూల్యమైనది. తన్నిమిత్తమైన కృషి ప్రశంసాపాత్రము. కాని, ప్రాంతీయ భాగసంఖ్య కుటుంబ సంఖ్య అను సమన్వయము మాత్రము ఆలోచనీయాంశము.

శాసనములందు ఆంధ్రదేశమునకు 16,000, (?) పాకనాడునకు 21,000, వేంగికి 14,000, నొసంబవాడికి 32,000, గంగవాడికి 96,000 అని కలదు గాన "ఆ సంఖ్యలు గ్రామ సముదాయమును సూచించుట లేదు" అను సమన్వయము అవశ్యము, సమంజసము. కొన్ని ప్రాంతీయ భాగములకు "70, 30,24,98,1? మొదలగు చిన్న సంఖ్యలు కలవు గనుక గ్రామాదాయమును కాదు" అను సమన్వయమును ఆమోదయోగ్యము. అదే కారణమున "జనసంఖ్య కాదు" అను సమన్వయముమాత్రము ఆలోచనీయము అంత తక్కువ జనసంఖ్య కల గ్రామములు అరుదుగ నేడును కలవు. ఇక "కుటుంబ సంఖ్య" అను సమన్వయము ఇతరత్ర బాధకము. అది వక్ష్యమాణము. అంతే కాదు. "విస్న విస్తీర్ణము" కల నొసంబవాడి యందు 32 000 కుటుంబములు, గంగవాడి యందు 96,000 కుటుంబములు ఉండుట కూడ సంశయావకాశము. ఉపరి ప్రాంతీయ భాగ సంఖ్య గ్రామ సంఖ్య అని ప్రాచీన కవి ప్రయోగము కలదు. ఇది గమనార్హమైన విశేషము. ఆ ప్రయోగమిది :

"అరుదందన్ వెలనాటి చోడ మనుజేంద్రాజ్ఞాపనంబూని దు
స్తరశక్తింజని యేకవింశతి సహస్రగ్రామ సంఖ్యాకమై
ధరణిం బేర్చిన పాకనాడు నిజదోర్దండైక లగ్నంబుగాఁ
బరిపాలించె నమాత్య కొమ్మన జగత్ప్రఖ్యాత చారిత్రుఁడై."
27 ప. 1ఆ

ఇది మంచెన 'కేయూరబాహుచరిత్ర'లోని పద్యము. సమకాలిక సమాచారము. చారిత్రిక విషయము. ఇందు వెలనాటి చోడ రాజు ఆజ్ఞప్తిని మంత్రి కొమ్మన "ఏకవింశతి సహస్ర గ్రామ సంఖ్యాకమై"న పాకనాడు జయించి, పరిపాలించినట్లు స్పష్టముగ కలదు. ఏకవింశతి సహస్ర గ్రామ సంఖ్యాకమనగా ఇరువది యొక్క వేయి గ్రామ సంఖ్య కలదని అర్థము. శాసనములందును పాకనాడునకు ఇరువది యొక్క వేయి సంఖ్యయే కలదు. అంతేకాదు. నన్నె చోడుని కుమార సంభవమునందును పాకనాడున ఇరువది యొక్క వేయిటికి చోడబల్లి అధీశుడని కలదు. ఆ పద్యమిది :

"అరి నరపాల మౌళి దళితాంఘ్రిసరోయుగుండయి పాకనాటియం
దిరువది యొక్క వేయిటి కధీశుఁడు నాఁజను చోడబల్లికిం
జిరతరకీర్తి కగ్గమహిషీ తిలకంబన హైహయాన్వయాం
బర శశిరేఖయైన గుణభాసిని శ్రీ సతికిం దనూజుడన్."
53 ప. 1ఆ.

ఇది కూడ ఇంచుమించు సమకాలిక సమాచారము. చారిత్రిక విషయము. ఇందు నన్నెచోడుని తండ్రి చోడబల్లి పాకనాటిలోని ఇరువదియొక్క వేయిటికి అధీశుడని కలదు. ఆ ఇరువదియొక్క వేయి ఏమిటో లేదు. 'ఇరువదియొక్క వేయి కుటుంబములకు అధిపతి' అని నన్నెచోడుని పద్యమున అర్థము కిట్టించ వచ్చును గాని, మంచెన పద్యము నందలి "ఏకవింశతి సహస్ర గ్రామ సంఖ్యాక" సమాసములోని "గ్రామ" శబ్దమునకు కుటుంబమని అర్థము చెప్పుట కుదరదు. కారణము, గ్రామశబ్దమునకు కుటుంబమనెడి అర్థము లేదు. అయిదవ శతాబ్ది అమరకోశమునందు "శబ్దాది పూర్వో బృన్దేఽపి గ్రామః" అని ఊరు, సమూహము అనెడి అర్థములు మాత్రము కలవు పదమూడవ శతాబ్ది నానార్థ రత్నమాల యందును "గ్రామః పల్ల్యాం స్వరే బృన్దే్వ్యయం శబ్దాది పూర్వకః" అని పల్లె, స్వరము, సమూహము అనెడి అర్థములు మాత్రమే కలవు. నానార్థ రత్నమాల కర్త ఇరుగప దండనాథుడు. ఆంధ్రుడు. పదమూడవ శతాబ్దివాడు. మంచెన కూడ పదమూడవ శతాబ్దివాడు. పదమూడవ శతాబ్దిని గ్రామ శబ్దమునకు కుటుంబమనెడి అర్థము కలదేని, అది నిఘంటు సంఘటిత మగుట సంభవము. పదమూడవ శతాబ్దిని మాత్రమే కాదు; వర్తమాన శతాబ్ది వ్యవహారమున సహితము గ్రామ శబ్దమునకు కుటుంబమనెడి అర్థము లేదు. సమూహమనెడి అర్థము సర్వత్ర కలదు గుణగ్రామము, ఇంద్రియ గ్రామము మొదలైనవి ఉదాహరణములు. కనుక పాకనాటి గ్రామసంఖ్య పాకనాటి జనసంఖ్య కాగలదు పాకనాడులోని ఇరువదియొక్క వేయి మందిని కొమ్మన పరిపాలించెనని మంచెన పద్యమునకు, పాకనాడులోని ఇరువదియొక్క వేయిమందికి చోడబల్లి అధిపతి అని నన్నె చోడుని పద్యమునకు అర్థము సుసంగతము. అది శాసనము లందలి సంఖ్యలకును అన్వయించునది. కాబట్టి శాసనములందలి ప్రాంతీయ భాగ సంఖ్యలు కుటుంబ సంఖ్యలు కాక జన సంఖ్యలని గ్రాహ్యము.

— డాక్టర్ కోర్లపాటి శ్రీరామమూర్తి

## ప్రాంతీయ భాగములు - సంఖ్యలు : మరికొన్ని ఆధారములు

శ్రీమతి ఆర్. జగదీశ్వరిగారు (డిసెంబరు,78, 'భారతి'లో పై వ్యాసమున) సూచించిన, ప్రాంతీయ భాగములతోబాటు శాసనములందు పేర్కొనబడిన సంఖ్యలు ఆయా భాగములందలి కుటుంబ సంఖ్యలు అను అభిప్రాయము, మిక్కిలి సముచితమైనది.

మరికొన్ని సాహిత్య, శాసనాత్మక ఆధారములును ఈ అభిప్రాయమును సమర్థించుచున్నవి. జిజ్ఞాసువులు వివరణాత్మక అవగాహనకు ఈ క్రింది ఆధారములను పైని పేర్కొన్న వ్యాసమునకు అనుబంధముగ స్వీకరింపదగును.

(1) కాకతి ప్రతాపరుద్ర దేవుడు పురమాయించిన జన గణాంక సేకరణకు ప్రాతిపదిక ఇల్లు లేదా కుటుంబము (సోమదేవ రాజీయము, పుటలు 114-116).

(2) పలనాటి వీరచరిత్రలో 'పరగ పన్నెండిండ్ల పద్మనాయకులు, ఆవాలవారును నచ్యుతువారు...' ఇత్యాదిగా ఇండ్ల సంఖ్యతో, ఇంటి పేర్లతో వీరులు పేర్కొనబడినారు (పింగళి లక్ష్మీకాంతంగారిచే పరిష్కృతమైన పలనాటి వీరచరిత్ర, పుట15, పాదములు 209-210).

(3) శాసనములలో కన్పట్టు 'నావపల్లి ముప్పదిణ్డ్ల్వారు' (నావపల్లి గ్రామపు ముప్పది ఇండ్లవారు), 'పంన్రెణ్టి కాంపులు' (పన్నెండిండ్ల కాపులు) అను ప్రయోగములు ఇల్లు (హవుస్‌హోల్డ్) లేదా కుటుంబమే పరిపాలనా వ్యవహారమున లెక్కింపునకు తీసుకొను కనిష్ఠ పరిమాణమని స్పష్టపఱచుచున్నది. (దక్షిణ హిందూ శాసనములు, X, 554 మరియు 702).

(4) 'రాష్ట్రకూట ప్రముఖాన్ కుటుంబిన స్సమాహూయ' అను శాసనములందలి ప్రయోగమును బట్టి రాజులు దాన శాసనములు చేయునెడ కుటుంబ పెద్దలను (హెడ్ ఆఫ్ ఈచ్ హవుస్ హోల్డ్) సమావేశ పఱచుచుండిరని విదితము. దీనివలన రాజ్య వ్యవహారములలో ప్రాతినిధ్యమునకు ప్రాతిపదిక కుటుంబమేనని విశదమై పై అభిప్రాయమునకు బలము చేకూరుచున్నది (ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక, సంచిక 24, పుటలు 13-14; దక్షిణ హిందూశాసనములు, VI, 124; ఎపిగ్రాఫియా ఇండికా.I, పుట 59).

*కుమారి చలిచం సీత*

# ప్రాంతీయ భాగ సంఖ్యార్థం మరో ఆలోచన

'ప్రాంతీయ భాగములు–సంఖ్యలు' చర్చలో ఒకరు 'కుటుంబ సంఖ్య' అన్నారు. వేరొకరు 'జన సంఖ్య' అన్నారు. 'ప్రాచీనాంధ్ర చారిత్రక భూగోళం' సమకూర్చిన కుందూరి ఈశ్వరదత్తుగారు ఇది పరిష్కారంకాని సమస్య అన్నారు. శ్రీ డి. సి. సర్కారుగారు 'ఇండియన్ ఎపిగ్రాఫి'లోకొంత చర్చించారు. రెవెన్యూ 'ఎసెస్ మెంటుకు' ఒక 'యూనిట్' అని అంటూ చెప్పేరేకాని స్పష్టంగా నిర్వచించలేదు. 'దశ శత సకల ధరణీతలం వేంగి, త్రిశతోత్తర సహస్రావని' 'ద్వాదశ సహస్ర ప్రమాణం' నోలంబవాడి 32 వేలు, రేనాడు 7 వేలు, అని ప్రయోగాలు కనిపిస్తున్నాయి. అయితే ఈ ప్రయోగాల్లోని 'ధరణీతలం', 'అవని' అనే పదాలకు 'నేల' అని పూర్వ శాసనంలో ప్రయోగం ఉంది. కడప జిల్లా ప్రొద్దుటూరులో క్రీ. శ. 925–5 మధ్యకాలంనాటి శాసనంలో 'రేనాణ్డు ఏఱువేలు నేల' (ద. హిం. శా. సం. 10 నెం. 598). ఇక్కడ 'నేల' అనగా పొలం అని సమకాలీన శాసన ప్రయోగాలవల్ల స్పష్టం అవుతుంది. ఈనాడు మనం భూమిని ఎకరాలలో పొలాలను కొలిచినట్లుగానే ఆనాడు వారికి ఏదో ప్రమాణం ఉండి ఉండాలి. 'ఆ భూస్వామికి ఫలానా ఊళ్ళో ఇన్ని వందల ఎకరాలు ఉందని' మనం మొన్న మొన్నటి వరకు చెప్పకొనేవారం. 'భూస్వామి' పదంలో భూమి - అనగా పొలమనే అర్థం. రాజు పన్నును పరిగ్రహించి అనుభవించదగింది కాబట్టే 'గ్రామం' అని పేరు వచ్చింది. పాకనాడులలో 21 వేల గ్రామాలకు అధిపతి అంటే అక్కడ 21 వేల ఎకరాల ? భూమిపై వచ్చే ఆదాయం కలవాడని అర్థం తోస్తోంది. పాకనాడులో 21 వేల గ్రామాలు ఆనాడు ఉండటం ఆశ్చర్యంగానే ఉంటుంది. పెద్దలు ఇంకా దీన్ని గురించి ఆలోచించాలని కోరుతున్నాను.

*ఒ. వి*

# అ. ఆ అధ్యయనపు మనస్సిద్ధాంత ప్రేరకము

నమస్కారము పెట్టడం ప్రతి నమస్కారము రావాలని కోరుకుంటూ ఒనర్చే ఒకానొక దౌర్బల్య ప్రక్రియ సాంధ్యశ్రీగారు నమస్కార మొనర్చినంత మాత్రాన ఆనంద పడిపోయి ప్రతి నమస్కారము చేయను నేను. అది ఏ సంప్రదాయము కిందికి లెక్కించుకున్నా పరవాలేదు. అసలు (పిచ్చి) సాంప్రదాయాన్ని పాటించడమంటేనే చీదర నాకు.

వారు కర్మసిద్ధాంతాన్ని చదవమని కోరినంత మాత్రాన చదవాల్సిన అవసరం నాకు లేదు. కర్మసిద్ధాంతము గురించి సరియైన అవగాహన లేనివారు చేయాల్సిన పని అది. అయినా అసూర్యంపశ్యల్లా గదుల్లో కూర్చొని (చుక్కల్ని చూస్తూ, సమాజాన్ని లెక్కిస్తూ) ఉబుసుపోకకు గీసుకునే గీతలు, రాసుకునే పిచ్చి పిచ్చి రాతలు కాదు పరిశీలన చేయడమంటే. అయినా "సున్న"తో జీవితాల్ని పోల్చుకునే రచయితలు ఇంతకంటే ఎదగగలరా? ఎదగగలరని నేనూ అనుకోలేదు.

"నచసన్న్యసనాదేవ సిద్ధిం సమధి గచ్ఛతి" (ఫలాభిలాష లేక కర్మలు జేసిన జ్ఞానసిద్ధి కలుగును. కేవల సన్యాసముచే సిద్ధిని పొందడు.) అని పలికిన శ్రీకృష్ణుడే "కార్యతే హ్యవశః కర్మసర్వః ప్రకృతి జైర్గుణైః" (ప్రతివారును ప్రకృతినుండి పుట్టిన గుణములకు వశులై కర్మల చేయుచునే యుందురు) అని పలికాడు. మరి ఒక గుణానికి (దుర్గుణమో? సద్గుణమో?) వశులై కర్మల జేయువారు ఫలాభిలాష గురించి ఆలోచించగలరా? తాము జేయు కర్మలయొక్క సదసద్వివేచన చేయగలరా? సాంధ్యశ్రీగారు ఆలోచించగలరనుకుంటా?

"యద్యహంకార మాశ్రిత్య నయోత్స్య ఇతిమన్యసే
మిథ్యైష వ్యవసాయస్తే ప్రకృతిస్త్వాం నియోక్ష్యతి"

(అహంకారముచే నీవు యుద్ధము చేయనని నిశ్చయించితివేని అది వ్యర్థమగును. ప్రకృతి నిన్ను ప్రేరేపించుచున్నది) అని కృష్ణుడు మోక్షసన్యాసయోగములో నుడివాడే. ఈ శ్లోక ఆవశ్యకత ఏమిటో? అంతగా బోధించిన భగవద్గీతను అర్జునుడు అర్థం చేసుకోలేక పోయాడా? ప్రకృతి ప్రేరేపించిన పిదప కూడా అర్జునుడు ముంగిలా కూర్చున్నాడంటే అర్థమేమిటో? మరి ఎందుకు కృష్ణుడలా డయిరెక్షన్ ఇవ్వాల్సివచ్చింది? అర్జునుడు ప్రకృతి గుణముల వశీకరణ నుండి తప్పించుకున్నాడా? ఇలా కర్మ సిద్ధాంతాన్ని పరిశీలిస్తుంటే (ముఖ్యంగా భగవద్గీత కర్మల్లో) ఎన్నెన్నో ప్రశ్నాపరంపరలు. ఇలా

ప్రశ్నా పరంపరలు మొలకెత్తడానికి నన్ను ఏ ప్రకృతి ప్రేరేపించింది? మిమ్మల్ని ఎందుకు ప్రేరేపించలేకపోయింది? ఇలా సిద్ధాంతపరంగా పోతే తగిలే పోటురాళ్ళు కోకొల్లలు. (శాస్త్ర ప్రకారం సంభోగిస్తే కుక్కపిల్లలు పుడ్తాయట.)

"సతదస్తి పృథివ్యాం వాదివి దేవేషు వాపునః
సత్త్వం ప్రకృతి జైర్ముక్తం యదేభిః స్యాత్త్రి భిర్గుణైః"

(ప్రకృతిచే జనించిన సత్వాదిగుణములకు లోబడని ప్రాణి మానుష లోకమందుగాని, దేవలోకమందుగాని, పాతాళ లోక మందుగానిలేదు) శ్రీకృష్ణుడు డయిరెక్షన్ ఇచ్చేంతవరకు అర్జునుడు ప్రకృతి ప్రేరేపణకు గురియైనా నోరుమూసుక కూర్చున్నాడంటే ప్రకృతిని అర్జునుడు జయించగలిగాడా? ప్రకృతిని జయించాడంటే అర్జునుడు ఏ లోకానికి చెందిన ప్రాణిగా భావించాలి? మానుషలోకము, దేవలోకము, పాతాళలోకము గాక ఇంకేమైనా లోకాలున్నాయా? ఈ సమస్య సాంధ్యశ్రీగారే తీర్చగలరనుకుంటా?

నిజానికి ప్రస్తుత సమాజంలో ఆచరణ, సిద్ధాంతము వాటి లోతుపాతుల్ని పరిశీలిస్తే సిద్ధాంతం వేరుగా, ఆచరణ వేరుగా ద్యోతకమౌతుంది. (ఆచరణను పరిశీలించనిదే సిద్ధాంతాల్ని బట్టీపట్టి లాభంలేదు) ఆచరణలో కర్మసిద్ధాంతం కాటికి కాళ్ళు జాపుక కూర్చోవటం నేర్పుతుంది. నేడు అదెలాగ అనే ప్రశ్న మీలో రేకెత్తింది కావున చక్కగా సమాజములోకి వెళ్ళి పరిశీలించండి ఒకమారు. నెలలు నిండిన కడుపును సూచించే బలుపుతో దోపిడీ మోతుబరికూసే నోటి కొచ్చిన కారుకూతలకు దౌర్భాగ్యపు భంగిమలో నెలకొన్న అస్థి పంజరంలాంటి పాలేరు ఎదురు తిడ్తాడా? చేయని తప్పుకు శిక్షవిధించే గుండాయిజానికి మారుపేరుగా మారిన మోతుబరి తన్నినా నంగిలా నోరుమూసుక కూర్చునేటంతటి మూర్ఖత్వము ఆ బరిగెల్లాంటి బక్కదనంలో ఎందుకుదయించింది?కామాంధుడైన దోపిడీ ఆఖరుకు వారు ప్రాణపదంగా భావించే పెళ్ళాం పిల్లల్ని అనుభవించినా అది తమ "రాత"గా, "పూర్వజన్మ సుకృతంగా," తమ "కర్మ"గా భావిస్తున్నారంటే వారిని కర్మసిద్ధాంతము ఎటువైపు తోలు కెల్తుంది? బానిసత్వము వాళ్ళలో వేళ్ళు పాతుకపోవడానికి ఏ సిద్ధాంతము కారణమై కూర్చుంది? వాళ్ళలో జీర్ణించుకున్న వేదాంత ధోరణికి ఏమని నామకరణం చేయగలరు?

"బ్రాహ్మణ క్షత్రియ విశాం శూద్రాణాం చ పరంతప
కర్మాణి ప్రవిభక్తాని స్వభావ ప్రభవైర్గుణైః"

[బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రులకు కర్మలు స్వభావం నుండి పుట్టిన గుణములనుండి విభజింపబడినవి.] మానవ జాతంతటికి వారి వారి స్వభావం నుండి పుట్టిన గుణముల నుండి కర్మ విభజింపబడుతుంది, అనకుండా చాతుర్వర్ణ్య వ్యవస్థను ఉచ్చరించి కర్మలు విభజింపబడుతాయి అని శ్రీకృష్ణుడు ఎందుకు చెప్పాల్సి వచ్చింది? శ్రీకృష్ణుడు వర్ణ వ్యవస్థను ప్రేరేపిస్తున్నట్లా? వర్ణ ప్రాతిపదికపై కర్మ మారుతుందా? అలా భావిస్తే కృష్ణుడు ఏ వ్యవస్థకు చెంది మీలాంటి వారిచే భగవంతునిగా సేవింపబడుతున్నాడు? వర్ణ వ్యవస్థ అంటే గుర్తొచ్చింది. మా ఊళ్ళో ఒక బ్రాహ్మణుడున్నాడు అతని పెళ్ళాం చచ్చింది. పెళ్ళాం చచ్చినంతనే అతని కామం చావలేదు. ఓ అందమైన (తక్కువ కులం) ఆడదానితో పొత్తు కుదుర్చుకున్నాడు. జపహోమాదులు, నిత్య సంధ్యా వందనాలు వగైరా వగైరాలు చేయడంలో వాడికి వాడే సాటి. పొత్తు కుదుర్చుకున్న ఆడది వండుకోవడానికి పనికొస్తుంది కాని దాని చేతివంట వీడు ముట్టడు. వీడిది ఏంకర్మ సిద్ధాంతమో చెప్పగలరా? వాడిని మా ఊరివాళ్ళు పూజిస్తారు. మా ఊరి వాళ్ళేమిటి, బయటి జనం కూడా (తెలుగుదేశ మంతటా)! వాడు చస్తే వాడికి తద్దినాలు వాడి కొడుకులేగాక జనమంతా పెడుతున్నారు. ఈ జనం ఏ కర్మ సిద్ధాంతము ఆధారభూతంగా ముందుకు (ప్రగతిలోకా? అధోగతిలోకా?) చొచ్చుకుపోతున్నారు. ఇతనిది ప్రకృతిచేజనించిన సత్వగుణంగా భావింపవచ్చుగదా? అంటే అతనిదేం తప్పే లేదని ఒప్పుకోగలరా? వాడిని సమర్థిస్తే వాడేర్పర్చుకున్న సంబంధం సక్రమమేనా సాంధ్యశ్రీగారి దృష్టిలో? ఈ జనం రకరకాలుగా మారడాన్ని ఒకే ప్రకృతి ప్రేరేపిస్తున్నదా? ప్రకృతి ప్రాంతాలను బట్టి మారుతుందా? పరిస్థితుల బట్టి మారుతుందా? (మారితే అదొక ఊసరవెల్లా?)

పరిశీలకుడు వాడిన పదాల్ని, పరిశీలనా పుస్తకంలోని పదాల్ని గుర్తించలేని గొప్పదనాన్ని జోహార్లు చెప్పకతప్పదు. నక్సల్‌బరీ, శ్రీకాకుళాలు ఒక సిద్ధాంతాన్ని ప్రతీకలుగా మాత్రమే తెలియపర్చడం జరిగింది. కానీ అవి నా వెన్నెముకగా నేను ఎక్కడా ప్రకటించలేదు అధ్యయనా ప్రేరక ప్రారబ్ధంలో పరిశీలనా దృష్టి లోపిస్తే నేనేం చెయ్యగలను.

ఇక మార్క్సిజానికి కరపత్ర ప్రచారం చాటు మాటుగా జరుగుతుందని, ఎవరి మనస్సిద్ధాంత ప్రేరకపు ఊహాలయితే ఎవరేం చేయగలరు మార్క్సిజానికి సంబంధించినంతవరకు రేడియోలు, పత్రికలు అన్నీబాహాటంగా అన్నిరకాలుగా ప్రచారం గావిస్తున్నాయి. దేనికి సంబంధించినవైనా చాటుమాటుగా ప్రచారాలు జరుగుతున్నాయంటే అది ఈ ప్రభుత్వం గొప్పదనము. ఐ. పి. సి 19వ క్లాజు ప్రకారం భారతదేశంలో వ్యక్తికి భావ స్వాతంత్ర్యం ఉన్నా దానిని అణచివేయడానికి మరెన్నో క్లాజుల్ని (144, పి. డి వగైరా) సృష్టించారు మన బుద్ధిమంత పాలకులు. ఇంకా ఆత్యయిక పరిస్థితిని శ్రీ సాంధ్యశ్రీగారు మర్చిపోలేదనుకుంటా? ఎమర్జన్సీలో అనుమానము వచ్చిన వారందర్ని పోలీసులు యెలా టార్చర్ చేసే వాళ్ళో వారికి తెలియదుకాబోలు. (తెలుసుకుంటే జడుసుకుంటారులెండి) ఆఖరుకు నిరంకుశత్వానికి మారుపేరుగా వెలుగొందినవాళ్ళు మళ్ళీ పార్లమెంటు ప్రవేశం గావిస్తున్నారంటే అది ఈ దౌర్భాగ్య ప్రజలు ఏర్పరచుకున్న కర్మగాక ఎవరిదనగలము?

శ్రీ కె. అంజయ్య

# వేదవ్యాసుడు బ్రాహ్మణేతరుడా ?

'భారతి' (డిసెంబరు 1978) లో శ్రీ ములుమూడి ప్రసాదరావుగారు ''సంప్రదాయం'' (కలగూరగంప) అనే వ్యాసంలో ఇట్లా వ్రాసినారు:

''వ్యాసుడ్ని, వాల్మీకిని సమాదరించిన విశాలదృష్టిగల పూర్వులు, తొలి మానవుర్ని సందుల్లో పందులుగా పరిగణించడ మేమిటి ? చిక్కువడిన వేదాలను విడదీసినదే బ్రాహ్మణేతరుడయిన ప్పుడు, వాటిని చదివిన ఒక వర్గం వారు, వాటిని 'యితరులకు'' అందుబాటులో లేకుండా చేయడమేమిటి''

దీనివల్ల వేదవ్యాసుడు బ్రాహ్మణేతరుడని శ్రీ రావుగారభి ప్రాయ పడ్డట్లు స్పష్టమవుతూంది. ఇరవై ఒకటో శతాబ్దం ఇక తరం కంటె దగ్గరగా వున్న వేళ, సర్వకులాలవారూ కూడగా, గుడ్డా, కొంప కోసం సతమతమయిపోతూన్న నేడు, నవగ్రహాలకు శాస్త్రజ్ఞులు వ్యోమయానం చేస్తున్ననేడు, అధర్వవేదం ''బృహత్'' అని వర్ణించిన పృధివి పుట్టచెండువలె చిన్నదైపోయిన నేడు వ్యాస వాల్మీకుల కులాల చర్చ చేయడం విడ్డూరంగా కన్పిస్తూంది నాకు. ఏభై అరవై యేళ్ల క్రితం పెండ్యాల వారికీ, శ్రీపాద వారికీ మరియూ కాశీభట్ల వారికీ త్రిపురనేని వారికీ జరిగిన వాదోప వాదాలు జ్ఞాపకానికి వస్తూన్నాయి. ఆనాటి వారు ప్రామాణికంగా నైనా వాదించేవాళ్లు ఇప్పటి వారు అశాస్త్రీయంగా, అప్ర మాణంగా, కేవలం తమ వూహాపోహల ఆధారంగా, తీర్మానాలు చేసేస్తూన్నారు అని చెప్పేందుకు వేదవ్యాసుడు బ్రాహ్మణేతరు డనడమే నిదర్శనం.

వేదవ్యాసుడు బ్రాహ్మణేతరుడా ? వ్యాసుని తండ్రి పరాశర మహర్షి — తల్లి సత్యవతి. తల్లి బ్రాహ్మణేతర మాదిరి కనబడు తూంది కాబట్టి వ్యాసుడు బ్రాహ్మణేతరుడు కాకమానుతాడా అని ఒక భావన. తల్లీదండ్రుల్లో ఒకరు బ్రాహ్మణులైనప్పుడు, వారి సంతానానికి సంక్రమించే కులం విషయంలో కొన్ని ప్రమాణాలు (Norms) వున్నాయి ప్రాచీన కాలంలో. అవి బీజ (పురుషుడు), క్షేత్ర (స్త్రీ) ముల తారతమ్యాలపై ఆధారపడి యుండేవి. బీజం ప్రధానమైనప్పుడు, తండ్రికులం వచ్చేది. ఇచట బీజం పరాశరుడు. బ్రాహ్మణుడు. ఇతడు చాలా గట్టివాడు. అందుకే క్షేత్రం బ్రాహ్మణం కాకున్ననూ వేదవ్యాసునకు బ్రాహ్మణత్వం వచ్చింది. ఇదే క్షేత్రం (సత్యవతి)లో శంతనునకు బుట్టిన విచిత్ర వీర్యుడు క్షత్రియుడైనాడు. ఇంకొక క్రొత్త విషయం బయటి కొస్తుంది. సత్యవతి బెస్తది కాదనీ, వసువనే రాజర్షికీ, శాపం పొంది చేపగా మారిన అప్సరసకూ జన్మించిన మత్స్యగంధి అనీ పరాశరుడే సత్యవతికి జెపుతాడ. రాజర్షి కూతురుకూ బ్రాహ్మణునికీ పుట్టిన వ్యాసుడే కులంవాడు కావలె ? బ్రాహ్మణుడు కాక క్షత్రియుడయితే ''నాన్‌బ్రామిన్'' ఉద్యమం వాళ్లకేం ప్రయోజనం ? ఈ నాటికీ క్షత్రియుడు (ఉదా: ఉదయపూర్ మహారాణా) క్షత్రియుడని చెప్పుకుంటాడు కానీ, నాన్‌బ్రామిన్ (బ్రాహ్మణేతరుడు) అని తనను తాను పిల్చుకోడు. స్వాయంభువ మనువు కూతురు దేవహూతికీ, కర్దమ ప్రజాపతికీ కలిగిన కపిల మహర్షి బ్రాహ్మణుడే\వేదవ్యాసుడు బ్రాహ్మణుడే కావల్సి వచ్చేందుకు ఇంకొక ఉపపత్తి ఏమంటే ఇతడు సద్యోగర్భాన పుడతాడు. పుట్టుతూనే ఇతడు వేదమయుడనీ, వేదవ్యాసుడనీ మహా భారతంలోవుంది. ద్వాపర యుగం వరకూ వేద విద్య బ్రాహ్మణేతరుల అందుబాటులో లేదు. నిషిద్ధం. తనకు పుట్టబోయేవాడు బ్రాహ్మణేతరుడయేటట్లయితే, వానికి జన్మతః వేదవిద్య-వచ్చేటట్లు పరాశరుడెట్లు సంకల్పిస్తాడు ? కలియుగంలో చెలామణి అయ్యే 'పరాశరస్మృతి'' వ్రాసిన పరాశరునికిది తెలియదా ? ఈ దృష్టిలో కూడా వేదవ్యాసుడు బ్రాహ్మణుడు కావలె. అంతర్వర్ణ వివాహాల వల్ల కూడ బ్రాహ్మణత్వంవస్తుందని పరాశరోదంతం చాటుతుంటే కాదు కాదు బ్రాహ్మణత్వం రావ డానికి దంపతులిర్వురూ బ్రాహ్మణులేకావలెననే తత్వంతో అనడం కుల తత్వానికి మచ్చుకాదా ? ఇక వేదవ్యాసుని వంశవృక్షం చూద్దాం. అంబిక, అంబాలిక (క్షత్రియ స్త్రీలు)లకూ వేద వ్యాసునికీ (బ్రాహ్మణుడు)వల్ల కలిగిన సంతానానికి (ధృతరాష్ట్ర పాండు జుల) క్షత్రియత్వం వచ్చింది. శంతనవంశానికి వారసులు కావలెను. అంటే క్షత్రియులు పుట్టవలెను. ఇచ్చట క్షేత్రం ప్రాధాన్యం వహించింది. అంబిక అంబాలికలు, విచిత్రవీర్యుని ''సుక్షేత్రము''లని అత్తగారు సత్యవతే కొడుకు వ్యాసునికి చెప్ప తుంది. వేదవ్యాసుడే గనుక బ్రాహ్మణేతరుడు (బ్రాహ్మణేతరుడు= శూద్రుడు) అయివుంటే సత్యవతి అతన్ని అంబికాంబాలికలకు సంతానం ఈమని నియోగించి వుండేదికాదు. శూద్రునకు క్షత్రియ స్త్రీ యందు కల్గిన సంతానం క్షత్రియం కాదు. శూద్రులే అవుతారు. శూద్రులకు ద్వాపరయుగమందు రాజ్యార్హత లేదు. మహాపద్మనందుడు వచ్చు వరకూ శూద్రులకు రాజ్యార్హత రాలేదు. అంబికాంబాలికలకూ, వ్యాసునకూ కల్గిన ధృతరాష్ట్ర పాండురాజులు క్షత్రియులుకాగా ఒక దాసికీ వ్యాసునకూ పుట్టిన విదురుడు శూద్రుడయినాడు. వ్యాసునికి ఈనియోగ సంతానమంటే ఏ తరాం ఇష్టం లేదు. వీరు తండ్రి గుణాలను సంతరించుకోలేదు. వీరు కాని, వీరి సంతానం (కౌరవ పాండవులు) కానీ వ్యాసుని మాటవినలేదు. భారతాంతంలో ఇదే అంటూ వ్యాసుడు వాపోతాడు. చేతులు పైకెత్తి ఇది ధర్మంరా, ఇది అధర్మంరా అని మొత్తు కుంటూంటే కూడా వినక పోతిరి కద రా అంటాడు. వ్యాసునకు ముద్దుల కొడుకు శుకమహర్షి. వ్యాసునకు అభిమానమైన భాగవతం చెప్పినవాడు బ్రాహ్మణుడు. వ్యాసులవారికి కులాభి మానం వుందన్న మాటేనా ? కాదు. బ్రాహ్మణునికీ, బ్రాహ్మణే తర స్త్రీకి కలిగిన కొడుకు బుషి అయినప్పుడేవాడు బ్రాహ్మణు డవుతాడని అర్థం.

ఇక నిగమశర్మ ''కేసు'' తీసుకొందాం. ఇతడు జన్మంచే బ్రాహ్మణుడైనా, బ్రాహ్మణాచారములను వదలినవాడు అంటే పతితుడు. వీనికీ, ఒక ''కడజాతినాతి''కీ (ఈమె భ్రష్టకాదు)

పుట్టిన సంతుకు బ్రాహ్మణత్వం రాలేదు. తల్లి కులమే వచ్చింది. బీజం తన వైశిష్ట్యం కోల్పోయింది కనుక. బ్రాహ్మణి అయిన దేవయానికి, క్షత్రియుడైన యయాతికీ కల్గిన యదు తుర్వసులు క్షత్రియులైరి కానీ వీరి వారసులకు రాజ్యార్హతరాలేదు వీరు రెంటికీ చెడ్డ రేవడలైరి.

వేదవ్యాసుని బ్రాహ్మణత్వా కోసం పోరాడే లోలుపత్వం నాకు లేదు. అతడే కులానికి చెందితే నాకేమీ బాధలేదు. కానీ, ఇటువంటి విషయాలు చర్చించేటప్పుడు, ఆ కాలంనాటి సంప్రదాయాలను లెక్కలోనికి తీసికొనవలెను. పురాణశాస్త్రాలలోని లక్ష్య లక్షణాలను పరిగణనలోనికి తీసికొనవలెను రచయిత (మహాభారత కర్త) హృదయం ఏమైవుంటుంగా అని ఆలోచించవలెను. అంతేకాని స్థూలపరిశీలనతో నిర్ణయానికి రారాదనే నా మనవి ఇటీవల మన మేథావులు "విశ్వామిత్ర సిండ్రోం" (Syndrome) తో బాధపడుచున్నారేమో అని నాకనుమానం అవుతుంది. బ్రాహ్మణుడు కాని వానికి "బ్రాహ్మణేతరు" డని పేరు. ఆ "బ్రాహ్మణ" పదం రావలెను. ఇదీ ఒకందుకు మంచిదే. ఆర్థికంగా, సామాజికంగా పై స్థాయి కెక్కు కొలదీ (Vertical ascent economically and socially), సంభాషణలో సంస్కృతీకరణం (Sanskritization in speech), ఆచారాలో బ్రాహ్మణీకరణం (Brahminization in habits) వచ్చుచుండుట నేటి మన సంఘంలో కన్పిస్తూన్న ప్రత్యక్షసత్యం. బువ్వ అనరు వీరు. భోజనం అంటారు. బాహ్మణుడంటే అతగాడన్ని సుగుణాలూ కల్గివుండాల్సినవాడని అనే నిశ్చయం వుంది. "వజ్రసూచిక" ఉపనిషత్తు ఈ సమస్యను చర్చించింది. బుద్ధుడు కూడా ఆదర్శ బ్రాహ్మణు డెలా వుండవలెనో "ధమ్మపదం" లో చెబుతాడు. బ్రాహ్మణున కన్ని సుగుణాలూ వుండవలె అనుకోవడం ఎందుకు? అవిలేని జన్మ బ్రాహ్మణుని చెడ తిట్టడం ఎందుకు? బ్రాహ్మణ కులం అదీ ఒక కులం అనుకుంటే సరిపోదా? మరి బ్రాహ్మణులు తెగ నీల్గుతారే అంటే నే జెప్పేదిది. బ్రాహ్మణ్యం అనేది ఒక 'ఆటిట్యూడ్.' జర్మన్ ఓరియంటలిస్టు హెర్డరును "జర్మన్ బ్రాహ్మణు" డనేవారు. అమెరికాలో 'బోస్టన్ బ్రాహ్మణు" లు (Boston Brahmins) ఉన్నారు. వీరి మనః ప్రవృత్తి ఎట్టిదని తెలియడానికి అమెరికాలో జనులలో వుండే ఒక నానుడి వినండి. Kennedys will talk only with Lodges and Lodges talk only with God! (కెన్నడీలు, లాడ్జులు రెండు ప్రముఖ "బోస్టన్ బ్రాహ్మణ" కుటుంబాలు). మక్కా బ్రాహ్మణులు అరేబియాలో వున్నారు. తెగనీల్గుడే బ్రాహ్మణత్వం కాలేదు. చప్రాసి అయినా, వంటవాడైనా బ్రాహ్మణునికి తెగనీల్గుడు పోవదు అని ఇటీవల కేంద్ర ప్రభుత్వములోని ప్రముఖ మంత్రి ఫిర్యాదు చేసినాడు. ఆత్మగౌరవానికి Euphemism ఏదైనా కావచ్చు. అది అందరూ అలవర్చుకొనవల్సింది.

వేద విద్య బువ్వ పెట్టుతుందా? వేద విద్య నేర్చినవారు బువ్వ చేయువారుగా (అనగా వంటవాళ్ళ) బతుకవలసి వస్తుంది పదిహేడు — పదునెన్మిదవ శతాబ్దంవాడగు వేంకటాధ్వరి "విశ్వగుణా దర్శ" మనే యాత్రా కావ్యం వ్రాసినాడు. ఇందు ఇద్దరు గంధర్వులు ఒక విమానంలో కూర్చుని కంచి నుండి హిమాలయాలకు పోతూ దారిలో కనపడే స్థలాల గురించి మాట్లాడతారు ఇందొకడు ఆశావాది. ఇంకొకడు నిరాశావాది. మొదటివాడు ప్రతి విషయాన్ని ఆశాజనకంగా పరిగణిస్తే, రెండవవాడు నిరాశామయంగా చిత్రిస్తాడు. విమానం గోదావరీ ప్రాంతానికి వచ్చినప్పుడు మొదటివాడు (ఆశావాది) ఆహా ఏమి ఆంధ్రదేశం! ఎంత మంది వేదవిదులో వున్నారిచట అని పొగిడితే నిరాశావాది యిట్లంటాడు: ఏమి వేద విద్య అయ్యా అది. వేదవేత్తలు వంటవాళ్ళగా "రాట్" అయ్యే ఆంధ్రదేశం గొప్పతనం ఏంటయ్యా అది! ఇద్దరు చెప్పిందాట్లోనూ సత్యం లేకపోలేదు. వేద విద్య పోషించదనేగా ప్రాచీనకాలంలో కూడ బ్రాహ్మణులు వేదాభ్యసనాన్ని వదలివేసి ఇతర వృత్తులవలంబించినారు! యౌధేయులు అనే బహువర్తపు (నేటి హర్యానా ప్రాంతం) బ్రాహ్మణులు ప్రాచీన కాలంలో సైనికవృత్తినీ, ఆధునిక కాలంలో వ్యాపార వృత్తినీ చేపట్టినారని రాహుల్ సాంకృత్యాయన్ అంటాడు. "మృచ్ఛకటిక" నాటకంలోని బ్రాహ్మణుడైన చారుదత్తుడు వ్యాపారి. శుంగులు, విష్ణుకుండినులు రాజకీయాల్లో ప్రవేశించిరి. నేటి మధురై (తమిళనాడు) లోని సౌరాష్ట్ర బ్రాహ్మణుల వృత్తి చేనేత అంటే ఆశ్చర్యపడరాదు.

వేదం (అంటే ముఖ్యంగా ఋగ్వేదం) నిరుక్తకారుడు యాస్కాచార్యులకాలం (క్రీస్తుపూర్వం వేయేండ్లు) నాటికే అర్థం కాని స్థితిలో వుంది. యాస్కుడే వేదానికి మూఢర్థాలున్నాయంటాడు. వేదం అర్థం చేసుకోకుండా దాని చిలుక పలుకులవలె వల్లించే వారిని హాస్యం చేసినాడు. ఎండిన కట్టెలమోపు నెత్తిన పెట్టుకొన్నట్లు ఎందుకీ వృథా శ్రమ అంటాడు. వేదార్థ రత్న పేటికకు తాళం చెవివలె ఈబడ్డ జైమిని మీమాంసను మనవాళ్ళు కర్మకాండ అనే స్పానర్‌గావాడినారు. శబరస్వామి, కుమారిలభట్టు, ప్రభాకర మిశ్రాదులు జైమినీయ మీమాంసను వేదంలోని కర్మకాండ సూచిగ వ్యాఖ్యానించినారు. నేటి కాలంలో వసన్‌మల్ నానక్‌రాం తదానిపండితుడు వేదార్థాన్ని తెలిసికొనేందుకు మీమాంస ఒక్కటే మార్గం అనీ, వేదంలో వుండేదే ఒక అర్థమనీ, అది పరమ గుహ్యమయిన ఆధ్యాత్మికజ్ఞానమనీ వ్రాసినాడు. ప్రాచీనుల్లో మధ్వుడూ, రాఘవేంద్రుడూ ఈలానే వ్రాసిరి. వేదార్థాన్ని తెలిసికొనేందుకు గురుకులాలే అక్కరలేదు. బ్రాహ్మణులే కానక్కరలేదు మాక్సుమల్లరు, ఓల్డెన్‌బర్గ్, గ్రిఫిత్స్, పీటర్‌సన్, స్టీవెన్‌సన్, లూయీరెనూ, గెల్డ్‌నర్, గ్రాస్‌మన్, అరవిందుల వేదాల్ని ఏ గురుకులంలోనూ చదువలేదు. జన్మతః బ్రాహ్మణులూ కాదు. నేడు 'వేదిక్ స్టడీస్' ప్రపంచ వ్యాప్తంగా సాగుచున్నాయంటే వీరి చేతి చలువే కదా! వేదాలు ఏ కొద్దిమందే దాచి పెట్టుకొన్నందున (సోమకాసురునివలె) కదా వేదవిద్య మూలబడింది? వేదం సర్వులూ చదువవలెను. చర్చించవలెను. సారం గ్రహించవలెను.

రండిపోదాం వేదాలు చదువుకొనేందుకు కలిసిపోదాం. "సం గచ్ఛధ్వం సం వదధ్వం" (ఋగ్వేదం).

**శ్రీ సర్దేశాయి తిరుమలరావు**

## వీరేశలింగం పంతులుగారికి తమిళ భాషా పరిచయం లేదా?

సంఘ సంస్కర్త కందుకూరి వీరేశలింగం పంతులుగారిని ఆ పేరుతోనే కథా పాత్రచేసి తమిళ మహాకవి సుబ్రహ్మణ్య భారతి 'చంద్రిక' అనే నవల (అసంపూర్ణం) వ్రాశారు. ఆ అసంపూర్ణ నవలను 'చంద్రిక కథ' పేరుతో గోపాల-కృష్ణ-రాఘవన్ గార్లు తెలుగుచేసి, 1971లో ప్రకటించారు.

వీరేశలింగం పంతులుగారితో వ్యక్తిగత పరిచయం లేకుండా సుబ్రహ్మణ్య భారతి ఆ నవల వ్రాయడానికి ఉద్యమించినట్లు నవల చదివినవారికి తప్పక స్ఫురిస్తుంది. పంతులుగారిని పాత్రచేయడంలో యథార్థ విషయాలు కొన్ని దెబ్బతిన్నాయి.

(1) ఖడ్గవాదియైన వీరేశలింగం పంతులుగారిని, సుబ్రహ్మణ్య భారతి కార్యవాదిగా చిత్రించారు.

(2) నవలలో పంతులుగారి భార్యను కూడా ఒక పాత్రగా చిత్రించినా, ఆమె పేరు (రాజ్యలక్ష్మమ్మగారు) తెలియకపోవడంచేత ఆమె పేరు ఎక్కడా పేర్కొలేదు.

(3) వీరేశలింగం పంతులుగారికి తమిళ భాషా పరిచయం ఉన్నదో లేదో తెలియకుండానే, నవలలో పంతులుగారిచేత తమిళంలో "ఈ దినం ఏమి వారం" అని (విశాలాక్షిని పంతులుగారు అడుగుతారు. "చంద్రిక కథ" తెలుగు అనువాదం - పుట 11) అడిగించారు.

ఈ పై మాట ఆధారంగా 'చంద్రిక కథ' తెలుగు అనువాద గ్రంథంలో, సుబ్రహ్మణ్య భారతిగారిని పరిచయం చేస్తూ డా॥ వల్లా రాధాకృష్ణశర్మగారు " .. వీరేశలింగం పంతులుగారు తమిళం మాట్లాడేవారని యీ నవల తెలియజేస్తుంది" అని వ్రాశారు.

శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రిగారి చిన్న కథలపై పరిశోధన సాగించిన నాకు, స్వర్గీయ రాయసం వెంకట శివుడుగారి కథలను పరిశీలిస్తూండగా వీరేశలింగం పంతులుగారికి తమిళ భాషా పరిచయం ఏ మాత్రమూ లేదనే విషయం బైటపడింది.

వీరేశలింగం పంతులుగారిని ఆ పేరుతోనే కల్పిత కథల్లో పాత్రచేసి తెలుగులో మొట్టమొదట కథలువ్రాసిన ఆద్యులు శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రిగారు కాగా, రెండవవారు రాయసం వెంకట శివుడుగారు. 'సుశీల' నవల వ్రాసిన శ్రీ నిడమర్తి సత్యనారాయణ మూర్తిగారు మూడవవారు.

"నేను రచియించిన రాజేశ్వరి" యను నవల యందును, 'మాలతి'; 'కావేరి' మొదలగు చిత్ర కథలలోను శ్రీ పంతులుగారి పాత్రను కథా రంగమున నిలిపి చూచి, గురువులును, ఆబాల్య సఖులును నగు వారి మరణము వలన జనించిన విషాదము నుండి యొకింత యూరడిల్లితిని" - అంటూ వెంకట శివుడుగారు 1931లో ప్రకటించిన 'శ్రీ వీరేశలింగ సంస్మృతి' అనే గ్రంథ పీఠికలో పేర్కొన్నారు.

వెంకట శివుడుగారి 'రాజేశ్వరి' నవల 1926 లోను, 'మాలతి' కథ మొదట 'భారతి' 1924 జూన్ సంచికలోను, 'కావేరి' కథ మొదట 'భారతి' 1929 జూలై సంచికలోను ప్రకటింపబడ్డాయి.

వీరేశలింగం పంతులుగారికి తమిళ భాష వచ్చునో రాదో తెలిసినవారు రాయసం వెంకట శివుడుగారు. పంతులుగారికి వెంకట శివుడుగారు అత్యంత సన్నిహితులు - 'కావేరి' అనే కథలో వీరేశలింగం గారికి తమిళం రాదనే వాస్తవాన్ని వెంకట శివుడు గారు ఈ విధంగా బయటపెట్టారు. 'కావేరి' అనే ఒక తమిళ వితంతువు పునర్వివాహ ప్రయత్నంలో వీరేశలింగం పంతులుగారి దగ్గరకు రాజమండ్రి వస్తుంది - ఆమె అంటుంది - "ఎటులో రాజమండ్రి పురముచేరి వీరేశలింగముగారి తోటలో పాదమిడితిని. ఆ మహనీయుని పాదముల కెరగి వన్నొక యింటిదానిని జేయుమని వేడితిని. ఆయన జాలిగుండె గలవాఁడు. కాని బొత్తిగ తమిళ మెఱుఁగడు. 'కావేరమ్మాళు' అను నా పేరే యాయనకు నోట దిరుగదు!'

— 'కనక ప్రవాసి'

## అమ్మ < మా?

జనవరి (79) 'భారతి' లో శ్రీ సర్దేశాయి తిరుమలరావుగారు తమ లేఖలో, నేను 'భారతి' (78) అక్టోబరు సంచికలో రాసిన 'ద్రావిడ భాషలలో మాతృ పితృ వాచకాలు' అన్న వ్యాసంలో లేని విషయాలు రెండు తెలియజేశారు. కృతజ్ఞతలు. అవి రెండూ ఇవి:

(1) సంస్కృతం 'మా' నుండి 'అమ్మ' ఏర్పడివుండొచ్చు

(2) సెమిటిక్ భాషల్లో 'అబ్బ' పదం వుంది.

నా వ్యాసం ప్రత్యేకంగా ఒక ప్రయోజనం కోసం రాయబడింది. అది ఆ వ్యాసంలో స్పష్టంగా వుంది- ధాత్వర్థ నిరూపణం అమ్మ/అప్ప అనే పదాల విషయంగా జరగడం కష్టమని చూపడం. ఆ దృష్టితో 'మా' నుండి 'అమ్మ' ఏర్పడి వుండొచ్చన్న విషయాన్ని వదలివేశాను. దానికి కారణం క్రింద వివరిస్తాను. రెండో అంశం కాల్డ్వెల్ గారి వ్యాకరణంలో విస్తృతంగా చర్చింపబడింది. దాని మీద కొన్ని తగాదాలు ఉండటంవల్ల మరో వ్యాసంలో విస్తృతంగా చర్చించాలని వదలివేశాను. ఈ చిన్న 'note' లో మొదటి అంశం రెండు దృష్టుల్తో చర్చిస్తాను.

(1) అమ్మ < అంబ నుండి ఏర్పడి వుండొచ్చనడంలో తాత్త్విక దృష్టి.

(2) అమ్మ < మా నుండి ఏర్పడలేదనడానికి భాషాశాస్త్ర పరంగా సామంజస్యం.

అంటే శ్రీ రావుగారు మా > అమ్మ అని 'వూహించడం' రెండు రకాలుగా తప్పన్నమాట.

(1) తాత్త్విక దృష్టి : దేవతలు పౌరాణిక దేవతలని, వైదిక దేవతలని రెండు విధాలుగా గుర్తింపబడి పరిశోధక ప్రపంచంలో చాలా కాలమైంది. శ్రీ అరవిందులే దీనికి నాంది పాడారు. ఇంద్రుడంటే స్వర్గంలో అచ్చరల నాట్యం చూస్తూ మురిసిపోయే భోగపురుషుడనే మన సంప్రదాయ పండితులు వ్యాఖ్యానించుకొంటూ ఉండిన ఆ రోజుల్లో మొదటిసారిగా 'మేధ'కు సంకేతమని నిర్ణయించిన వాడాయన. జాన్ ఉడ్రాఫ్, ఆనంద కుమారస్వామి, ...లా మొదలైన పండితుల గ్రంథాలనేకాల్లో వేదాల్లో వాడ... శబ్దాలు ప్రతీకలని అవి వాచ్యార్థం కల్గినవని అనుకోవడం ...శ్చాత్యులు వేదార్థాలను సరిగా వ్యాఖ్యానించలేకపోయారనీ ... వుంది. ఇది ఎందుకు రాస్తున్నానంటే శ్రీ రావుగారు ...శబ్దాన్ని 'లక్ష్మి' అన్న అర్థంలో మాత్రమే గ్రహించారు. ...నది పార్వతి, చదువు చెప్పునది భారతి అయినను 'మా' యే కదా !" (పుట. 68) అని ఆయన

...శ్రీ అరవిందులు చూపిన 'అంబ్' ధాతువులో చూపబడ్డ ...వతగాని, గురు బాల ప్రబోధిక చూపిన 'అభిశబ్దే' అన్న ...త్తిలోని 'సర్వం జనయ తీతి అంబా' అన్న నిర్వచనంలోని ... దేవత కాని -- 'పార్వతి' కాదు. పార్వతి — సరస్వతి — లక్ష్మి, ...రికి భర్తలు శివుడు — బ్రహ్మ — విష్ణువు. ఈ వరుస పౌరాణిక ప్రసిద్ధం. వైదిక దేవతలలో ఈ సంబంధాలు చెల్లవు.

అంటే 'అంబ' అని పిలువబడ్డ దేవత 'వాగ్రూపయైన భగవతి' అన్న విశిష్టార్థంలో గ్రహించాలి అక్కడ. వ్యవహారార్థంలో కాదు. ఇదెక్కడి సంప్రదాయం అని పాఠకులకు సందేహం రావచ్చు.

దాక్షిణాత్యులు కంతగా పరిచయంలేని కాశ్మీర శివాద్వైతం ఒకటి పరాపశ్యంతి మధ్యమ వైఖరీ రూప చతుష్టయాత్మకంగా 'వాక్కు'ను భగవతిగా భావించింది. ఆ తత్త్వ నేపథ్యంతో 'ధ్వన్యాలోకం' అన్న అలంకార గ్రంథం రచింపబడింది. అందులో ఒక కారిక వుంది.

'సరస్వతీ స్వాదు తదర్థవస్తు' ఇత్యాది (1ఉద్ద్యోతం-7) దీనికి వ్యాఖ్యానం రాస్తూ లోచనంలో అభినవగుప్తపాదులిట్లన్నారు:

"సరస్వతీతి వాగ్రూపా భగవతీ త్యర్థః" అని.

ఈ సరస్వతి ఇచ్చట బ్రహ్మదేవుని భార్యకాదు. నిదర్శనం :

'యదున్మీలన శక్త్యైవ విశ్వ మున్మీల తిక్షణమ్
స్వాత్మాయతన విశ్రాంతాం తాం వందే ప్రతిభాం శివామ్'

అన్న వారి మంగళ శ్లోకాల్లో ఒకటి (ప్రథమోద్ద్యోతాంతం).

పై విషయమంతా నేను భావించి కూడా భాషా శాస్త్ర వ్యాసంలో ఇలాంటి తాత్త్విక విషయాలు అప్రస్తుతాలవుతాయని ఒక వాక్యం మాత్రం రాశాను.

"ప్రపంచోత్పత్తి శబ్దోత్పత్తి రెండూ అభిన్నాలని తాత్త్వికులు భావించారు" (పుట. 27)

ఈ తాత్త్వికులు కాశ్మీర శివాద్వయ వాదులన్నమాట. ప్రత్యభిజ్ఞా, స్పంద సిద్ధాంతాది ప్రవర్తకులు. వీరే అలంకార శాస్త్రానికి నాంది భారత వాక్యాలు పాడారని ఆ శాస్త్ర పరిశోధకులకు బాగా పరిచయమున్న విషయం.

ఆ దృష్టిలో 'వాక్కు' (శబ్దార్థ సమాహారం) దేవీ స్వరూపం. భావనారూపుడైన (చిద్రూపుడు) పరమేశ్వరుని అంశమాత్రమైన అర్థాన్ని వహింపుకొంటూ వాక్కు శబ్దరూపంలో లోకావతరణం చేస్తోంది. మరల స్ఫురణానుభవంలో హృదయోన్మేషాన్ని పొంది పరమేశ్వరునితో లయమౌతోంది. ఇది పరమశైవమైన సిద్ధాంతం. ఇది వైదికమైన భావం. సర్వాన్ని జనింపచేస్తున్న 'అంబ' ఆ దేవి అంటే ఇచ్ఛాజ్ఞానక్రియా శక్తులకు వ్యక్తి కృతరూపాలే శ్రీవాణీ గిరిజలు (చూ. నన్నయగారి అవతారికా శ్లోకం). ఈ ముగ్గురిలోని పెద్దమ్మ (పోతనగారి మాట ఇది) ఒకరున్నారు. ఆమె పైన చెప్పిన దేవి. ఇది దేవీవాదుల ననుసరించి. కొందరు వేదాంతుల్ని అనుసరించి వాక్కు బ్రహ్మపదార్థం. (చూ. అనాది నిధనం బ్రహ్మశబ్ద తత్త్వంయదక్షరీత్యాది వాక్యపదీయ ప్రారంభ శ్లోకం) — నిర్గుణం. నిర్లింగం. అక్కడ దేవి లేదు. కొందరి ననుసరించి అసలా పదార్థమే లేదు. (దీన్నే చార్వాక మంటారు. ఆధునికుల పద్ధతి ఇది).

అమరసింహుడు కూడా వైదికార్థాన్నే భావించాడనడానికి 'మా' శబ్దాన్ని ఆయన ఇలా నిర్వచించాడు:

'లోకానాం మాతా లోకమాతా'

మా — అస్యైవ నామ్న ఏకదేశ గహణం మేతి (మాఇతి)

(పుట. 32)

లక్ష్మిని కూడా లోకమాత అంటున్నారే మరి. 'మాత' శబ్దాన్ని కవికుల గురువు 'మాతా మరకత శ్యామా' అని 'అంబ' ను పిలుస్తూ వాడుతాడు. వ్రతాల్లో మామూలుగా సరస్వతిని కూడా 'జగన్మాతే' నమః అని ప్రార్థిస్తూ వుంటాం కదా! వాగర్థాలు పార్వతీ పరమేశ్వరులని కాళిదాసు భావన.

**భారతీయుల** భావన చాలా విచిత్రమైంది. అనంత వైవిధ్యంలో ఏక సూత్రాన్ని దర్శిస్తారు. అది స్థూల దృష్టికి చాలా విడ్డూరంగా కనిపిస్తుంది. పౌరాణిక దృష్టిలో అంబ=పార్వతి కాబట్టి జనయతి=ప్రసవించడం అనే వాచ్యార్థంలో మాత్రం శ్రీరావుగారు గ్రహించారు కాని అక్కడ అది వ్యజకం. సర్వావ్యక్త వస్తు భావాలూ శబ్దం చేత బహిర్గతమవుతున్నాయి. శబ్దం చేతే వ్యక్తి వస్తువిషయ వైవిధ్యం గుర్తించడానికి అవుతోంది. ఇలా ప్రపంచోత్పత్తి శబ్దోత్పత్తి – అవ్యక్తం వ్యక్తం మారడం అన్న సూత్రాన్ని ఆధారపడి జరుగుతోంది. ఇలా రెండు క్రియలకూ 'అంబ' ఆ దేవి – అని వివక్షితార్థం.

భావిస్సెక్ అన్న ఒక భాషా శాస్త్రవేత్త ఒక ఉదాహరణం ఇస్తుంటాడు :

**'The invisible God created the visible world'**

అని, ఆ అవ్యక్త తత్త్వం 'అంబ'. ఆమె ఇచ్ఛారూపం. వాగుచ్చారణం వక్తిచ్ఛా పరతంత్రమై ప్రవర్తిస్తోంది. అంటే మాట్లాడుతున్నది మనం కాదు — లోపలి 'అంబ'. మనం అనుకొనే దశ వ్యావహారికం. అప్పుడు 'చదువు చెప్పునది భారతి' అని భావిస్తాం. మాట్లాడిస్తున్నదెవరు ?

ఈ దృష్టితో మానుండి అమ్మ ఏర్పడలేదని చెప్పగలం, మాతృ — మాత - మా (హిందీ) ఇవి సంబంధం వున్న పదాలు కావచ్చు అమ్మ 'అంబ' పదంతో సంబంధం కల్గింది మాత్రమే. ఇది ఆ వ్యాసంలో వివక్షించిన అర్థం.

(2) భాషాశాస్త్ర దృష్టి : తో కూడా శ్రీ రావుగారు ఇచ్చిన వివరణం దోషయుక్తంగా వుంది.

''తమిళము అరవ భాష. 'అ' శబ్దముతో మొదలుపెట్టు భాష. 'రంగము' 'అరంగము' అగును. మూల ద్రావిడ భాషలో కూడా ఇతర భాషల నుండి వచ్చిన పదములకు 'అ' తలిగింపబడి యుండును'' (పుట 68)

మూలద్రావిడ భాషలో 16 హల్లులున్నాయని నిరూపణం జరిగింది. వాటిలో ఏడు హల్లులు మాత్రమే పదాదిలో కనిపించడం లేదని, ఒక సమయం ఏ భాషల్లో అయినా కనిపిస్తుంటే వర్ణ వ్యత్యయం (మెటాథీసిస్) వల్ల పదాదిలోకి వచ్చి వుండాలని భాషా పరిశోధకులు నిర్ధారించారు. (చూ. డా. భద్రిరాజుకృష్ణమూర్తి ch. 1. 1961)

'మా'లోని /m/పై హల్లులలోనిది కాదు. అంటే మూల ద్రావిడంలోకి సంస్కృతంలోనుంచి నేరుగా అలాగే గ్రహింపబడ వచ్చుని అర్థం. అంటే శ్రీ రావుగారిచ్చిన ఉదాహరణం 'రంగం' అరంగంగా మారడానికి 'ద్రవిడియన్ ఫొనెటిక్ కన్‌స్ట్రెయింట్స్' సానుకూలంగా ఉన్నాయి—కాని 'మా' విషయంలో లేవని అర్థం.

అంటే 'అ' చేర్పబడటానికి శాస్త్రీయమైన కారణం ఏదీ లేదని అర్థం.

ఈ రెండు దృష్ట్యలతోనూ వారి ఊహ సమంజసం కాదని చెప్పక తప్పదు.

— శ్రీ హెచ్. ఎస్. బ్రహ్మానంద

## లేఖ

## "గోడలవెనక"(జైలుజ్ఞాపకాలు)

డిసెంబర్ 1978 ''భారతి'' లో కోడూరి మూర్తిగారి ''మూడు దశాబ్దాల తెలుగు సాహిత్య చరిత్ర'' అనే వ్యాసం చదివాను. అందులో ఆయన వ్రాసారు: ''స్వీయచరిత్రలు రచయిత వ్యక్తిగతముపై ''మెమోయిర్స్'' రచయిత భాష, శైలి పరిశీలనా దృష్టి విధానము వీటిమీద ప్రధానంగా ఆధారపడతాయి''. ''జ్ఞా (memoirs ) అనే రచనా ప్రక్రియలోనే నిఖిలేశ్వర్‌గారు తె వ్రాసిన ''గోడలవెనక'' (జైలు జ్ఞాపకాలు) అనే చిన్న పుస్త మూర్తిగారి పైవర్ణనకు సరిగ్గా సరిపోతుంది. ఈ పుస్త 1972లో వెలువడినా ఆయన దృష్టికి వచ్చినట్టులేదు నిఖిలేశ్వ గారి ''గోడలవెనక''ను ఇంగ్లీషులో "The walls" అనే శీర్షికతో మోహన్‌రాంగారు అనువదించారు. "The point of view" (ఢిల్లీ నుంచి వెలువడే వారపత్రిక)లో అది ధారావాహికముగా ప్రచురించబడినది. ఆ తర్వాత ఈ ''జ్ఞాపకాలు'' పంజాబీ, మళయాళం భాషల్లోకి కూడా అనువదించినట్టు తెలుస్తున్నది .

శ్రీ డి. రామానుజరావు



# గ్రంథ విమర్శలు

## ఉపనిషత్తు కాలామృతము

అను

## భారతీయ తత్త్వచర్మిత

[రచయిత : శ్రీ నిడమర్తి వేంకటశేషగిరిరావు, డెమ్మీ సైజు 259 పుటలు, మూల్యము 5 రూ. ప్రాప్తిస్థానము — రచయిత–46-7-31 దానవాయిపేట, రాజమండ్రి–533103.]

వేదాంత విషయాన్ని ప్రతిపాదించే యీ గ్రంథంలో ముండక మాండూక్యోపనిషత్తులు, గౌడపాదకారికలు తాత్పర్య సహితంగా 84 పుటలలో ఉన్నవి తర్వాత 50 శీర్షికలకు స్వైగా తమకు తోచిన విషయాలు, సృష్టులు, సూర్యవంశం, ప్రళయ, మన్వంతరాలు, గీతాయజ్ఞాలు, విద్యారణ్యులు, ఇక్ష్వాకుల వంశము, మొదలైన విషయాలు వేదాంతానికి సంబంధించినవీ, లేనివీ కూడా ఇవి. రచయిత వేదాంతాన్ని గురించీ, వివిధ మతాలను, గ్రంథము మతప్రచారకులను గురించీ తమకు తోచిన విషయాలనన్నిటినీ గ్రంథరూపం యిచ్చి ముద్రింపించినట్లు తోస్తున్నది రచ చెక్కు విషయాలు తెలిసి ఉండవచ్చును గాని, వాటిని చెయ్యకుండా క్రమమైన పద్ధతిలో సుబోధంగా వెల్ల వ్యం ఉన్నట్లు తోచదు. ఉపనిషత్తులు రెండిటికీ, ఎకలకూ యిచ్చిన తాత్పర్యమైనా సుబోధంగా కాన క ఉదాహరణ.

స్వప్న నిద్రాయుతా వాద్యా ప్రాజ్ఞస్త్వ స్వప్ననిద్రయా(?)
నిద్రాం వైనచ స్వప్నం తుర్యే పశ్యంతి నిశ్చితాః,

స్వప్న నిద్రయందు అంతః ప్రజ్ఞాగల ప్రాజ్ఞుని నిద్రయం దున్న ప్రాజ్ఞుని యందే అంతఃప్రజ్ఞ లేకపోవుటచే శరీరాంతమందు తురీయమున ఆ శరీరిని, ప్రజ్ఞ లేనివానిగా తెలియగలరు. అనగా— శరీరమువలె జాగ్రత్,స్వప్న, సుషుప్తి అను అవస్థలు లేక నిత్యునిగా ఎరుగుదురు'' [పుట 33] ఉపనిషత్తులనుటకు బదులు ''ఉపనిషతులు, ఉపనిషదులు'' అని ప్రయోగించుట విచిత్రంగా కానవస్తున్నది.

''జొరోస్ట్రియనులు'' అన్న శీర్షికలో వారిని గురించి ఏమి కానరాదు. అందులో జైనుల ధన సంపాదనను గురించే కొంత చెప్పబడింది.

''భారతదేశమున వేదమతము, బౌద్ధమతము, జైనమతము— మూడు ప్రధానములుగా బుద్ధుని అనంతరము వెలసిల్లినవి.''
(పుట 255)

వైదికమతం బుద్ధునికి తర్వాత వచ్చిందేనా ?

ఈ పుస్తకం మంచి కాగితములపై అచ్చయినా తప్పులు మాత్రం లెక్కలేనన్ని ఉన్నాయి. ప్రతి పుటలోనూ (ఇంచుమించుగా) తప్పులు కనబడతాయి. కొన్నిచోట్ల మరీ విపరీతంగా తోస్తుంది

''శ్లో॥ ఆహార నిద్ర భయమైధునాంచ
సామాన్య మేవత్ పశుభిః నారాణావ్,
ధర్మో హి తేషాం మధికో విశేషః
ధర్మేణ హీనః పశుభిః సమానః'' (పుట 250)

ఇది తప్పుల తడక. దీని అభిప్రాయం ''అర్థకామనులు ధనము (ఆహారము) మైధునము పశువులకు మానవులకు సమానము. అర్థ (సంపాదనకృషి) ధర్మము మానవులకు కలదు...'' అని వుంది. ఇది ఎంతవరకూ ఉచితంగా ఉన్నదో ఊహించవచ్చు.

దీని రచనవల్లనూ, ప్రకటనవల్లనూ రచయిత అనుకొన్నంత ప్రయో జనం ఉంటుందని తోచుటలేదు.

## సమాలోచన

[జాతీయ సాంస్కృతిక పక్షపత్రిక — సంపాదకుడు : శ్రీ బులుసు సీతారామశాస్త్రి. క్రౌను 1/4. వార్షిక సంచిక. పుటలు 64. వెల 1–00, ప్రతులకు : సంపాదకుడు ' సమాలోచన'' 6–8–7. ఇన్నీసుపేట. రాజమండ్రి–1]

ముఖపత్రంమీద ''జాతీయ సాంస్కృతిక పక్షపత్రిక'' అని వున్నా లోపలి పుటలపైని ''జాతీయ సాహిత్య పక్షపత్రిక'' అనియే ఉన్నది. దానికనుగుణంగా ఇందులో సారస్వతానికి సంబంధించిన వ్యాసాలే అధికంగా కానవస్తున్నవి. గత సంవత్సరం ''సమాలోచన'' సంచికలలో ప్రకటింపబడిన వ్యాసముల పట్టిక యిందులో చివరి మూడు పేజీలలో ఇయ్యబడింది. దానినిబట్టి చూచినా యీ పక్షపత్రిక సాహిత్య పత్రికగానే కానవస్తుంది.

సినిమా పత్రికలకూ, కథల పత్రికలకూ ఉన్న ప్రచారం, ప్రజాదరణ సాహిత్య పత్రికలకు లేదు. కేవలం సాహిత్య సేవచేసే మాసపత్రికలు ఎంతో శ్రమపడితేనే గాని నిలిచి ఉండవు. అట్టి స్థితిలో ఇట్టి పక్షపత్రికను స్థాపించి నడుపుతున్న విద్వాన్ బులుసు సీతారామశాస్త్రిగారి ధైర్యసాహసాలు ఎంతో ప్రశంసించదగినవి. సాహితీరంగంలో ప్రసిద్ధులైన విద్వత్కవుల ప్రోత్సాహం దీనికి ఉండుట మిక్కిలి హర్షించదగినది.

ఈ వార్షిక సంచికలో 26 వ్యాసాలున్నవి. వీటిలో పన్నెండు పద్యకావ్యాలు. రామకృష్ణుని కవిత - వాస్తవికత — శరత్ జీవితం సాహిత్యం స్వాతంత్ర్యానంతరం తెలుగు నవలా వికాసం, ప్రబంధ

కవులు, స్త్రీ వర్ణన, అన్యదేశ్యములు, భారత ప్రాశస్త్యము — పరమార్థము సాహితీపరులకు ఆమోదాన్ని కూర్చే వ్యాసాలు కవి మహోత్సవాలను గురించి వివరించడం, గ్రంధసమీక్షకు ప్రాధాన్యం ఇవ్వడం ''సమాలోచన'' ప్రత్యేకతగా తెలుస్తున్నది.

సంపాదకులు తమ సంపాదకీయంలో సాంఘిక, రాజకీయాలను కూడా మొగమాటం లేకుండా విమర్శించడం మెచ్చుకోదగినది

కాగితాల కరవు, కాగితాల ధర, ముద్రణవ్యయం రోజుకు రోజూ పెరిగిపోతున్న యీ కాలంలో మంచి కాగితంపై చక్కగా ముద్రించిన యీ పత్రిక ఎంతో ఆకర్షణీయంగా ఉన్నది.

ఈ పత్రిక కలకాలం నిలిచి సాహితీ సాంఘిక సేవలుచేస్తూ సహృదయుల ఆదరాన్ని సంపాదించగలదని ఆశిస్తున్నాను—

*"ఆంగీరస"*

## రెండు మంచి పుస్తకాలు

[నల్లనాగు (కథల సంపుటి) రచన: దాశరథి రంగాచార్య వెల: రు 3-50. ప్రచురణ: విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, చంద్రం బిల్డింగ్స్, విజయవాడ-520004.]

కథ అంటే యేమిటి? కథలో శిల్పానికి ప్రాముఖ్యం ఇవ్వాలా? శైలికి ప్రాముఖ్యం యివ్వాలా? ఇతివృత్తం మంచి దయినప్పుడు శైలి, వస్తువు విడివిడిగా కనిపించవనీ, అలా విశ్లేషించడానికి వీలులేదనీ చాలా మంది ప్రముఖ పాశ్చాత్య రచనలు విశదం చేస్తవి. ఇందుకు ప్రతిగా చమత్కారం, హాస్యం, సందేశం, ప్రబోధం, హితవు వంటివయినా వుండాలి లేదా ఒక సంఘటనో, దృశ్యావో మనోజ్ఞంగా చిత్రించడమే కథ లక్ష్యం అనే వాదన కూడా ఉన్నది. అలంకార శాస్త్రం కావ్యానికి ప్రధానమని నిర్దేశించిన లక్షణాలన్నీ కాకపోయినా, ఒక్కటయినా కథకు ఉండడం అవసరం అనే వాదన కూడా ఉన్నది. ఏ విధంగా చూచినా తెలుగు కథ చాలా పరిణతి చెందినదనే అనిపించుతుంది.

తెలుగులో మంచి కథలు వ్రాయగల వారు అంత ఎక్కువ మంది లేకపోవచ్చు గాని, ఉన్నవారందరూ ఉన్నత శిఖరాల నందుకొన్నారేమోననిపించుతుంది. ఇలాంటి రచయితలలో దాశరథి రంగాచార్య ఒకరు. నవల వ్రాసినా, కథ వ్రాసినా ఆయన ఒక ప్రత్యేక శైలిని అనుకరిస్తారు. అందులో ప్రాంతీయులు ఎక్కువగానే ఉన్నప్పటికీ, సార్వజనీనత దెబ్బతినకుండా వ్రాయగలరాయన

ఆయన వ్రాసిన పదిహేడు కథలను ''నల్లనాగు'' అనే శీర్షికన విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్ వారు ఒక సంపుటిగా ప్రచురించారు. ఈ కథ లన్నింటిలోనూ ''మళ్ళీ మహాత్ముడు మన మధ్యకు వచ్చాడు'' చాలా బాగున్నది. గాంధీగారు బ్రతికి మనలోకి ఏనాడు వస్తే దేశ ఆర్థిక సాంఘిక, నైతిక పరిస్థితులను గురించి ఏమనుకుంటారు? ''అయ్యో ఇదా భారతదేశం ?'' అని ఖాపోతారా? లేక ఎవరో వృద్ధుడు మహాత్ముని వేషంలో ప్రజలను మోసం చేస్తున్నాడనే ఆరోపణతో ప్రభుత్వం ఆయనను అరెస్టు చేస్తుందా?

''పెన్సిలు భారతం'' అనే కథలో నేటి ప్రభుత్వంలోని అధికారులు అనుసరించే పద్ధతులను స్థితికారుగా రచయిత విమర్శించారు.

'నిరుద్యోగ్యం' అనే కథ పాఠకుణ్ణి నవ్వించడమే కాకుండా, ఆలోచించేట్టు చేస్తుంది. ఇంట్లో పనిచేసే మనిషి (స్త్రీ) అందంగా వుంటే ఎంత నిష్ఠాపరుడయినా వ్యామోహానికి లోనవుతాడని ''నల్లనాగు'' కథ సూచించుతుంది. ఈ కథలో ధ్వని మాత్రంగా రచయిత వెల్లడించిన అభిప్రాయం గురించి చాలా చర్చించవలసి వున్నది. సాధారణ విషయాలనే అసాధారణంగా చిత్రించడం కళ ప్రధాన లక్షణం కదా! కనుకనే సంఘంలో మామూలుగా జరిగే సంఘటనలనే రచయిత ఆయన వ్యక్తి నిశితంగా పరిశీలించి... ఆయా సంఘటనలకూ, సన్నివేశాలకు దోహదపడిన పరిస్థితులను హృద్యంగా చిత్రించగలగాలి. ఇలాంటి చిత్రణ ఈ కథ లన్నింటిలో కాకపోయినా కొన్నింటిలో నయి ఉన్నది కనుకనే ఇది మంచి కథల సంపుటి.

## 2 కొల్లాయి గట్టితేనేమి? (నవల)

[రచన: మహీధర రామమోహనరావు వెల రూపాయలు. ప్రచురణ: విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌ బిల్డింగ్స్, విజయవాడ, 520011.]

''ఒక ఉద్యమాన్ని లేదా, సంస్కరణను ఇతివృత్తం చేసుకొని నవల వ్రాయడం అంటే సమకాలీన సమాజంలోని దిగుళ్ళను చిత్రించటమే. అదే (ఒక విధంగా) చరిత్ర అవు. చారిత్రక ప్రయోజనంలేని నవల మంచిది కాదని అనలేము గాని ఒకదేశంలోని ప్రజల ఆచార సంప్రదాయాలనూ, ఆలోచనలనూ, కష్టసుఖాలనూ చిత్రించేది ఉత్తమ నవల అవుతుందనడం అసమంజసం కాదు'' అని ఒక విమర్శకుని అభిప్రాయం. తెలుగులో ''మాలపల్లి,'' వంటి నవలకు ఈ నిర్వచనం వర్తించుతుంది. ఆ కోవలోనిదే ''కొల్లాయి గట్టితేనేమి ?'' అనే నవల.

స్వరాజ్యోద్యమం కాలంనాటి కొన్ని సంఘటనలనూ, ఆ సంఘటనల వల్ల సంఘ జీవితంలో వచ్చిన మలుపులనూ పండితుడయిన ఈ రచయిత చక్కగా చిత్రించారు ఈ నవలలో.

వ్యక్తిలో పరస్పర విరుద్ధాంశాలూ, లక్షణాలూ, సహజీవితాలూ వుంటాయనీ, వాటి కారణంగానే వ్యక్తి ఆలోచనలకూ, ఆచరణకూ పొంతన కుదరడం లేదనీ కొంతమంది పండితుల అభిప్రాయం. ఈ రచయిత పూర్తిగా ఆ కోవలోని వాడని అనలేము గాని తాను చిత్రించిన పాత్రలలో ఆ వైరుధ్యాలను చూపిం

చారు. తరగతి, వర్గం దృష్టితోనేగాని వ్యక్తిని వ్యక్తిగా విశ్లేషించే అలవాటు కొంతమంది రచయితలకు లేదు.

మన ఆదర్శాలు ఎప్పుడూ మన ఆచరణ కంటే ముందే వుంటాయి. అనుకొన్నవన్నీ చేయలేకపోతున్నాము. ఏదయినా ఒక పని చేద్దాం అనుకొని, నూటికి నూరువంతులూ ఆ పని చేయగలిగితే ఇక అది ఆదర్శం కాజాలదు గదా! ఇలా ఆదర్శాన్ని ఆచరణలో పెట్టలేకపోవడం వ్యక్తిలోని ''కాంట్రడిక్షన్స్'' ఫలితమని కొందరు రచయితల అభిప్రాయం, కాని పరిణామంలో ఇది కూడా ఒక దశ అని గ్రహించితే పోనీ, ఒప్పుకొన గలిగితే వ్యక్తుల ప్రవర్తన సమగ్రంగా అర్థమయ్యే అవకాశం వుంటుంది.

''కొల్లాయి గట్టితేనేమి'' గొప్పనవల అని ఈనాడు కొత్తగా ఎవరూ చెప్పనవసరం లేదు. కాని — ఈ తరం యువకులకూ, రచయితలకూ, తదితరులకూ కూడా ''పునర్ వివాహం'' ''హరిజనోద్ధరణ'' గాంధీగారి ప్రవచనాలను, అగ్రహారాలలోని మూఢ, ఆచారాలూ — పట్టింపుల వంటివి అంతగా తెలియకపోవచ్చు. బాల్యంలోనే వివాహమయిన యువతులు ఎదుర్కొనే సమస్యలు, విదేశ వస్తు బహిష్కరణ, సహాయ నిరాకరణ, వంటి వాటిని శ్రీ రామమోహనరావుగారు ఈ నవలలో చక్కగా విశ్లేషించారు. కాన, వీటన్నింటికంటే, ఆయన పాండిత్యం, పరిశీలనా శక్తి, విశ్లేషణా పాటవం ఈ నవలలో అధికంగా కనిపిస్తాయి.

ఈ నవలలోని వివిధ సంఘటనలలోనూ, మానవతా దృష్టి వ్యక్తమవుతుంది. ఉత్తమ రచనకు అంతకంటే గొప్ప లక్షణం వేరేమి ఉంటుంది? ఇది చారిత్రక నవల అనీ, ఇందులో ద్వంద్వ మనస్తత్వ చిత్రణ ఉన్నదనీ వేరే చెప్పనవసరం లేదు. ఎందుకనంటే ద్వంద్వ స్వభావాల నుంచే రచయితకు కావలసిన ఇతివృత్తం లభించుతున్నది. అదీ కాక సంఘంలో, వ్యక్తిలో ద్వంద్వ ప్రవృత్తి అనేది అసలున్నదా? ఒకే ప్రవృత్తిని వివిధ దశలలో చూచి అది ద్వంద్వ ప్రవృత్తి అంటున్నామా?

ఏమయినా ఈ నవలలోని రామనాథం పాత్ర చాలా బాగున్నది. అలాగే స్వరాజ్యం, విశాలక్షి వంటి పాత్రల చిత్రణ బాగున్నది. అన్నింటి కంటే శైలి బాగున్నది. ఇతివృత్తం గొప్పది. ఒక లక్ష్యంతో వ్రాసిన నవల ఇది. ఈ కారణాలవల్ల ఇది మంచి నవల.

— శ్రీ వి ఎస్ అవధాని

## జలపాతం

[కవితా సంకలనం ; సంపాదకుడు — కాశోజి, డెమ్మి 1/8 110 పేజీలు — వెల రు — 4/— ప్రతులకు — ప్రగతి సాహితి, 009 — కావేరి, జవహర్‌లాల్ నెహ్రూయూనివర్సిటి, న్యూఢిల్లీ.]

కల్యాణం వచ్చినా కక్కు వచ్చినా ఆగనట్లు, కవిత్వం గూడ ఆగేటట్లు లేదు; కాబట్టే అంతదూరాన ఢిల్లీ ఎర్రకోట ప్రక్కన నెహ్రూ యూనివర్సిటీలో ఈ కవిత్వం పుట్టి, తెనుగు దేశానికి పాకినది; మంచిదే!

ఈ కవులు ఎక్కువల్లెట్లు—వారి సహవాసులుగా ఉన్నట్లున్నది. కాబట్టే దోపిడి పదం పల్లవి అనుపల్లవిగా నున్నది. మాటల సందడి, తాటాకుల చప్పుడు గానే ఉన్నవి - ఎక్కువ ఖండికలు; కొన్నిటిలో భావం అంతుబట్టడం లేదు; కొందరి రచన ఇంకా కుదురుకోలేదు. మరి కొందరికి మడికారం కుదిరి ఉన్నది; ఇంక కొందరికి భాష, భావం రమణీయంగా ఉన్నవి. రాట్నం మార్కు దేశభక్తులను నమ్మవద్దని చెప్పను కాబోలు ఆ బూవ్యంగ్య చిత్రం అట్టమీద వేసినారు.

ప్రస్తుత వ్యవస్థపై రోత పుట్టి, గీతా ప్రవంతులను జలపాతంగా క్రుమ్మరించినారని, సంపాదకుడు — కాశోజి/రచయితలను పరిచయం చేస్తున్నాడు. ఈ గ్రంథం, సాహితీ మహాప్రస్థానంలో ఒక ముందడుగని, వెనుక అట్ట చెపుతున్నది. మంచిదే కాని, మానవద్వేషంలో రక్త దాహంతో ఈ జలపాతం మలినమై పోయి ఉన్నది; పురోగమనం కుంటుపడినది.

(సీతారామశాస్త్రి) గుమస్తాను వర్ణించిన తీరు, ఈనాటి టెరిలిన్ చొక్కాల జలగల సంగతి కాదేమో! బాల్‌రాం ఆవేదన బాగున్నది. ''ఆకులో ఆకాశాన్ని, ఆకాశంలో అదవులని చూడలేని వాడు మనుషుల మహత్తు మాడలేడు'' అన్న శివారెడ్డి వ్రాత, ఆత్మోన్ముఖమై ఈ పుస్తకంలో ఒదిగేటట్లు లేదు. సంసారాన్ని వల్లకాడుగా భావిస్తాడు — విద్యార్థి; మతెంతో గతి అంత! కిషన్ రావు అగ్గిపుల్ల మధుర భావ బంధురం.

కొన్ని చక్కటి మడికారాలు :—దూరం చేసుకోలేని చలిని మాత్రం మీరు కప్పుకోని (సుధాకర్) — పూలు పూస్తున్న గడ్డి పరకలు స్వాగతం చెబుతాయి దర్శని బాబు — ఎరుపెక్కిన ముంగిస మూతిలో మళ్లీ అదే సూర్యుడు (గోపి) — ఈర్ష్యా ద్వేషాలు వారికి పుట్టుమచ్చలు (రామిరెడ్డి) — చిరునామా లేని జీవితం (నారాయణమూర్తిరాజు)

కొన్ని ఒడుదుడుకులు :— చెమటను ముక్కలు ముక్కలుగా చేయటమేమిటి? (మూర్తిరాజు) నిప్పుల తెప్పలు — అంటే? (సుధాకర్) కడిలి కాదయ్యా అది కడలి (రాజగోపాలరావు).

## తుకారా

[కృష్ణదేవరాయల చారిత్రక మహాకావ్యము — విద్వాన్ బర్నీడి ప్రసన్నకవి క్రౌన్ 1/16-160 పేజీలు; ధర-రు. 5/ ప్రతులకు - గ్రంధకర్త; వినుకొండ; గుంటూరు జిల్లా.]

కృష్ణరాయలు కళింగ గజపతులను జయించిన చరిత్రను— ఒక ప్రణయ గాథను వర్ణించిన కావ్యం.

విప్లవ కవితలు, బెందుబారిన వచన కవితల దినాలలో సాంప్రదాయకమై, గురుతరమై నవరస భరితమైన గొప్ప కావ్యాన్ని ఒక కవి వ్రాయడం, దాన్ని కవి పండితులు కొనియాడటం అరుచోద్యమైన సంగతి.

ఈ ప్రచురణలో ఇంకొక ఏడ్పాదరమున్నది :— మడిగట్టు కొన్న మూఢాచారానికి మూర్తి, వర్ణాశ్రమ ధర్మ పునఃస్థాపనకు వేయి పడగలు వ్రాసిన కవి సమ్రాట్టు, వైదిక ధర్మ ఉద్ధరణతో పాతకులకు పుణ్యం ప్రసాదించను రామాయణ కల్పవృక్షం నాటిన విశ్వనాథ సనాతన భూసురోత్తముడు — ఒక హరిజన కవి కృతిని స్వీకరించడము, సన్మానించడము నమ్మరాని సత్యం. యాభైఏండ్లకు పైన సత్యనారాయణ నాకు దగ్గరివాడుగా తెలుసు; మాటపెళుసు, నోరు మాట్లాడితే నొసలు వెక్కిరిస్తుంది—హ్యాని కంటే. కాని లోపల హృదయం ప్రేమ దుగ్ధ పూర్ణం. గుణపక్షపాతి, కులమత భిత్తికలు అడ్డురాని స్నేహశీలి, తిట్టి తిట్టించుకొన్న తొణకని మనిషి. అట్టి కవి సమ్రాట్టు ఇంకొక కవి చేత అంకితం పొందటం, తిక్కన కితనలు చూపిన దారి అయినా, ఇందు ఒక విశేషం: యుగయుగాలుగా వెలివేయబడిన అంటరానివాడు — కాదు, దగ్గరకు రాకూడని వాడు సంస్కారిత హృదయుడై కవి అయిన వాడు — ఈ ప్రసన్న కవీంద్రుడు. ఈ సమైక్యత సమన్వయ భావాలే ముమ్మందు మన పవిత్ర సంస్కృతిని ప్రాచీన జాతిని ఉద్ధరింపగలగినవి — అంత్రశీభావుని కావ్యంబు గ్రాహ్యంబు కాదనే అప్పకవులు ఇప్పుడెవరూ లేరు.

ఈ మహాకావ్యం ఆరు ఉచ్ఛ్వాసాలది; మొదట మూడు చెరకు గడ, చివరి మూడు చెరకు రసము. కుసుమ పేశలమై మధుర పద బంధ సుధను ఒలికించే తెలుగు నుడికారం; గంభీర సంస్కృతధార, వర్ణనా చాతురి ఇట్టి భాషాభూషణాలతో అందగించే కృతి ఇది, మాండలిక నుడికారం ముచ్చటగా నున్నది. తుకారా (వింతగా ఉన్నది పేరు) కళింగ గజపతి కూతురు; కృష్ణరాయల మనసును ప్రేమధనంతో కొన్న రసికురాలు. కాని, రాచపుట్టువుల కార్పణ్యం మానని ద్వేషి. తల్లి ప్రోత్సాహంతో పెండ్లాడిన రాయలనే, మొలలో దాచిన బాకుతో చంపబోయిన మాని అని అందామా ? విఫలమైన ఈ దారుణ ప్రయత్నిం చివరకు ఆమెను యోగినిని చేసినది ఇది ఈ కలుషిత గాథలో హాయినిచ్చే ఉదంతం. భర్తలను చంపబోయ్యే ప్రణయినుల కథలు మన చరిత్రలో మరికొన్నిఉన్నవి. ఇందు పశ్చాత్తాపం మానవ నైజానికి వన్నెబెట్టినది.

ప్రసన్న ఊర్మిళ వృత్తాంతాన్ని ప్రవేశపెట్టి, తెనుగువారికి ప్రీతి పాత్రమైన ఈ పాత్రను ఉదాత్త పరచినాడు. ''ఊర్మిళ నిద్ర'' ఆంధ్రుల అభిమాన జానపద గేయం గదా !

కవి, రసపోషణకు కథను మార్చినా మంటారు. ఇది తగని పని అని మొగమాటం లేకుండా చెపుతున్నా — దీనిని కొందరు పెద్దలు ప్రశంసించినా! ఇది పురాణంగాదు కావ్యంగాదు, నీ ఇష్టం వచ్చినట్లు మార్చేదానికి. పురాణాలను మార్చే రేగుకంపలుచేసినారు చరిత్రను మారిస్తే దానిని హీన పరచిన వారమవుతాము. ఇప్పటికే మన చరిత్ర నిజాలు బయట బడక—కల్లలు దూరి తలబీకన కాయ అయి ఉన్నది. ఉన్న కథను మార్చకుండుడే చారిత్రక కవుల ధర్మ మనుకొంటా.

## పొలికేక

[కర్షక కార్మిక గేయాలు. వంగపండు ప్రసాదరావు. క్రౌన్ 1/16 – 100 పేజీలు; వెల రు. 2–50; దొరకు చోటు ; పి.వి. రమణ; జనరల్ స్టోర్స్; పోర్టు ట్రస్టు; విశాఖ పట్నం , 530 001.]

జానపద గేయ కారుడు — గాయకుడువ్రాసిన ఈ పాటలలో జవసత్వాలున్నవి. పనిబాటల వాళ్ల చెమటూడ్చిన కథలతో, యంత్రాల కేకలు మూల్గులతో పాటలన్నీ పొలికేకలు పెడుతున్నవి. పొలికేక అంటే — జాతరలో నరుకబడునున్న దున్నపోతును ఊరే గిస్తూ కిలారిస్తూ పెట్టే పెడబొబ్బలు. పుస్తకమంతా అటు వంటి కేకలతోనే నిండి ఉన్నది.

కొన్ని పాటలలో వర్ణిత దృశ్యాలు కండ్లకు గట్టుతున్నవి. ''బుగతోడు గూడుబండి'' గునగున వచ్చినట్లే ఉన్నది పల్లెల వాతావరణాన్ని చక్కగా ప్రవేశపెట్టినాడు. పాటలు యాల పదాల మాదిరి పాడుకోవచ్చు. మాండలికాలను వాడటం మంచి పనే గాని, వాటి అర్థాలు క్రింద వ్రాసిఉంటే ! అన్య ప్రాంతీయపాఠకు లకు అర్థమై ఆనందం కలిగి ఉండేది పట్టణాల సందడిలో మరల పల్లెపాటలు తలఎత్తడం కోరదగినదే !

## జన్మహక్కు - పాటలు

[చెరబండరాజు, క్రౌన్ 1/16–64 పుటలు; వెల 1–50; ప్రతులకు : గ్రంథకర్త, 2–2–899; అంబర్‌పేట; హైదరాబాదు–13 ]

పద్యాలకు ఇచ్చగించకపోయినా, గద్యం వదలి గేయానికి నవ కవి కుమారులు రావడం ముదావహమే; ఇదీ విలువగలిగిన ప్రక్రియ గదా! సరస విరస దిగంబర విప్లవ కవులు అని పేరులు మారినా విషయం మారడంలేదు; రచనలో వైవిధ్యం మందుకైనా కన బడటంలేదు విషయం అదే కావచ్చును గాని, చెప్పినతీరు కవితా గుణం దీపించే రీతిలోనే దానికి నవ్యత చారుత అబ్బి, ప్రజలచేత చదివిస్తుంది ఈ గుణాలు ఈ కవితల్లో కనబడనందున—పాడిందే పాడుతున్నారు పాచిపండ్ల దాసర్లు.

''మా నెత్తురు కంకరగా ప్రాజెక్టులు కట్టినం — శ్రమ ఎవడిదిరో - సిరి ఎవడిదిరో'' అంటాడు . సరే, ఇది మన దేశంలో నేనా? లేక రష్యాలో వేరుగా ఉన్నదా? ''గుడ్డలెన్నో నేసినం, ఉడుకెవడిదిరో—వణుకెవరిదిరో''–ఇదీ అర్థంలేని ఆవేదన; ఒకరు

చేసిన ఉత్పత్తిని, ఇంకొక ఉత్పత్తిదారుని కిచ్చి పుచ్చుకుంటేనేగద సంఘమని నడిచేది. ఈ పారిశ్రామిక విధానం కమ్యూనిస్టు దేశాలలో భిన్నంగా ఉన్నదా? లేకుంటే ఎందుకు మన దేశంపై బడి ఏడ్వడం. ''కర్మఫలం పొట్టే మాటలా'' అంటాడు. ఇది తప్పితే అందరూ సంతోషించదగినదే. కాని, బ్రెజినేవ్ దేశం పాలిస్తే ఆ దొర బూద్యులు తుడిచే వ్యక్తి ఉండగా, ఆ స్వర్గంలోమాత్రం సమత ఎక్కడ ఉన్నట్టు? ఇంతేగాకుండా ఈ వ్యత్యస్థానికి వేరే కారణం వీరు చెప్ప గలిగితే, లోకాన్ని మూఢ విశ్వాసాఘాతంనుండి ఉద్ధరించినవారౌతారు.

''మొదనష్టపు సంఘం''లో ఆడుబ్రతుకును గూర్చినది భావంలో భాషలో బాగున్నది. మిగతా చాలా వాటిలో ఈ రెండూ చాలా వెలితిబోయినవి; అంటే ఆవేశానికి దగిన భాష ఒదగలేదన్న మాట. ''ఓ గులాబి''లో అర్థమేమో! ''నియంతృత్వ అధికారం కాలిమాడు కడుపులై'' — ఈ దుష్పాలనా విధానంపై వీరికి ఎప్పుడు విరక్తి గలిగినదో! పనిబాటల వారి నియంతృత్వమేగదా మార్క్సిస్ మూలమంత్రం. ''ఏకుల మబ్బి'' అన్నది, దూదేకుల సిద్ధయ్య పాటకంటె చాలా కీత.

నేటి సంఘం దోపిడి చేస్తున్నదనడం ఈ కవి కోటికి తారకమంత్రం. నిరపరాధుల నిస్సహాయుల దోచి చంపే రాజకీయ వాదుల—ఈ మాటలకు వేరే అర్థమేమైన ఉంటుందా?

ఇవన్నీ ఈ కవులకు తెలియకకాదు; కావాలనే చెపుతుంటారు. పదే పదే చెపితే చదువురాని మూక నమ్మకపోతుందా? అని వీరి ధైర్యం.

## అడవి పూలు

[వచన కవితలు. గన్ను కృష్ణమూర్తి, క్రౌన్ 1/16 78 పేజీలు; ధర రు. 4/– ప్రాప్తిస్థానం : గ్రంథకర్త; జూనియర్ లెక్చరర్, ప్రభుత్వ జూనియర్ కళాశాల; నారాయణఖేడ్, మెదక్ జిల్లా ]

ప్రతి పూవు మొదట అడవి పువ్వే; తర్వాత తోట పూవు అవుతున్నది. అట్లనే ఈ గీతికా సుమాలు కవితోద్యాన సురభిళ సుమాలౌతున్నవి. సహృదయ పరిశీలకు లన్నట్లు ఈ యువకునికి భావ్యకవితావేశం ఉన్నది. తొలకరి మెరుపులు చూదిరి చాలా గీతాలు మెరుస్తున్నవి. ఆస్తికత ఆత్మవిశ్వాసము అంతర్ముఖమైన మనస్సు ఈ కవితకు ఊర్పులు. దైవభక్తి ఇట్టి అభ్యుదయ కవులకు పనికి రాదంటాడు— కుందుర్తి; ఇంకొకామె ప్రేమ త్యాజ్యమన్నది. ఈయనను అభ్యుదయకవి అంటున్నారే పాప.! ఇక ఈయనను వెలి వేయవలసినదేనా?

ఇక్కడ భావానికి తగిన భాష ఒప్పి ఉన్నది. మంచి అందమైన పలుకుబడులు రచనను ఉజ్జీవింప జేస్తున్నవి. ''అడవి పూవులు'' మరికొన్ని గీతాలలోను స్థిరపడని భావాలమధ్య కవి కుమారుడు నలిగిపోతున్నాడు; ఆస్తికత నాస్తికత నలుపుతున్నవి. ప్రపంచంలో వ్యర్థమనేది ఏదీ లేదని గుర్తించి ''ఆ పూలే వన దేవత సిగలో శోభిస్తాయి'' అంటూ, ''ఎక్కడ?'' లోమనసు లోచూపుకు మరలించుకొన్నారు. ''అనుగ్రహించు'' అన్న చరమ గీతంలో ప్రార్థనాయత్త చిత్తంతో శాంతిని పొందుతున్నాడు.

''రాత్రి'' ఖండిక కవితా శిల్పంలో ఒక అవతంస కుసుమం. భావుకతను వెలిగించిన కొన్ని భాషాద్యుతులను వీక్షించండి:—ఈయన ప్రకృతి సౌందర్యప్రియుడు, ప్రపంచం లగ్గు ఎగ్గులు కలనేత గుడ్డని భావిస్తాడు—గులకరాళ్లపై సరిగమ పదనిసలు పలికిస్తూ పరుగులు దీస్తున్నది సెలయేఱు; మధురభావన. వ్రాసి వ్రాసికలం నిదురబోయినదట; నడికారం బాగున్నది గాని, అప్పుడే నిద్రా? కలాన్ని మేల్కొల్పమంటూ—శరీరపు జ్యోతిలో ఓర్పు చమురు తరిగిపోయింది—కసాయి కత్తి పరితపిస్తున్నది, రక్తాశ్రువులను కారుస్తూ అన్నది అలౌకిక వాసనలు గలది. చిరుగులలో (గుడ్డ) కనిపించే స్తనాలు ఆమె పాలిటి వ్రణాలన్నమాట కరుణరస పరిపూర్ణం (భిక్షుకి)

పాత కవి సమయకూపంలోబడి, — కాకిగూటిలో పెరిగినా కమ్మగా పాడుతుంది కోయిల—అంటాడు. కాకికి కోయిలకు సంబంధమే లేదు; కోయిల ఋతుధర్మానుగుణంగా దేశాలు తిరిగే పిట్ట అని ఇప్పుడు తేల్చివేసి ఉన్నారు. మనకు ఇవి రష్యా, సైబీరియా నుండి వచ్చి, వసంతం పోగానే మరల తిరిగిపోతవి. అనార్కలి నూర్జహాన్ అయిన దంటాడు, కాదే!

## జ్యోతిర్గమయి

[శ్రీపాద సూర్యనారాయణమూర్తి, క్రౌన్ 1/4,32పేజీలు; వెల రు 1/ — వలయువారు: శ్రీపాద రామమూర్తి, ఇందుపల్లి అమలాపురం-తా; తూ. గో ]

ఇప్పుడిప్పుడే ఎదురుకొంటున్న రచన ఇది. దేనిమీద మనసు పోతే దానిమీద వ్రాసినాడు. నీతి ధర్మాలపై ప్రీతిగలిగిన సంప్రదాయవాది— ఈ కవి. ప్రపంచ స్థితినే ప్రశ్నిస్తూ అంతుదేల్చుకో లేకున్నాడు, ఆశ నిరాశలమధ్య బాధపడుతూ, వెంటనే జీవితం అమృత కాసారమంటాడు. ''నల్ల—దొంగ'' అన్నది హాస్యధోరణిలో బాగున్నది. సాలీడువలెనే మానవుడు తన చుట్టూ తానే బంధాలు అల్లుకొంటాడు అన్న వేదాంత భావాన్ని చక్కగ వివరించినాడు. తిక్కన, శాంతిపర్వంలో. సాలీడు అన్నదానికి పొత్తిమాలు, పురుగు అని తెనుగు పేరుబెట్టి, తంతునాభాన్ని చెప్పినదే ఇది; అయినా సొంపుగా చెప్పినాడు. సాధనచేస్తే కవిత్వం మంచి పాకంలో పడ గలదు.

## స్వేచ్ఛ

[జైలు కవితలు.వరవరరావు—డెమ్మీ 1/8; 72 పేజీలు; వెల రు. 2–50; ప్రతులకు : సృజన; హనుమకొండ; వరంగల్, 506001]

ఇది నక్సలైట్ భావగీతం; కాబట్టి వారి మామూలు ధోరణిని తప్పించి వ్రాయరుగదా. వీరి భావాలకు పాదులు విదేశాలు, తీగలు ఇక్కడ కాబట్టి, ఇక్కడి వారితో ఒద్దిక కుదరటంలేదు.

వీరు స్వేచ్ఛను కోరుతారు గాని, ఇతరుల స్వేచ్ఛను సహించరు. ఒక రాజకీయ మేధావి—''నేను సేవకుడుగా ఉండదలచుకోలేదు కాబట్టి, నేను యజమానిగా ఉండదలచుకోలేదు'' అన్నది మహోన్నతాదర్శం.

ఈ కవి జైలు ఆవేదన సానుభూతిని కలిగిస్తున్నది. వీరి త్యాగం ప్రశంసనీయం, వీరి విశ్వాసాలు, ఆదర్శాలు ఆదరింపదగినవే, కాని ఇవి పెడత్రోవ బట్టి ద్వేషంచేత వాటిని అవే దహించుకొంటున్నవి.

ఈ కవి రచనలలో ఆవేశం ఎక్కువైనందువల్ల కవితాగుణం సన్నగిల్లినది. అయినా, ''తుపానుకు భయపడేవాడు జాలరి కాడు, నిర్దాక్షిణ్యంగా సాగే పోరాటంలో అణచివేతకు అదిరిపొయ్యేవాడు అర్భకుడు'' అన్న సూత్రవాక్యం బాగున్నది. ''విప్లవం ఈ యుగశిశువు'' అన్న ఒకే ధ్యానం ఉన్నంతవరకు వీరి కవిత్వం మెరుగెక్కదు—వివిధత్వం ఏర్పడదు. భారతయుద్ధ పర్వాలలోకంటె ఈ కావ్యంలో వాగ్యుద్ధాలు మెండుగా ఉన్నవి. అక్కడక్కడా విస్ఫులింగాలు మెరుస్తున్నవి.

*శ్రీ మరుపూరు కోదండరామరెడ్డి*

# గురుశిష్య సంబంధాలు

[పూర్వాదర్శాలు, ప్రస్తుత పరిస్థితులు జగద్గురు శ్రీ శృంగేరీ పీఠాధిపతుల ప్రసంగాలు. ప్రచురణ : శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయ ప్రాచ్య పరిశోధనాలయము, తిరుపతి. వెల అమూల్యము – పుటలు : 36.]

1977 నవంబరులో, కులపతి శ్రీ సచ్చిదానందమూర్తి గారి ఆహ్వానంపై దక్షిణామ్నాయ శ్రీ శృంగేరీ శారదా పీఠాధిపతులు, శ్రీ జగద్గురు అభినవ విద్యాతీర్థమహాస్వామివారు, శ్రీ జగద్గురు భారతీతీర్థస్వామివారు, ప్రాచ్య పరిశోధనిలయం, సంస్కృతశాఖనూ దర్శించారు, సెనేట్ హాలులో ప్రసంగించారు. ఆ రెండు ప్రసంగాలను నే 1978న, శంకరజయంతి సందర్భంగా, ప్రాచ్య పరిశోధనాశాఖ, తమ గ్రంథమాలలో 7వ దానిగా ప్రచురించారు, అదే ఇది.

కులపతి శ్రీ సచ్చిదానందమూర్తి అద్వైత వేదాంతం అభిమానశాస్త్రంగా కలిగి, 1954 నుంచి 1971 వరకు అదే శాఖలో ఆచార్యుడు.

శ్రీ విద్యాతీర్థమహాస్వామి కులపతులంటే ఎవరు, 'రఘువంశం' నుంచి, 'ఆధ్యాత్మవిద్య' అంటే ఏమిటి అన్న జటిల విషయాలను గురించి తేట తెల్లంగా ప్రసంగించారు.

''విద్య మూడు రకాలుగా వుందయ్యా, లౌకికం, వైదికం, ఆధ్యాత్మికం అన్నాడు. ఆధ్యాత్మిక మంటే షడ్దర్శనాలు కూడా ఆధ్యాత్మిక విద్యలే అక్కడ ప్రపంచాన్ని కూడా వాళ్ళు చక్కగా విమర్శించి, దాని స్వరూపాన్ని నిర్ణయిస్తే వాళ్ళకు ప్రపంచంమీద ఎక్కువ ఆసక్తి వున్నదని చెప్పలేము ఆత్మస్వరూపాన్ని చెప్పాలి. అయితే, ప్రపంచాన్ని వదిలిపెట్టి ఆత్మస్వరూపాన్ని చెప్పితే ఎవరికీ ఎక్కదు. అందుకు, ప్రపంచ స్వరూపాన్ని విమర్శిస్తూ ఆత్మస్వరూప నిర్ణయం లోపల వాళ్ళపద్ధేశమకు వచ్చినారు. దాని వలన వాటికి దర్శనాలని పేరు వచ్చింది...''

''ఆధ్యాత్మవిద్య అంటే అత్యంత ఉత్కృష్టమైన విద్య. దాన్ని కనుగొన్నామంటే ప్రపంచమంతా ఈశ్వర సత్తనుండి సత్త కలిగింది. దీనికి వ్యతిరిక్తమైంది లేదు...ఆత్మవిద్య అంటే ఒక ఆత్మవల్ల ప్రపంచమంతా పుట్టింది. వాడే ప్రపంచాన్ని చూస్తున్నాడు . ఇప్పుడు మనం సామాన్యంగా ఏమనుకుంటామంటే నదినీళ్ళు వేరు, సముద్రనీళ్ళు వేరు. సముద్రంనీళ్ళు ఫిల్టరయి వచ్చిందంతే. సముద్రపునీళ్ళు నదిరూపంగా ఫిల్టరయివస్తే తీయగా ఉంటుంది. లేకపోతె ఉప్పగా ఉంటుంది అదేరీతిగా పరమాత్ముడు జీవరూపంగా వచ్చినప్పుడు ఇన్ని రూపాలుగా కనపడతూ ఉన్నాడు. వాడు తన స్వరూపాన్ని తానే కనుగొన్నాడంతే, ఇదే నదిపోయి సముద్రం చేరిందంటె మళ్లీ సముద్రమే...'' ఈ విధంగా సాగుతూపోయింది 'అధ్యాత్మిక విద్య'ను గురించిన వివరణ.

గురుశిష్య సంబంధాలంటే, ముఖ్యంగా పూర్వాదర్శాలంటే తైత్తిరీయంలోని ఈ క్రింది భాగాలను స్మరించక తప్పదుగదా !

సత్యం వద, ధర్మం చర, స్వాధ్యాయాన్మా ప్రమదః
ఆచార్యాయ ప్రియంధన మాహృత్య ప్రజాతన్తుం మావ్య వచ్ఛేద్యః
సత్యాన్న ప్రమదితవ్యమ్, ధర్మాన్న ప్రమదితవ్యమ్. కుశలాన్న ప్రమదితవ్యమ్
భూత్యై న ప్రమదితవ్యమ్, స్వాధ్యాయ ప్రవచనాభ్యాం న ప్రమదితవ్యమ్
దేవ పితృ కార్యాభ్యామ్ న ప్రమదితవ్యమ్
మాతృదేవో భవ, పితృదేవో భవ, ఆచార్యదేవో భవ, అతిథి దేవోభవ,
యాన్యనవద్యాని కర్మాణి, తాని సేవితవ్యాని, నో యితరాణి
యాన్యస్మాకగ్ం సుచరితాని, తానిత్వ యోపాస్యాని, నో యితరాణి
యేకేచాస్మచ్ఛ్రేయాగ్ం సో బ్రాహ్మణాః
తేషాం సనేన ప్రశశ్వితవ్యమ్, శ్రద్ధయా దేవమ్, అశ్రద్ధయా దేయమ్,
శ్రియాదేయమ్, హ్రియాదేయమ్, భియాదేయమ్, సంవిదా దేయమ్

అథయదితే కర్మవిచికిత్సావావృత్త చికిత్సావాస్యాత్
యేతత్ర బ్రాహ్మణాస్యం మర్శినః యుక్తా ఆయుక్తాః
అలూక్షా ధర్మకామాస్సృః యథా తత్రవతేన్ రన్
తథా తత్రవతేన్థా అథాభ్యాఖ్యాతేషు యేతత్ర బ్రాహ్మణా
స్యంమర్శివః
యుక్తా ఆయుక్తాః, అలూక్షా ధర్మకామాస్సృః
యథాతే తేషు వర్తేన్ రన్, తథాతేషువర్తేన్థాః ఏష ఆదేశః
ఏష ఉపదేశః, ఏషావేదోపనిషత్, ఏతదను శాసనమ్,
ఏవ ముపాసితవ్యమ్, ఏవముచైత దుపాశ్యమ్,

సత్యమును పల్కుము, ధర్మము నాచరింపుము, స్వాధ్యాయనము నుండిఎన్నడును ఏమరి యుండకుము. నీవు కొంచెము సంపాదించు కొనిన పిదప నీ యాచార్యునకు ప్రియమగునట్లు కొంత ధనము నొసగుము. ప్రజాతంతువు తెగిపోకుండునటుల మంచి సంతానము బడయుము. సత్యమును తప్పకుము. ధర్మపథమును వీడిపోకుము. క్షేమకరమగు మార్గముల సంచరింపుము. మంగళప్రదములగు కర్మముల నాచరింపుము. స్వాధ్యాయన ప్రవచనముల నుండి తొలగుకుము. దేవపితృకార్యముల నెన్నడు విస్మరింపకుము. జననీజనకులు, ఆచార్య అతిథులు దైవములని తలంపుము. నింద్యకర్మల చాయలకు బోవకుము. మాకడనుండు సుగుణములనె గ్రహింపుము. దుర్గుణముల విసర్జింపుము. మనలో శ్రేష్ఠులగు బ్రాహ్మణులను ఆసనాదికములచే గౌరవింపుము. వారి యుపదేశముల నాలకింపుము. వారిని బహుమానింప దలచినచో ఆదర పూర్వకముగనిమ్ము. నీ సంపదకు తగినటుల సన్మానింపుము. ఆచార కర్మలను గూర్చి నీకేదియైన సందియము గల్గినచో ధర్మవిచారముజేయ సమర్థులను, ఆచార్యులను, ఆచార కర్మలయందు స్వతంత్రులను, క్రౌర్యములేనివారును, ధర్మకాములునగు బ్రాహ్మణులు అట్టి సందియ సమయములందెట్లు సంచరింతురో నీవును అట్లే సంచరించుము. ఇదియే నీకాదేశము. ఇదియే నీకుపదేశము. ఇదియే వేదరహస్యము. ఇదియే నీకాజ్ఞ. ఇదియే ఉపాసింపదగినది.

భారతీ తీర్థవారి ప్రసూనంలో సంస్కృతభాషా ప్రాముఖ్యాన్ని గురించి, జగద్గురు శంకరుల ప్రతిభను గురించిన విశేషాలున్నాయి.

'ఆధ్యాత్మికవిద్య' అంటే చాదస్తంగా వినపడుతుందా ? ఈనాడు ప్రపంచంలో అనేక మందికీ చాదస్తముంది. ఈ క్రింది వాక్యాలను చూడండి :

"...We cannot avoid reassessing the fund. mental definition of hnman life and human society. Is it true that man is above everything ? Is there no Superier Spirit above him ? Is it right that man is life and Society's activities should be ruled by mateiral expansion above all ? Is it permissible to promote such expansion to the detriment of our integral spiritual life ?

"If the world has not approached its end it has reached a major watershed in history, equal in importance to the turn from the Middle Ages to the Renaissance. It will demand from us a spiritual blaze. we shall have to rise to a new height of vision, to a new level of life where our physical nature will not be cursed as in the Middle Ages. but, even more importantly, our spiritual being will not be trampled upon as in the Modern Era.

"This ascension will be similar to climbing onto the next anthropologic stage. No one on earth has any other way left but upward."

ఏమిటీ 'స్పిరిట్యుయల్‌బ్లేజ్ ?'

ఎక్కడివీ వాక్యాలు? రష్యన్ ప్రవాసరచయిత అలెగ్జాండర్ సొవిఝెన్‌స్టిన్ 1978 జూన్ 8న హార్వార్డు విశ్వవిద్యాలయంలో ఉపన్యసించాడు, ఆ ఉపన్యాసపు ముగింపు వాక్యాలివి.

**శ్రీ కాకుమాను తారానాథ్**

## శ్రీ మచ్ఛంకర భగవత్పాద చరిత్ర

[గ్రంథకర : డా. పోతుకూచి సుబ్రహ్మణ్యశాస్త్రి M. A. Ph. D. ప్రొఫెసరు, నాగపూర్ విశ్వవిద్యాలయము. ప్రచురణ : సాధన గ్రంథ మండలి — తెనాలి. మూల్యము : రూ. 15—00; 539 పుటలు ]

వేద వాఙ్మయమును యథాతథముగ నవగత మొనర్చుకొనుటకు శిక్షాది షడంగములు ఋషి ప్రోక్తములైయున్నవి. ఆ వేదముల పరమార్థ సత్యమును నిరూపించుటకు షడ్దర్శనములు కూడ ఆర్ష సంప్రదాయములో వెలువడినవి. ఇందు వేదాంత దర్శనము అతి ముఖ్యమైనది. అందును శంకరాచార్యులవారి అద్వైత సిద్ధాంతము ఎంత ముఖ్యమైనదో అంత దురవగాహమైనది. ఈ సిద్ధాంతములో జెప్పబడు మిథ్య, మాయ అనునవి ప్రత్యక్షమునకు, అనుభవమునకు విరుద్ధములుగ గోచరించుచుండను. అద్వైతముపట్ల యేర్పడియున్న యిట్టి దోషములను నివర్తింపజేయుటకై గ్రంథకర్త యిచట శంకరుని జీవిత చరిత్ర రూపమున ప్రయత్నించిరి. శంకరుని గూర్చి యిప్పటి కనేక చరిత్రలు, ఆయన రచనలపై వ్యాఖ్యానములు విమర్శక వ్యాసములు, ప్రశంసలు, పరిశోధనలు లెక్కకు మించి అనేక భాషలలో వెలువడినవనుట అతిశయోక్తి కాజాలదు. కాని యీ గ్రంథమొక విశిష్టతను కలిగియుండెను. పాశ్చాత్య విమర్శక సంప్రదాయము ననుసరించి శంకర జీవితమును,

శాస్త్రీయ సంప్రదాయము ననుసరించి అద్వైతసారమును పండితులకే గాక సామాన్యులకు కూడ సులభగ్రాహ్యమగునట్లు ప్రతిపాదించిరి. శంకరుడు తన భాష్యము లందరికి సుబోధకములై అందుబాటులోనుండవని తలంచి ఆ సిద్ధాంతమునే అనేక ప్రకరణములలో శాస్త్ర జటిలత లేకుండ నుద్ఘోషించెను. వాటి నుండియే మూల శ్లోకములను గ్రహించి యీ గ్రంథము రచింపబడెను. కనుక విషయమెంత సులభగ్రాహ్యముగ నుండునో చెప్పబనిలేదు.

ఇందు 10 అధ్యాయములు గలవు. 1. శంకర విజయములు, 2. అవతార సమయము, 3. గోవిందుని శిష్యుడు, 4. కాశీ నివాసము, 5. అద్వైత విజయము, 6. కాంచీ నివాసము, 7. దిగ్విజయము, 8. మఠామ్నాయములు, 9. మహాను శాసనము, 10. శాంకార దర్శనము. వీటిలో మొదటి మూడు అధ్యాయములలోను శంకరుని జీవిత చరిత్రకు సంబంధించిన కొన్ని ముఖ్యాంశములపై కావ్యములందుండు అతిశయోక్తులను, మహిమలను విడిచి వాస్తవిక దృక్పథములో చర్చగావింపబడెను. శంకరుని జన్మస్థానము కాలటి అగ్రహార మనుటలోను, వారు గోవింద భగవత్పాదుల శిష్యులనుటలోను, వారి కాశీ నివాసము, వారి దిగ్విజయ పర్యటనకుచెందిన కొన్నిటిలోను అందరు ఏకీభవించుదురు. జీవితకాలమును గూర్చి అనేక అభిప్రాయ భేదములు కలవు. పీఠాధిపతుల పరంపరలు ప్రధాన మఠములందు లభించుచున్నను అవి ఏకగ్రీవముగ ఆదిశంకరుని గూర్చిన కాలమును తెలుపుటలేదు. ఉదాహరణకి రచయిత కామకోటి పీఠమందు లభ్యమగు గురు పరంపరను తెలుపుచు క్రీ. పూ. 509 లో మొదటి సారిగను, క్రీ. త. 29లో రెండవ మాటును, క్రీ. త. 329 లో మూడవ మాటును, తరువాత 437 మరొక మాటును శంకరు అవతరించినట్లు (ఆయా కల్యబ్దములు, శకాబ్దములు కావచ్చును) చెప్పబడెననిరి. కనుక వీరిలో నెవరుమనకు గ్రహింపతగిన శంకరులో నిర్ణయముకాదు శంకరుని భాష్యములలో పూర్ణవర్మ, బలవర్మ మున్నగు కొందరు రాజుల పేర్లు కానవచ్చును. ఇంత విశాలమగు దేశములో ఆ పేర్లుగల రాజులు అనేకులుండుటచేత శంకరుని కాల నిర్ణయమున కీ యంశముకూడ ఉపకరించదని యీ రచయిత నిరూపించెను. అయినను దీనినిబట్టి పాశ్చాత్యులు నిర్ణయించిన క్రీ. త. 788 శంకర జన్మకాలమును సిద్ధాంతమును మన భారతీయులు కూడ పలువురంగీకరించుటకలదని వారు చెప్పినది సత్యమే. ఇంకా అనేక వాదాలను, వాటిలోని సాధక బాధకములను వీరు వివరించిరి. శంకరుని రచనలలో కానవచ్చు సాంఖ్య, బౌద్ధ విద్యాంసుల వాదముల నుదహరించుటను చూపిరి. అట్టివారిలో గౌడపాద, గోవింద, దిఙ్నాగ, కుమారిల, ధర్మకీర్తి, మండనుల ముఖ్యులు. వీరి కాలమును ముందు నిరూపించి, తదనుసారముగ క్రీ. త. 368 లో గాని, 387 లో గాని, 392 లో గాని శంకరుడు జన్మించి 32 సంవత్సరములు జీవించియుండునని యీ రచయిత యుక్తి యుక్తముగ నిర్ణయించిరి. ఇది క్రొత్త సిద్ధాంతము. ఇప్పటి వరకు బహుళ ప్రచారమందిన క్రీ. త. 788లో శంకరుడు జన్మించెనను వాదము కంటె వీరి వాదమునుబట్టి శంకరుడు సుమారు నాలుగు వందలేండ్లు పూర్వమువాడగుచున్నాడు.

చారిత్రక దృష్టితో పరిశీలించిన వీరి సిద్ధాంతము సత్య దూరం కాదనిపించును. క్రీ.త. 4వ శతాబ్దిలో బౌద్ధము ఉచ్చస్థాయి నందుకొనెను. హీనయానము పోయి మహాయానము, తాంత్రిక బౌద్ధము బహుళ ప్రచారము నొందెను. రాజాదరణము నొంది సామాన్య జనాకర్షకమై ప్రముఖ మత వ్యవస్థగ రూపొందెను. నాగార్జునుడు, వసుబంధుడు, దిఙ్నాగుడు మున్నగు విద్వాంసులు 3,4 శతాబ్దులలో మాధ్యమిక వాదమును, విజ్ఞాన వాదమును ప్రతిపాదించి బౌద్ధమునకిదివరకులేని శాస్త్రీయతను కల్పించి ఆ మతమునకు విద్వత్ స్థాయిని చేకూర్చిరి. ఇట్లు రాజకీయముగను, సాంఘికముగను, శాస్త్రీయముగను బౌద్ధమతము పరమోచ్చ స్థితియందున్నది. క్రీ. త. 4వ శతాబ్దిలోనే ఊరూర స్తూపములు, విహారములు వెలసినవి. వైదికమతము అడుగంటెను. దీనిని గుర్తెరిగి రాజుల యొద్ద కొలువులో నుండు వైదికమతానుయాయులైన మంత్రులు, సేనాధిపతులు ముందుగ రాజకీయ తిరుగుబాటొనర్చి క్రొత్త రాజ్యములను స్థాపించిరి. మన దక్షిణ దేశములో బౌద్ధమతావలంబకులగు ఇక్ష్వాకులను కూలద్రోసి పశ్చిమమున కదంబులు, దక్షిణమున పల్లవులు తూర్పున శాలంకాయనులు ఉత్తరమున విష్ణుకుండులు, వింధ్య ప్రాంతమున వాకాటకులు అట్టివారిలో ముఖ్యులు. కలియుగ దోషావసన్నమైన ధర్మము నుద్ధరించుటయే తమ ముఖ్య ఆశయమని పల్లవులు కంఠోక్తిగా శాసనములందు వ్రాయించుకొనిరి. ఈ రాజులందరు అనేకములగు వైదిక క్రతువులాచరించిరి శంకరుడు కూడ ఇదే సమయములో జన్మించి శాస్త్రీయముగ బౌద్ధమును నిరసించుచు వైదిక కర్మలకు తగిన స్థానమిచ్చి అద్వైత సిద్ధాంతమును ప్రవర్తింపజేసెను. క్రీ.త. 400 అనంతరము బౌద్ధపతన మారంభమయ్యెను. ముఖ్యముగా రాజకీయాదరణమును కోల్పోయెను. శాస్త్రీయముగ ఇతరదార్శనికుల యెదుట నిలువ లేక పోయెను. కనుక శంకరుడు చారిత్రకముగ నీ కాలమునకు చెందిన వాడనుట మిక్కిలి సమంజసముగ నున్నది.

శంకరుడు కర్మమార్గమునకు, భక్తిమార్గమునకు విరోధియను అసత్ప్రచారమును ఈ గ్రంథములో శాంకర దర్శనమును నిరూపించు పదవ అధ్యాయములో గ్రంథకర్త నిరసించెను. ప్రస్థాన త్రయమునకు భాష్యములనే గాక అనేక స్తోత్రములను సులభ గ్రాహ్యమగుటకై ప్రకరణ గ్రంథములను శంకరుడు రచించెను. వీరు చాలామటుకు వాటిని అంగీకరించిరి కాని జిజ్ఞాసువులకు ప్రామాణిక బుద్ధి దృఢపడుటకై కొన్ని రచనల విషయములో నిర్ణయాత్మక విమర్శచేసి యుండిన బాగుండెడిది. అనగా విష్ణు సహస్రనామ భాష్యము వంటివి కొన్ని శంకరుడు రచింప లేదను వాదమును వీరంతగా చర్చించినట్లు లేదు.

జీవునకు, ఈశ్వరునకు గల సంబంధమును తెలుపు సందర్భమున శంకరుడు అవచ్ఛేద వాదము, అభావ వాదము, ప్రతిబింబ

వాదము, అను కొన్ని క్లిష్టవాదముల నుదహరించెను. అట్టి శాస్త్రీయ సాంకేతిక అంశములను కూడ ఈ రచయిత అతి సుబోధకముగ అజ్ఞాన మూలకములని చెప్పి ఆ అజ్ఞాన లక్షణమును గూడ విశదీకరించిరి. ఇట్లనేక శాస్త్రవిషయములను సులభముగా పరిష్కరించుట వీరి రచనలో ముఖ్యముగ గమనించదగినది. సాధ్యమైనంత మటుకు శంకరుని జీవిత చరిత్రకు సంబంధించియుండు నట్లే వారి ప్రకరణ గ్రంథస్థములైన శ్లోకముల నుదహరించి సామాన్యులకు కూడ అద్వైత సిద్ధాంత సారమును చక్కని తెలుగులో సుబోధక మొనర్చిరి. గ్రంథ మూలాగ్రము చరిత్ర పేరుతో సవిమర్శకమును, ప్రామాణికమును అగు శాస్త్రోపదేశ మనదగి యున్నది. తెలుగులో నిట్టి ఉత్తమ శాస్త్ర గ్రంథములరుదు. దీనిని ఇతర భాషలలోని కనువదించి ఆంధ్రేతరులకు కూడ అందించుట యెంతయో మంచిది. గ్రంథకర్త స్వయముగ వేరు భాషలలో కూడ వైదుష్యము కలవారు గనుక తామే ఆ పనిని నెరవేర్చగలరని ఆశించుదము. ఇటు అద్వైత వేదాంతము నభ్యసించు సామాన్యులకు, అటు విమర్శకులకు ఇది ప్రమాణ గ్రంథము కాగలదు.

*శ్రీ పరబ్రహ్మశాస్త్రి*

# సాహిత్యోపన్యాసాలు

[గ్రంథకర్త : దేవులపల్లి రామానుజరావు, డెమ్మి 85 పుటలు, ప్రచురణ : ఆంధ్ర సారస్వత పరిషత్తు, హైదరాబాదు, వెల : 5-00.]

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ కార్యదర్శులు, ఏకైక కర్ణధారులు దేవులపల్లి రామానుజరావుగారి నెరుగని ఆంధ్ర రచయిత లేడనుటలో అతిశయోక్తి లేదు. ఈ గ్రంథమున వారి వ్యాసములు 15 గలవు. వానిలో ముఖ్యమైనవి తెలంగాణా సాహితీ పరిణామము, తెలుగు పార్సీ ఉర్దూ భాషల ప్రభావము, ఉర్దూ భాషకు సేవచేసిన తెలుగువారు, వృత్తి పదకోశాల నిర్మాణావశ్యకత — ఇందు గాంధి-రాళ్లపల్లి అనంతకృష్ణశర్మ - విశ్వనాథవారిని గూర్చి వ్యాసములు గలవు. ఇవి సారస్వతమునకు సంబంధించినవే - సహృదయత — సమదృష్టి సహజోదాత్తత వీరి రచనలో ముఖ్యగుణములు.

శ్రీ రామానుజరావుగారిని గూర్చి తొలుత లోకమునకు నెరుక పరచిన వారు కీర్తిశేషులు గురుగుంటి సీతారామ భట్టాచార్యులు. వారి "నవ్యాంధ్ర సాహిత్య వీధులు" అను గ్రంథమున వీరిని గూర్చి గలదు.

ఈనాడాంధ్ర సాహిత్యమునకు శ్రీ రామానుజరావుగారు చేసి, చేయుచున్న సేవ అపూర్వము అత్యంతము అభినందనీయము. యావదాంధ్ర లోకమువారికి కృతజ్ఞతాబద్ధము.

*శ్రీ నిడుదవోలు వేంకటరావు*

# ఉప్పెననాటి ఉదంతాలు

[డా॥ బి.వి.ఆర్. ప్రసాదరావు, వెల: మూడు రూపాయలు. ప్రతులకు: 1) దివిసీమ సాహితీ సమితి; గాంధీక్షేత్రం; అవనిగడ్డ. 2) డా॥ బి. వి. ఆర్. ప్రసాదరావు; ఎదురు మొండి (P. O) దివి తాలూకా; కృష్ణాజిల్లా.]

1977 నవంబరు 19న సంభవించిన ఉప్పెన ఫలితాన్ని అనుభవించింది ఆంధ్రప్రదేశ్ అయినా యావద్భారతమేకాక అఖిల ప్రపంచం భయభ్రాంతమైంది. ఆంధ్ర ప్రదేశ్‌లో కృష్ణా, గుంటూరు జిల్లాలు అధికంగా దెబ్బ తిన్నప్పటికి కొద్దిగానైనా కోస్తాజిల్లాలన్నీ ఉప్పెన ఫలితాన్ని అనుభవించినవే. అయితే కృష్ణా జిల్లాలోని దివిసీమ మాత్రం కొన్ని దశాబ్దాల వరకూ తేరుకోలేని చావుదెబ్బ తింది. పైరు నష్టమో, గృహ నష్టమో అయితే మరు సంవత్సరానికి కోలుకోవచ్చనే ఆశ ఉంటుంది. దివి సీమలో ఉప్పెన ఫలితంగా వేల సంఖ్యలో మనుషులు, పశువులు మరణించడం జరిగింది. తల్లికి బిడ్డ — బిడ్డకు తల్లి, భార్యకు — భర్త, భర్తకు — భార్య ఎవరికీ ఏమీ సంబంధం లేకుండా అయోమయ స్థితిలో, ఎటు కొట్టుకుపోతున్నామో తెలియని ప్రవాహ వేగంలో దీనాతి దీనంగా, హీనాతిహీనంగా మరణించడం మానవేతిహాసంలో అతి భయంకరమైన, అనూహ్యమైన ఘట్టం. ప్రకృతి శక్తులను జయించాలనె తపనతో, వేదనలో తర తరాల నుండి ఒక్కొక్క అడుగు ముందుకు వేస్తున్న మానవ మేధస్సుకు ఇలాంటి ఘట్టాలు సవాల్ లాంటివి. దివి సీమలో సంభవించిన ధన, ప్రాణ నష్టాన్ని అక్షరాల్లో తెలియజేయబోవడం అవివేకం దాని స్వరూపాన్ని మాత్రం వర్ణించడానికి చేసిన ప్రయత్నం ఈ గ్రంథం. డా॥ బి. వి. ఆర్ ప్రసాదరావుగారు ఉప్పెనలో నష్టపోయిన కొంతమందిని మాత్రమే కలుసుకుని వారి అనుభవాల్ని ఈ గ్రంథంలో క్రోడీకరించడం జరిగింది. ఈ గ్రంథంలో తారసపడిన వ్యక్తులేకాక దివిసీమలో చెట్టుకొకడు పుట్టకొకడుగా దిక్కులేని స్థితిలోనున్న నిర్భాగ్యులు ఇంకా శతానేకులున్నారు. ఉప్పెననాటి దివిసీమ బాధల్ని గాథల్ని అవగాహన చేసుకునేందుకు ఈ గ్రంథం ప్రథమ సోపానం

మాత్రమే. డా॥ ప్రసాదరావుగారు చేసిన కృషి ఆనాటి విషాద చరిత్రకు సార్థకతను చేకూర్చేదిగా అభినందనీయమైనది.

*శ్రీ టి. ఎల్. కాంతారావు*

# గ్రంథస్వీకారాలు

★ శ్రీ చిగురుకూరు వెంకటేశ్వర మహత్మ్యం: రచయిత: శ్రీ ఆలంపూరి బ్రహ్మానందం, వెల: రు. 5/–పేజీలు: 94, ప్రతులకు: రచయిత, వెలిమల గ్రామము, సంగారెడ్డి తాలూకా, మెదక్‌జిల్లా.

★ శ్రీ రమణ చరితామృతసారము: రచన: శ్రీ పోలూరి హనుమజ్జానకీరామశర్మ, పేజీలు: 24, వెల: అమూల్యము, ప్రచురణ: శ్రీరమణసత్సంగము, నెల్లూరు.

★ శ్రీ రామనామ సుధానిధి (సుందరకాండ సహితము) రచన: శ్రీమతి యస్. యస్. ప్రసూన, వెల, రు. 5/–, పేజీలు: 176, ప్రతులకు: రచయిత్రి, 3-5–1091/10, నీల్యాద్రివెంకటేశ్వరకాలనీ, నారాయణగూడ, హైదరాబాద్.

★ ఆదర్శజీవితం (సాంఘిక నాటకం) రచన: శ్రీ విడేల ఆంజనేయులు, పేజీలు: 32, వెల: రు. 1.50. ప్రతులకు: రచయిత, కేరావ్ శ్రీ రంగనాయకులు, శ్రీగిరిపాడు, మాచర్ల తాలూకా, గుంటూరు జిల్లా.

★ వెండికొండపావురాలు (వెండికొండ సిద్దేశ్వర శతకం), రచన: శ్రీ ముళ్ళపూడి సచ్చిదానందమూర్తి; పేజీలు: 42, వెల: రు 2/–,ప్రతులకు (1) సాహిత్యరంజని, ఇం. నెం. 17–7–818, యాకుత్‌పురా, హైదరాబాద్–23; (2) రచయిత; ఇం. నెం. 2–3–69, నారాయణఖేడ్; మెదక్‌జిల్లా.

★ సారస్వతవేదిక–1 (అక్టోబరు, 1976నుండి సెప్టెంబరు 1977వరకు జరిగిన కార్యక్రమాల వివరాలు) పేజీలు: 46, ప్రతులకు: ఆంధ్ర సారస్వత పరిషత్తు, తిలక్‌రోడ్, హైదరాబాదు–500001.

★ శ్రేయోభిలాషి (హాస్యనటుడు శ్రీ రాజబాబు జన్మదిన శుభాకాంక్షలు) రచన: శ్రీ బొర్రా పాండురంగశాస్త్రి(ఖాదీ) పేజీలు: 8, ప్రతులకు: రచయిత, 23–23–4, శివరావు వీధి, సత్యనారాయణపురం,విజయవాడ 520011.

★ పక్షులు (స్త్రీ పాత్రలేని హాస్యనాటిక) రచన: శ్రీ ఎస్. మునిసుందరం, వెల: 1.75. పేజీలు: 32, ప్రతులకు: దేశిబుక్‌హౌస్, నారాయణగూడ, హైదరాబాదు.

★ పారిజాతము(చారిత్రకనవల, రచన :శ్రీ వక్కలంక లక్ష్మీపతిరావు, పేజీలు: 144, వెల: రు 6/–,ప్రతులకు:రచయిత, భూపయ్యఅగ్రహారం, అమలాపురం–533201.

★ మందారమాల (పద్యసంపుటి) రచన: శ్రీ కోదండరామాచార్యులు, పేజీలు: 32, వెల: రు. 2/ ప్రతులకు: (1) రచయిత, వనంవారి కొండాపురము, వరంగల్ జిల్లా. (2) రచయిత, జూనియర్ తెలుగు లెక్చరర్; ప్రభుత్వ కళాశాల, ఖమ్మం–507002.

★ కళాశాల వార్షికసంచిక (ప్రభుత్వ పింగిళిమహిళా కళాశాల, వరంగల్‌వారి 1977 78 వార్షికసంచిక) ప్రధాన సంపాదకులు: శ్రీ జి. వి. యల్. యన్. విద్యాసాగరశర్మ; ఇతవరి విద్వాన్ టి. వి. సుబ్బారావు, సంపాదకురాలు: కుమారి ఇ. రేణుక. ఇందులో ఉపాధ్యాయ, విద్యార్థి విద్యార్థులు కథలు, కవితలు, వ్యాసాలు, కాలేజీ కార్యక్రమాల వివరాలు వున్నాయి.

★ సినీసొసైటీ(తిరుపతి ఫిలిం సొసైటీ పక్ష పత్రిక) 3 వ వార్షికోత్సవ ప్రత్యేక సంచిక. సంపాదకుడు: శ్రీ భాస్కర్ వేణుగోపాల్. వివరాలకు, తిరుపతి ఫిలిం సొసైటీ,తిరుపతి.

★ నెలవంక (ఆంధ్ర సారస్వత పరిషత్తు ప్రాచ్యకళాశాల హైదరాబాదువారి 1977–78 వార్షిక సంచిక) గౌరవ సంపాదకులు: శ్రీ కె. కె. రంగనాధాచార్యులు, హితవరి శ్రీమతి ఎన్. కోటీశ్వరి; సంపాదకుడు: శ్రీ కె. శ్రీనివాసాచార్యులు. ఈ సాహిత్య వార్షిక సంచికలో వ్యాసాలు కవితలు పరిచయవేదికలు మొదలయినవి వున్నాయి.

★ ఊహాశక్తి (ద్విమాస సైన్సుపత్రిక) సంపాదకుడు ఆచార్య సి పద్మనాభరావు. పేజీలు: 8, సంవత్సర చందా. రు. 3. వివరాలకు: కార్యదర్శి, శ్రీ వివేకానందా విద్యాపరిషత్, ఎ. సి. నగర్, నెల్లూరు 2.

★ యువస్వరాలు (సచిత్రమాస బుల్లెటిన్) ఎడిటర్, శ్రీడి. సి. రత్నం. వెల, 30 పై. పేజీలు, 16, వివరాలకు: యువస్వరాలు, 10-1-661, వెస్ట్‌మారెడ్డిపల్లి, సికిందరాబాదు 500026.

★ ఉదయసాహితి (సాహితీ సాంస్కృతికసంస్థ, హైదరాబాదు వారి ప్రచురణ) వివరాలకు: నవయుగబుక్‌హౌస్, సుల్తాన్ బజార్; హైదరాబాదు– 500001.

**Printed and Published for Nageswara Rao Estate (Private) Ltd., by S. Radhakrishna at the Andhra Patrika Press, Gandhinagar, Vijayawada-3. Editor S. Radhakrishna, Vijayawada. Phones: 75667 & 75226.**